# వ్యావహారిక భాషావికాసం

డాక్టర్
బూదరాజు రాధాకృష్ణ

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజయవాడ

# వ్యావహారిక భాషా వికాసం

డాక్టర్
బూదరాజు రాధాకృష్ణ

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-520004



ప్రచురణ సంఖ్య : 994
ప్రతుల సంఖ్య : 2000
ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1972
ద్వితీయ ముద్రణ : జూలై, 1981





వెల : రు. 10/-

ముద్రణ :
స్వతంత్ర ఆర్టు ప్రింటరు,
విజయవాడ-520 004.

# నా మాట

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించదలచిన 'ఆంధ్రభాషా చరిత్ర' అనే గ్రంథంలోని ఒక ప్రకరణంగా ఇరవయ్యో శతాబ్ది తెలుగును గురించి, భాషా వివాదాలను గురించి, నేను ఒక సంగ్రహవ్యాసం రాయవలసి వచ్చింది. దాన్ని ప్రపంచించి ఆ సంస్థవారే ఈ విషయంమీద నిర్వహిస్తున్న పోటీలో ఎందుకు పాల్గొనరాదని మిత్రులు డాక్టర్ చేకూరి రామారావు, శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావు, మరి ఇతరులూ ప్రశ్నిస్తూవుండేవాళ్ళు. నేను మొదట పట్టించుకోలేదు. ఈలోగా పోటీసమయం మించి పోవటం, పోటీవ్యాసాలు బహుమానయోగ్యాలు కావనటం వ్యవధి పొడిగించటం వంటివి జరిగేయి. ఆ తరవాత పైమిత్రులు నేను రాస్తున్నాననే ప్రవాదం పుట్టిస్తున్నామని నాకే చెప్పేరు. ఆధారగ్రంథాలు కొన్ని తెచ్చిపెట్టేరు. వారి నిర్బంధప్రేమకు నా కృతజ్ఞతలు. మరికొంద రిచ్చిన సహాయం, వ్యాసరచన చేయకతప్పని పరిస్థితి కల్గించింది.

ఆచార్య బి. రామరాజుగారు మధ్యయుగాంధ్ర సాహిత్యంనుంచి సరికొత్త వ్యావహారిక ప్రయోగాలు సేకరించి ఇచ్చారు. అప్పటికి సజీవులైన డాక్టర్ ఎం. కందప్ప చెట్టి తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారి పి. హెచ్. డి. పట్టం సంపాదించిన తన మధ్యయుగ శాసనభాషాచరిత్రనిచ్చి ఆయా విశేషాలను వాడుకొమ్మన్నారు. నా ప్రాచీనాంధ్రశాసనభాషా చారిత్రక వ్యాకరణాన్ని సంక్షేపించి తన పరిశోధన ఫలితాలను జోడించి సంగ్రహంగా శాసనభాషావికాసం రచించమన్నారు. ఈ సహాయాలు మొదటిమిత్రుల నిర్బంధాన్ని తీవ్రతరం చేసింది. ఫలితం ఈ రచన. వీరందరికీ నేను ఋణపడివున్నాను.

ఈ విషయంమీద నాకన్నా మహత్తరంగా రాయగలవాళ్ళు, వ్యావహారికోద్యమంతో బహుకాలంగా ప్రత్యక్షసంబంధమే ఉన్నవాళ్ళు, చాలామంది ఉన్నారని నాకు తెలుసు. కాని అటువంటి పెద్దలు పోటీల్లో పాల్గొనేటంత సామాన్యరచయితలు కాదలచకపోతే ఈ రచన ప్రయోజనవంతం కావచ్చుననుకొన్నాను. భాషాచరిత్ర విద్యార్థులకు ఉపయోగపడే అనేకవిషయాలను ఆధునిక పద్ధతిలో అందించగలగటం, మాండలిక ప్రామాణికభాషాది విభేదాలమీద ప్రాచీనార్వాచీనభావాలను క్లుప్తంగానైనా ఒకేచోట సమకూర్చటం వంటివి రచనాప్రయోజనాలుగా భావించాను. మరొకరితో

దాటు నాకూ బహుమానం ఇవ్వాలనుకున్నారు. నాకు వద్దన్నాను. అయితే ప్రచురించటం కష్టసాధ్యమనే సత్యం గుర్తుకు వచ్చింది. ఆ సమయంలో ప్రచురణావకాశం కలిగించిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి నా కృతజ్ఞతలు.

ప్రచురణకు రాతప్రతిని పంపేసమయంలో రెండో ప్రతిని యాదాలాపంగా చూస్తే అందులో అక్కడక్కడ ఎవరో ఏమేమో పెన్సిలుతో రాసిన విమర్శలు కనిపించాయి. వాటిని అర్థంచేసుకోటానికి ప్రయత్నించాను. నా వ్యాసంలోని విషయాలకన్నా ఈ విమర్శకాభిప్రాయాలు అమూల్యంగా ఉన్నట్లు తోచింది. వాటికి సహప్రచురణయోగ్యత కల్పించటం సంభావ్య మనిపించింది. ఆ పనే చేశాను— సంక్షిప్తసమాధానాలతోసహా. అనుబంధంలో వీటిని చూడవచ్చు. పాఠకులే మంచి చెడ్డలు నిర్ణయించుకోవచ్చు.

రెండోది ఈ వ్యాసాన్ని పోటీకి సమర్పించిన తరవాత ఈ విషయానికి ప్రత్యక్షంగానో పరోక్షంగానో సంబంధించిన మరికొన్ని వ్యాసాలను భిన్నసందర్భాల్లో రాశాను. వాటిలో ఉన్న సరికొత్త విశేషాలు ఇందులో చేర్చలేదు. ఇందులోని కొన్ని కొన్ని విషయాలను పునర్విమర్శించి పునారచించాలని నాకే అనిపిస్తున్నది. కానీ అట్లా చేయలేదు. సవరించటం అనేది పునర్ముద్రణ భాగ్యం కలిగినప్పటి మాట. విమర్శనలు తట్టుకొని వ్యాసం బతికినప్పటి మాట.

ఇందులో వ్యావహారిక భాషావికాసానికిచ్చిన ప్రాధాన్యం ఉద్యమచరిత్రకు ఇవ్వలేదు. వ్యక్తుల వాదోపవాదాలకన్నా భాషాపరిణామక్రమమే ముఖ్య మనుకున్నాను. ఈ నా లోపాన్ని పాఠకలోకం క్షమిస్తుందని ఆశిస్తున్నాను.

నేను కోరగానే వ్యాసప్రచురణకు అంగీకరించిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి మరోసారి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. ముద్రాపకులు క్రాంతి ప్రెస్ యజమానులు శ్రీ ధనికొండ హనుమంతరావుగారికి, ముఖపత్ర రచయితలు చిత్రకారులు శ్రీ చలసాని ప్రసాదరావుగారికీ నా కృతజ్ఞతలు.

— బూదరాజు రాధాకృష్ణ

# ద్వితీయ ముద్రణ పీఠిక

1972లో మొదటిసారి అచ్చయిన ఈ పుస్తకం ఆరేళ్లలో ద్వితీయ ముద్రణకు వచ్చింది. ఇటువంటి రచనలు పునర్ముద్రణకు నోచుకోవటమే విశేషం.

ఇందులో ఒకటి రెండు చోట్ల కొద్దిపాటి సవరణలు మాత్రం చేశాను. పునా రచించలేను.

రెండోసారి ఈ గ్రంథం ప్రచురిస్తున్న విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి, ముద్రాపకులు స్వతంత్ర ఆర్టు ప్రింటర్స్, విజయవాడ వారికి నా కృతజ్ఞతలు.

—బాపురాజు రాధాకృష్ణ



## అంకితం

విద్యావ్యసనంతో అల్పాయుష్కుడైన

కీర్తిశేషుడు

డాక్టర్ ఎం. కందప్ప చెట్టికి

# విషయసూచిక

# ముఖ్యసంకేతాలు

## I. తెలుగులో

అని. = అనిరుద్ధచరిత్ర
అప్ప. = అప్పకవీయము
ఆం. ప. = ఆంధ్రపత్రిక
ఆం. శ. చిం. = ఆంధ్రశబ్దచింతామణి
ఆం. సా. చ. = ఆంధ్రుల సాంఘిక చరిత్ర
ఆం. సా. ప. ప. = ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక
ఉ. రా. = ఉత్తరరామాయణము.
ఉషా పరి. = ఉషాపరిణయము
ఎపి. ఇం. = ఎపిగ్రాఫియా ఇండికా
కట్టా = కట్టా వరదరాజు
కళాపూ. = కళాపూర్ణోదయము
కాశీ. = కాశీఖండము
కాళ. మా. = కాళహస్తి మాహాత్మ్యము
కాళిందీ = కాళిందీకన్యాపరిణయము
కృష్ణ. విజ. = కృష్ణరాయ విజయము
జైమి. భార. = జైమినీ భారతము
తి. తి. (శా.) = తిరుపతి తిరుమల శాసనాలు
తె. శా. = తెలంగాణా శాసనాలు
ద. హిం. శా. = దక్షిణహిందూదేశ శాసనసంపుటి
దేవకీ. శత. = దేవకీనందన శతకము
న. సా. వీ. = నవ్యాంధ్రసాహిత్యవీథులు
నిరంకు. = నిరంకుశోపాఖ్యానము
నె. శా. = నెల్లూరుజిల్లా శాసనసంపుటి
పాండు. = పాండురంగమాహాత్మ్యము
పార్వ. పరి. = పార్వతీపరిణయము
ప్రౌ. వ్యా. = ప్రౌఢవ్యాకరణము
బా. వ్యా. = బాలవ్యాకరణము

భార. = భారతము
భీమ. = భీమేశ్వరపురాణము
మను. = మనుచరిత్ర
రంగరా = రంగరాట్ఛందము
వరాహ. = వరాహపురాణము
వైజయంతీ. = వైజయంతీ విలాసము
శా. ప. మం. = శాసనపద్యమంజరి
సుం. విజ. = సుంకుమారవిజయము
హంస = హంసవింశతి
హరి. = హరివిలాసము

(తక్కిన అనేకగ్రంథాల విషయంలో పూర్తిపేర్లే ఇచ్చాను)

## II. ఇంగ్లీషులో

AR = Annual Report of the Epigraphy Department material from unpublished transcripts.

CIT = A Corpus of Inscriptions in the Telingana Districts ...

CP = Copper Plate grant-unpublished transcript.

IA = Indian Antiquary.

JAHC = Journal of Andhra History and Culture.

JAHRS = Journal of Andhra Historical Research Society.

RPS = Rajarajanarendra pattabhiseka Sanchika.

TVB = Telugu Verbal Bases.

## ముఖ్యగమనిక

ఎపి. ఇం. 27.229-30. 1-2,600-25 అంటే క్రీ. శ. 600-625 మధ్య కాలంలోని శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా 27 వ సంపుటంలోని 229, 230 పేజీల మధ్య దొరికే శాసనపాఠంలోని మొదటి రెండు పంక్తుల్లో ఉద్దిష్ట భాషా రూపం దొరుకుతుందని అర్థం. దక్షిణ హిందూదేశశాసనాల విషయంలో మొదట ఇచ్చిన సంఖ్య సంపుటసంఖ్య (Volume number); దాని తరవాతిది సాధారణ సంఖ్య (general number); ఆ మీదిది పంక్తిసంఖ్య.

# 1. ఉపోద్ఘాతం

§ 1.0 'వ్యావహారిక భాషా వికాసము-చరిత్ర' అనే శీర్షికను జాగ్రత్తగా పరిశీలిస్తే అందులో ఉన్న శబ్దాలనుబట్టి వ్యాసరచనోద్దేశం బహువిధాలుగా ఉండాలనిపిస్తుంది. 'వికాస' శబ్దానికి క్రమపరిణామమనే అర్థముంది కాబట్టి మనకు తెలిసినప్పటినుంచీ ఈనాటివరకూ వ్యావహారికభాష కాలక్రమాన ఏ విధంగా పరిణమిస్తూవచ్చిందో వివరించవలసి ఉంటుంది. 'వ్యావహారిక భాష' అనగానే దానికి విరుద్ధమైన-లేదా ఇతరమైన-'మరో భాష' ఉన్నదనీ, దాని ప్రభావం దీని మీద, దీని ప్రభావం దాని మీద ఎంతగా ఉన్నదో, ఇతరేతర ప్రభావాల వల్ల వాటి పరిణామ దశల్లో ఏ విధమైన మార్పులు వచ్చేయో సూచించవలసి ఉంటుంది. 'భాషా' శబ్దం అత్యంత విస్తృతమయింది. మొత్తం తెలుగు 'భాష'లో 'వ్యావహారికభాష', 'గ్రాంథిక భాష' అనేవి అంతర్భాగాలు మాత్రమే. అందువల్ల భాషాశబ్దానికున్న అర్థాన్ని, అర్థభేదాలనూ వివరించటమే కాక వాటికి క్రమపరిణామంలో ఏయే పేర్లు యెలా మారుతూ వచ్చేయో నిర్దేశించటం మరో కర్తవ్యం. శీర్షికలో తెలుగు భాషా చరిత్రలో వచ్చిన వికాసాన్ని 'వ్యావహారిక' శబ్దంతో కలిపి ప్రస్తావించారు. వ్యావహారికం వాగ్రూపంలోనూ లిఖితరూపంలోనూ ఉంటుంది. కాని గడచిన శతాబ్దంలో బయలుదేరిన ఒక మహోద్యమ సందర్భంలో వాగ్రూప వ్యవహారానికే పేరుగా రూఢ్యర్థం సంతరించుకొంది. ఆ ఉద్యమమే ఈ 'వ్యావహారిక భాషా' వాదాన్ని మొదలెత్తి ఈనాటివరకూ సాగిస్తూ వచ్చింది. ఆ ఉద్యమవికాసంతోబాటు ఈ వాద వికాసంగూడా అవినాభావ సంబంధంతో అర్థభేదాలను సంపాదించుకుంది. ఆ ఉద్యమ ఫలితంగానే ఈ వాదం నానాటికీ బలం పుంజుకొని నేటి లిఖిత వ్యవహారానికి నవీనరూపం, ప్రయోజనం కల్పించింది. అందువల్ల భాషావికాసానికి ఉపోద్బలకంగా ఆ వాద వికాసాన్ని వివరించకపోతే ఈ వ్యాసరచన ప్రయోజనవంతం కాదు. అంటే వ్యావహారికభాషోద్యమవికాసాన్నికూడా చర్చించవలసి ఉంటుంది. ఇక మిగిలిన 'చరిత్ర' శబ్దం వికాసశబ్దంవల్ల గతార్థమయినా స్పష్టతకోసం ఉన్నదని భావిస్తున్నాను.

§1.1 పై కారణాలవల్ల ఆయా విశేషాలను ప్రత్యేకంగా వేర్వేరు ప్రకరణాల్లో చర్చిస్తాను. అవి: 1, 2. వ్యావహారిక భాషా వికాసం: శాసనాల్లో, సాహిత్యంలో; 3. వ్యావహారికభాషావాదం: పూర్వరంగం; 4. వ్యావహారికోద్యమ చరిత్ర; 5. వాదోపవాదాలు: సిద్ధాంత చర్చ; 6. ఆధునిక పరిస్థితి: ప్రమాణీకరణ ప్రయత్నాలు.

§ 1.2 వ్యాసారంభంలోనే ఈ చర్చలకు సంబంధించి బహుళవ్యాప్తిలో వాడుకలో ఉన్న కొన్ని శబ్దాలను, వాటి అర్థాలను నిష్కర్షగా నిరూపించుకోవలసి ఉంది. 'గ్రాంథికం, వ్యావహారికం, భాష, మాండలికం, గ్రామ్యం, ప్రామాణికం, శైలి, వ్యాకరణం' మొదలైనవి వాటిలో ముఖ్యమైనవి. ఆయా శబ్దాలను గురించిన విపులవిమర్శ సందర్భానుసారంగా ఆయా ప్రకరణాల్లో చర్చకు వస్తుంది కాబట్టి ఇక్కడ స్థూలనిర్దేశం మాత్రమే చేస్తున్నాను.

§ 1.3 గ్రంథ గతమైన భాష అంతా గ్రాంథిక మవుతుంది. కాని ఉద్యమారంభ కాలంలోను ఆ తరవాత కూడా నన్నయనుంచి చిన్నయవరకు కావ్య రచనలో ఉపయుక్తమైన భాషాభేదమే గ్రాంథికమని పండితులు భావించారు. 'కావ్యభాష' వ్యవహారబలంవల్ల రూఢమై 'గ్రాంథికభాష'గా స్థిరపడింది. అయితే ఇప్పటి పరిస్థితిలో చాలా పెద్ద మార్పు వచ్చింది. ఆధునికాంధ్ర సారస్వతంలో పై భాషాభేదానికి వాడుక బాగా సన్నగిల్లి అత్యధిక సంఖ్యాకంగా వ్యావహారికంలోనే గ్రంథాలు వస్తున్నాయి. ప్రస్తుతం ఈ శబ్దాన్ని పూర్వకాలికార్థంలో ప్రయోగించటం అనుచితమనిపిస్తుంది. అందువల్ల ఈ వ్యాసంలో గ్రాంథిక పర్యాయంగా 'కావ్యభాష' అని మాత్రమే వ్యవహరిస్తుంటాను.

§ 1.4 'వ్యావహారికం' అనేది కూడా అంత మంచి మాట కాదు. జీవద్భాష ఏ రూపంలో ఉన్నా వ్యవహారంలో ఉన్నట్లే. శిష్టవ్యవహారంలో-అందులోనూ వాగ్వ్యవహారంలో-ఉండి కావ్య వ్యవహారంలో-ప్రముఖంగా లిఖితవ్యవహారంలో-లేని భాషారూపాన్ని పూర్వులు వ్యావహారిక మన్నారు. వాగ్రూపంలో శిష్టవ్యవహారంలో ఉన్నా అదే శిష్టుల రచనల్లో స్థానం సంపాదించుకోలేకపోయిన భాషావిశేషమే వారు వ్యావహారిక భాష అని పిలిచింది. మారిన పరిస్థితులనుబట్టి దాని ఇప్పటి అర్థమెంత మారినా 'శిష్టవ్యావహారిక' మనే పదానికి దాన్ని సంక్షిప్త రూపంగా పరిగణించటానికి అభ్యంతరం లేదు; అయితే వాగ్వ్యవహార, లిఖితవ్యవహారాలు రెంటిలోనూ బహుళవ్యాప్తిలో ఆధునికకాలంలో ఉపయోగపడుతున్న భాషావిశేషం ఇదేనని గుర్తించాలి.

§ 1.5 'భాష' శబ్దం చాలా విస్తృతంగా విశృంఖలంగా వాడుకలో ఉంది. తమ తమ అభిప్రాయాలను అన్యోన్యం తెలుపుకోటానికి ప్రజలు ఉపయోగించే ధ్వనిసమూహమే భాష. దీనికి తెలుగులో వాక్, లిఖిత రూపాలు రెండూ ఉన్నాయి. లిఖితరూపాన్ని గ్రాంథికమని, వాగ్రూపాన్ని వ్యావహారికమని, వీటికి భాషాశబ్దాన్ని కూడా చేర్చి వ్యవహరించటం మనకు సంప్రదాయ మయిపోయింది. అంతమాత్రాన అవి భిన్నభాషలనే అర్థమేమీ రాదు-రాకూడదు; అవి ఒకే భాషకున్న భిన్నరూపాలు మాత్రమే.

§1.6 'మాండలిక' శబ్దం తెలుగులో అనేక అర్థాలకు దారితీసిన మాట. ఒక ప్రాంతంలో (మండలంలో) వాడుకలో ఉన్న భాషాభేదాన్ని మాండలికమని వ్యవహరించవచ్చు. వేదం వేంకటరాయశాస్త్రిగారెప్పుడూ దీన్ని 'మండలీయక' మని వ్యవహరించేవారు. ఆ యా ప్రాంతాల్లో కుల, మత, వృత్తి భేదాలనుబట్టి భాషారూపాల్లో వచ్చే భేదాలను గూడా మాండలిక మనే వ్యవహరిస్తున్నారు. పరస్పరావగాహనం చాలా తక్కువగా ఉండి ఆంధ్రేతరప్రాంతాల్లో ఉన్న తెలుగువాళ్ళ వ్యవహారంలో ఉన్న 'వదరీ, కామాటీ, ఓరాదీ' వంటివి కూడా మాండలికాలుగానే వ్యవహృత మవుతున్నాయి. వీటిని మాండలిక 'భాష' లని కూడా పిలుస్తున్నారు. కాని ఆంగ్లంలోని 'literary dialect', 'colloquial dialect' అనే పదాలను అనువదించేటప్పుడు 'సాహిత్య భాష', 'వ్యవహారభాష' అంటున్నారుగాని వాటిని మాండలికాలుగా పరిగణిస్తున్నట్లు కనిపించదు. ఈ విభేదాలన్నీ భాషాసమష్టిలో భాగాలే. ప్రాంతీయాది భేదాలను సూచించేటప్పుడు మాండలికాలని, కామాటీ, వదరీ లాంటి తీవ్ర భేదాలను ప్రస్తావించేటప్పుడు మాండలికభాషలని వ్యవహరించటం స్పష్టతకోసం మంచిది. సాంఘిక భేదాలనుబట్టి భాషలో కనిపించే భిన్నరూపాలను వర్గమాండలికాలని (class dialects) పిలవటం, ప్రాంతభేద సూచకాలుగా ఉన్నవాటిని ప్రాంతీయ మాండలికాలు (regional dialects) అనటం స్పష్టత కోసమే నియతంగా జరగాలి. కావ్యభాషను కొందరు సాహిత్యక మాండలికంగాను, మరికొందరు యాస (slang) గాను పరిగణించినవా రున్నారు. ఇటీవల 'గ్రాంథిక శైలి', 'వ్యావహారిక శైలి' అనే పేర్లతో వ్యవహరించటం వచ్చింది. మచ్చుకు పాఠ్యగ్రంథరచనలో ఉపయోగించవలసిన భాషాభేదాన్ని నిరూపించవలసిన సంఘానికి ప్రభుత్వంవారు 'శైలీసంఘం' (Style Committee) అని పేరు పెట్టేరు.[1]

§ 1.7 'శైలి' రచనాపద్ధతి అనే అర్థంలో సాహిత్యపరిభాషలో ఇటీవల ప్రవేశించిన శబ్దం. 'శైలూషా' శబ్దమేగాని 'శైలి' అనేది పూర్వాలంకారికులు వాడిన మాటగా కనిపించదు. ఈ నూతన శబ్దాన్ని వ్యవహారపద్ధతిగా భాషా విషయాల్లో ఉపయోగించవచ్చునేమోగాని భాషాభేదంగా పరిగణించటం సమంజస మనిపించదు. కావ్యశైలి, వ్యవహారశైలి అనేవి ఆయా భాషాభేదాల్లో విలక్షణంగా కనిపించే రచనాపద్ధతులు కావచ్చునేమోగాని వాటి స్వభావాన్ని వివరించేవి కావు. పదజాలం, నిర్మాణక్రమం మొదలైన భాషాంశాలు స్ఫురించని ఈ పదాన్ని ఇక్కడ మాండలికమనే అర్థంలో ఉపయోగించటం లేదు.

§ 1.8 'గ్రామ్య' శబ్దానికి గ్రామీణుల భాషాభేదమనే యౌగికార్థం. రూఢిలో—లాక్షణిక సంప్రదాయ ప్రాబల్యంవల్ల—బూతుమాట అనే అర్థం వచ్చిపడింది. దీన్ని మరో అర్థంలో ప్రయోగించటం మంచిది కాదు. గ్రాంథిక భాషావాదులు చాలాకాలం శిష్ట వ్యవహారాన్ని ఈ పేరుతో నిందించి ఇప్పుడు ఎందుచేతనో ఈ పదాన్ని ఈ అర్థంలో ఉపయోగించటం మానివేశారు. లాక్షణికులు గ్రామ్యాన్ని నింద్యమనీ అనింద్యమనీ రెండుగా విభజించి వాటిలో రెండోది కావ్య ప్రయోగార్హమని కష్టంమీద ఇష్టపడ్డారు. కొందరు వైయాకరణ సంప్రదాయంలో గ్రామ్యానికి యౌగికార్థమే ఉందని వాదించారు. వాదప్రయోజనానికిగాని, శాస్త్రీయ పదంగా ఉపయోగించక తప్పని పరిస్థితిలోగాని వాడటంకన్నా కేవలం నిందా దృష్టితోనే దీనికి ఎక్కువ వ్యాప్తివచ్చింది. కాబట్టి ఈ వ్యాసంలో ఈ శబ్దానికి సాంకేతిక పదగౌరవం లేదు.

§ 1.9 అనేకవిధాలుగా భిన్నార్థాలలో వాడుకలోకి వచ్చిన మాటల్లో 'ప్రమాణ' శబ్దమొకటి. చాలామంది సంప్రదాయ పండితుల దృక్పథంలో దీనికి వ్యాకరణ 'సూత్ర' మనే అర్థం. లేదా కావ్యప్రయోగమనే అర్థమయినా ఉంటుండేది. సూత్రరూపంలో ఉన్న వ్యాకరణాన్ని (వ్యాకరణ గ్రంథాన్ని) తూచా తప్పకుండా అనుసరించిన కావ్యభాషకే 'ప్రామాణిక భాష' అనే పేరు వచ్చింది. 'గ్రాంథిక భాష' అనేదానికి ఇది పర్యాయపదమని చాలామంది దృష్టి. గంటి జోగి సోమయాజి గారివంటి కొందరు ఇది కొంత వేరని, గ్రాంథికభాషలో ప్రవేశించదగ్గ వ్యావహారిక రూపాలకు కూడా రూపనిష్పత్తి సాధించి 'సూత్రాలు' రాసినప్పుడు ఏర్పడే నూతన భాషావిశేషమే ప్రామాణిక భాష అని వాదించారు (చూ. కేతవరపు రామకోటిశాస్త్రిగారు: "ప్రామాణిక భాష...." ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం. 15-10-1955). ఈ ఉభయవాదాలకూ సమానలక్షణం ఒకటి ఉంది—భాషా లక్షణాలను 'సూత్రబద్ధం' చేయనిదే ప్రమాణం ఏర్పడదని. వ్యావహారికం నియమరహితమనే వాదంలోలాగానే ఇక్కడ కూడా భాషలో సహజంగా ఉన్న సుస్థిరనియమాలు ప్రమాణాలు కావు; వాటికి సూత్రరూపంలో లిపిబద్ధం చేసిన వ్యాకరణమే ప్రమాణం. లిఖితరాజ్యాంగంలేని బ్రిటిష్‌దేశానికి రాజ్యాంగమేలేదని వాదించట మెంత సక్రమమో ఇదీ అంతే. ఈ వాదం ప్రకారం భాషలో అంతర్లీనంగా ఉన్న నియమాలను క్రోడీకరించిన వ్యాకరణ 'గ్రంథానికీ', అందులోని 'సూత్రాలకూ' సరిపడని లక్షణాలన్నీ అప్రామాణికాలు. అలాటి లక్షణాలున్న భాష అప్రామాణికం. అశక్తతవల్లగాని, అనిష్టతవల్లగాని, ఎవరైనా భాషలోని లక్షణాలన్నిటినీ ఏకత్రపరిచి సూత్రబద్ధంచేసి లిఖితరూప మివ్వలేకపోతే ఈ వాదరీత్యా భాష అప్రామాణిక మవుతుందేగాని వ్యాకర్త అప్రయోజకుడు కానట్లుంది. పైవారి ఉద్దేశంలో ప్రమాణమన్నది ఒకే ఒకటి ఉంటుందని, అది

సార్వకాలికసత్యమని ఒక దురూహ ఏర్పడింది. భాషావేత్తల దృష్టిలో ఈ ప్రమాణాలు అనేకం. అవి దేశకాలపాత్రనిబద్ధమై భాషాభేదాలనుబట్టి, భాషాభాషుల అభిరుచులనుబట్టి, వారి వారి అవసరాలనుబట్టి మారుతుంటాయి. ఆ ప్రమాణాలను వ్యాకరణ సూత్రాలు 'నిర్ణయించవు'; వాటిని గుర్తించి విపులంగా 'నిరూపిస్తాయి'. ఈ గుర్తింపే వ్యాకరణ ప్రయోజనం. మనం గుర్తించలేనంత మాత్రాన ప్రమాణాలు లోపించవు. ఒక మొక్క పేరు వృక్షశాస్త్రజ్ఞుడికి తెలియనందువల్ల, అతని శాస్త్రగ్రంథం ప్రస్తావించనందువల్ల, మొక్క అస్తిత్వానికి భంగం రాదు. రోగస్వభావ నిర్ణయం సాధ్యపడకపోయినా నివారితమయ్యేవరకూ రోగముంటుంది. ఈ విషయాన్ని సందర్భపడినప్పుడు తరువాత చర్చిస్తాను. ఈ వ్యాసంలో ప్రమాణశబ్దాన్ని భాషావేత్తల దృక్పథానికి అనుగుణంగానే వాడుతుంటాను.

§ 1.10 వ్యాకరణశబ్దం తెలుగుదేశంలో అన్నిటికన్నా దురదృష్టకరమైన శబ్దం. ప్రాచీనులు సూత్రరూపంలో రాసిన కావ్యభాషాలక్షణాలనే వ్యాకరణమని గ్రాంథికభాషావాదులు వ్యవహరించారు-వ్యవహరిస్తున్నారు. భాష మొదటిది. దాని లక్షణాలను వివరించే ప్రయత్నఫలితంకాబట్టి వ్యాకరణం తరవాతిదని సంప్రదాయజ్ఞులైన పండితుల్లో కొందరు వాదించారు. భాష ఏరూపంలో ఉన్నా దాని పరిణామ క్రమం కొన్ని సుప్తనియమాలను అనుసరించే ఉంటుందని, ఆ నియమాలను వెలికి తీసి వివరించటమే వ్యాకరణరచనలోని ప్రధానోద్దేశమని, వివరణ లేనంతమాత్రాన వ్యాకరణమే లేదనటం సరికాదనీ మరికొందరి వాదన.[2] 'వ్యాకరణ' మనేది 'వ్యాకరణ గ్రంథానికి' పర్యాయపద మయిపోయింది. ఈనాటికి 'వ్యావహారిక వ్యాకరణం' కూడా వచ్చింది. కానీ వ్యాకరణంలేదనే అపవాదు ఎప్పటిలాగా ఉంది. ఈ వ్యాసంలో వ్యాకరణ శబ్దాన్ని భాషాశాస్త్రజ్ఞుల పద్ధతిలోనే ఉపయోగిస్తుంటాను.

# 2. వ్యావహారిక భాషా వికాసం

## శాసన భాషలో

§ 2.0 తెలుగుభాష అస్తిత్వం నిరూపించే లిఖితాధారాలు క్రీ. శ. 200 నుంచి లభిస్తున్నాయి. సంస్కృత ప్రాకృత శాసనాల్లోని వ్యక్తి నామ స్థలనామాలు ఈ ఆధారాల్లో ప్రముఖంగా ఉండేవి. క్రీ. శ. 575 నుంచి తెలుగు వాక్యాలతోటి శాసనాలు అవిచ్ఛిన్నంగా లభిస్తూనే ఉన్నాయి. మూడు శతాబ్దాల క్రితం వరకూ ధారావాహికంగా తామ్ర, శిలా శాసనాలు తెలుగు సీమలో వెలువడుతూ ఉండేవి. పూర్తిగా తెలుగు భాషలో ఉన్న మొట్టమొదటి తామ్రశాసనం క్రీ. శ. 725 ప్రాంతాలనుంచి మాత్రమే దొరుకుతున్నది (చూ. ఎపి. ఇం. 11. 337-47). తాటేకు పుస్తకాలు వాతావరణ పరిస్థితులు, మన వారి భక్తిశ్రద్ధలు కారణంగా మూడు నాలుగు వందల సంవత్సరాలకు పైకాలానివి దొరకటం లేదు. సింహళంలో పన్నెండో శతాబ్దినాటి తాళపత్రి గ్రంథాలు లభిస్తుండగా మనదేశంలో పదహారో శతాబ్దికి పూర్వానివి దొరకటం కష్టంగా ఉంది. ఆ తరవాత పేముకాగితాల పుస్తకాలు వచ్చాయి. మొత్తంమీద తెలుగు భాషకు అత్యంత ప్రాచీన నిదర్శనాలు శిలాశాసనాల రూపంలోను, ప్రాచీనమైనవి తామ్రశాసనమూలకంగాను దొరుకుతున్నాయి. గడచిన 300 సంవత్సరాల తాళపత్రప్రతులు, కాగితాల సాక్ష్యాలు ఇటీవలి నిదర్శనాల క్రిందనే లెక్క. క్రీ. శ. 11 వ శతాబ్దం నాటి నన్నయ మహాభారతమే తెలుగులో మొదటి మహాకావ్యం. ఆనాటి దాని లిఖితస్వరూపం యథాతథంగా దొరకటమే లేదు. తాళపత్రి ప్రతులలోని భారతస్వరూపం యథామాతృకం కాదు. శతాబ్దాల కాలంలో భాషా, లిపి, పరిణామాలు కలుగుతుండగా, సంస్కారభేదం గల అనేకవ్యక్తులు ఉత్తరలేఖనంలో తమ తమ భాషా భావాలను చొప్పిస్తుండగా, అనేక రూపాంతరాలు పొందిన భాషకు ప్రత్యంతర, పాఠభేదాలవల్ల సరైన పూర్వరూప నిర్ణయం చేయటం ఏ కొన్ని సందర్భాల్లోనో తప్ప ఇంచుమించు అసాధ్యమే. ముద్రణ సౌకర్యాలు వచ్చిన తరవాత పాత 'సంస్కరణ'మో, 'పరిష్కరణ'మో సంప్రదాయమై పోయి అర్వాచీన లాక్షణిక మతాలకు అనుగుణంగా ప్రాచీనభారతస్వరూపం మరికొంత మారిపోయింది. అంటే లిఖితసారస్వతభాషకు విశ్వసనీయ స్వరూపం మన కిప్పుడు అలభ్యమై పోయింది. కాగా ప్రాచీన భాషా స్వరూపాన్ని ఉన్నదున్నట్లుగా తెలుసుకోవానికి, మూలరూప పరివర్తనం అసాధ్యమయిన తామ్రశిలా శాసనభాషే ఏకైకాధారమయింది. ఇవి వినా కావ్యభాషకయినా వ్యావహారికానికయినా విశ్వసనీయమైన ఇతరాధారాలు లేవు. వీటి మీదనే ఆధారపడి నాటి భాషావికాసాన్ని విచా

పించుకోవలసి ఉంటుంది. వీటిలోనే కావ్యశైలికీ వ్యవహారశైలికీ నిదర్శనలు లభిస్తున్నాయి.

§ 2.1 నన్నయ యుగాంతం వరకూ (క్రీ.శ. 1100 వరకూ) ఉన్న శాసనాల్లో కావ్య భాషాశైలిలో ఉన్నవి ఏడెనిమిది కన్నా ఎక్కువ లేవు. వాటిలో ప్రాఙ్నన్నయ కాలానివి నాలుగూ, నన్నయ సమకాలానివి రెండూ-మొత్తం ఆరు శాసనాలు మాత్రమే 'పద్య' శాసనాలని స్పష్టంగా చెప్పవగినవి (చూ. పండరంగు అద్దంకి శాసనం—క్రీ.శ. 848. భారతి 5.484., పండరంగు కందుకూరు శాసనం—క్రీ.శ. 848-49. భారతి 5.792., ధర్మవరం శాసనం—క్రీ. శ. 897. భారతి 5.618., యుద్ధమల్లుడి బెజవాడ శాసనం—క్రీ. శ. 898_931. ఆ. ప. మం. 1. 2- 3., దక్షారామ శాసనం— క్రీ. శ. 1065. ద. హిం. శా. 4.1007., బీదాని శాసనం—క్రీ. శ. 1075_76. ఎపి. ఇం. 4.314_18). కావ్యభాషకు మనకు ఇప్పటికి లభించిన ప్రధానాధారాలు ఇవి మాత్రమే. తంగిరాల నారాయణశాస్త్రిగారి అముద్రిత పరిశోధన వ్యాసం (ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథాలయంలో లభిస్తుంది) ప్రాఙ్నన్నయ యుగంలోనే వింశత్యధిక సంఖ్యలో పద్యశాసనా లున్నట్లు పేర్కొన్నా, అవన్నీ 'వృత్తగంధి' వచనాలే నని వారే అంగీకరించారు (పే. 262 నుంచి). దివాకర్ల వేంకటావధానిగారు "తెలుగునందలి వృత్తగంధి గద్యములు" అనే వ్యాసంలో (ఆం. సా. ప. ప. 44. 211-23) చర్చించినవే ఇందులోకూడా ఉన్నాయి. కావ్యభాషాశైలిలో రాసిన కొరవి శాసనం (తె. శా. 1.163_65)వంటివి ఒకటి రెండు తప్ప తక్కినవన్నీ మామూలు వ్యవహారభాషారూపంలో ఉన్నవే; వచన శాసనాలే. అందువల్ల ప్రాఙ్నన్నయ కావ్యభాషకు పై ఏడెనిమిది శాసనాలు తప్ప వేరు నిదర్శనాలు దొరకలేదు. మిగిలిన దాన శాసనరూపకమైన వ్యావహారికానికి చరిత్రాత్మక వ్యాకరణం రాసినప్పుడు కాలక్రమాన ఆ భాషాస్వరూపం ఏ విధంగా మారిందో తెలుస్తుంది. ఆ భాష ఎప్పుడూ నియమబద్ధంగానే ఉండేదని, కొన్ని నియమితపద్ధతుల్లోనే దాని క్రమవికాసం నిరూపించవచ్చునని, ఈనాటి శిష్టవ్యవహారానికీ ఆ శాసనభాషకూ చరిత్రాత్మకమయిన, క్రమపరిణామరూపకమయిన సంబంధముందనీ తెలుస్తుంది. పైన పేర్కొన్న పద్యశాసనాల్లో మొదటిదైన పండరంగు అద్దంకి శాసనకాలంనుంచి—అంటే క్రీ. శ. తొమ్మిదో శతాబ్దంనుంచి— కావ్యవ్యవహార భాషలు ఒకదాని కొకటి దూరమై పోవటం మొదలయిందని కూడా తెలుస్తుంది. క్రీ. శ. పదకొండో శతాబ్దిలోని నన్నయ కావ్యభాషతో ఆనాటి శాసన భాషను పోల్చి చూస్తే అప్పటికే కావ్యభాషావ్యావహారికాలు చాలా భిన్నంగా ఉన్నాయని తెలుస్తుంది. గిడుగు వేంకటరామమూర్తిగారు నన్నయ భారత భాషకూ నందంపూడి శాసనభాషకూ మార్పు లేనట్లే భావించారు. "రాజరాజు కాలమందున్న తెలుగుపండితుడు నన్నయభట్టు స్వయముగా రచించినవి ఈ రెండు విధములయిన వ్రాతలున్న ఉన్నవి. భారతము కావ్యభాషను వ్రాసినది. నందంపూడి శాసనములోని

గ్రామముల సరిహద్దు వివరణము వ్యావహారికభాషను వ్రాసినది అని ఊహించవలెను. రెండవ దానిలో ఉన్న ఎనిమిది వాక్యములనుబట్టి ఆ కాలమందుకూడా ఈ కాలమం దున్నట్టి భాషలో వైవిధ్య మున్నట్టు నిశ్చయింపలేము. ఎందుచేతనంటే శాసనములోని భాష భారతములోని తెలుగు వలెనే ఉన్నది .... (పే.32) .... నన్నయ స్వయముగా వ్రాసిన వ్రాతను ఎదుటనుంచుకొని (నన్నయ సమక్షమందు?) రాగిరేకు మీద గండాచార్యుడు యథాస్థితిగా శాసనము చెక్కినట్టు శాసనమందే ఉన్నది గదా (పే. 41)"—వ్యాసావళి. పై వాక్యాల్లో మొదటి రెంటికీ చివరి దానికీ అంత పొంతన కనిపించదు. నన్నయ నందంపూడి శాసనభాషకూ అతని భారతభాషకూ చెప్పుకోతగ్గ భేదం లేదనేది నిర్వివాదం. సమకాల శాసన భాషతో భారత భాషను తులనాత్మకంగా పరీక్షించనప్పుడు మాత్రమే ఆ రెంటికీ భేదం లేదని చెప్పగలం. తరవాతి ప్రకరణాల్లో ఇందుకు నిదర్శనలు ప్రదర్శిస్తాను. మొదటి నుంచీ అంతో ఇంతో భేదముండగా రానురాను అది బలపడుతూ నేటికి భూమ్యాకాశాల మధ్య ఉన్నంత అంతరం వచ్చిందని చెప్పగలం. కవిత్వం పాండిత్యం అనేవే కాదు — విద్యా సౌకర్యాలు కూడా కొంతమందికే పరిమితమైన ఆ కాలంలో, సంస్కృతంనుంచి ఎరువుగా వచ్చిన ఛందోఽలంకార లక్షణాలు దేశ్య విధానాలను తోసిరాజని బలం సంపాదించుకొన్న రోజుల్లో, కావ్యశిల్పం సంప్రదాయ బద్ధ సంకేతాలతో ముడిపడివున్న ఆ పరిస్థితుల్లో, ప్రయోజనదృష్టిలోకూడా వైవిధ్యమున్న ఆ తరుణంలో, ఈ రెండు భాషారూపాల మధ్య దూరం పెరగటంలో ఆశ్చర్యం లేదు. మహమ్మదీయ ప్రభావాలు వచ్చిన మధ్యయుగాలనుంచీ మన కవి పండితుల దృక్పథాల్లో కొద్దిపాటి మార్పులు వస్తూ, ఆంధ్రనాయకరాజుల కాలంనాటికి ఈ మార్పులు బలపడి, ముఖ్యంగా వచనవాఙ్మయంలో కావ్య వ్యావహారికభాషాభేదం సన్నగిల్లుతూ వచ్చి, ఈ శతాబ్ది మధ్యకాలానికి ఆ భేదం చాలావరకు తొలిగిపోవటం మొదలయిందని నిదర్శన పూర్వకంగా నిరూపించవచ్చు. ఈ వ్యాసంలోని పరమ ప్రయోజన మిదే. ఈ నిరూపణమే 'వ్యావహారిక భాషా వికాసాన్ని' చారిత్రక పద్ధతిలో వివరిస్తుంది. ఈ ప్రకరణంలోనే ఆ భాషాభేదాలు ఇతరేతర భేదాన్ని ఏ విధంగా ప్రభావితం చేసుకొంటాయో ప్రస్తావిస్తాను. అవి రెండూ భిన్నభాషలు కావు. ఆ రెంటికీ వ్యవహర్తలు ఒక్కరే. అందువల్ల కావ్యభాషాప్రభావం వ్యావహారికం మీదా, వ్యావహారిక ప్రభావం కావ్యభాషమీదా పడటం అనివార్యం, సహజం, సంగతం. ఇందుకు కొన్ని సాక్ష్యాలను దిక్ప్రదర్శనంగా చూపుతాను.

# ప్రాఙ్నన్నయభాషావికాసం

§ 2.2 నన్నయకు కనీసం నాలుగు వందల సంవత్సరాల క్రితమే తెలుగు భాష 'స్థిరపడ్డది' అనటానికి లిఖితాధారాలు ఉన్నాయి. భాష ఎప్పుడూ 'ద్రవస్థితి'లో ఉండదు. మార్పులు రావటం ద్రవ స్థితి అయితే ఆ స్థితి భాషకెప్పుడూ ఉంటుంది. 'ప్రవాహినీ దేశ్యా' అనే మాటల ఉద్దేశమిదే. క్రీ. శ. ఏడో శతాబ్దికే చాలా లక్షణాలు తెలుగులో ఒక స్వరూపానికి వచ్చాయి. ఆ తరువాత సహజ పరిణామక్రమంలోనో కావ్యభాషాప్రభావంవల్లనో తొమ్మిదో శతాబ్దిలో కొన్ని కొత్త మార్పులు బయలుదేరి పదకొండో శతాబ్దికల్లా అవి కూడా ఒక నియత స్థితికి వచ్చాయి. నన్నయ కావ్యభాషకు ఆధారమైన భాష చాలావరకు ఏడో శతాబ్ది నాటిదే. నన్నయకు తరవాత వందల సంవత్సరాలు గడిచినా కావ్యభాషలో ఇంకా నిలిచిపోయిన అనేక భాషాలక్షణాలు నన్నయకు పూర్వమే కొన్ని వందల సంవత్సరాల క్రితం భాషలో ఆరంభమైనవో స్థిరపడ్డవో. ఈ విషయాలు చర్చాక్రమంలో తేటపడతాయి. 'గ్రంథ విస్తర భీతి' వల్ల ప్రతి చిన్న మార్పునూ ఇక్కడ వివరించలేకపోయినా ప్రధాన విషయాలన్నిటినీ ససాక్ష్యకంగా ప్రదర్శిస్తూనే ఉంటాను.

§ 2.3 క్రీ. శ. ఏడో శతాబ్దానికి ముందు 'ఴ' కారం తెలుగులో ప్రత్యేక వర్ణంగా ఉండేది. అది అచ్చులమధ్య దకారంగానూ, సంయుక్తాక్షరాలలో రేఫగానూ, ఏడో శతాబ్దినాటికే మారిపోయింది. కాని క్రీ. శ. పదమూడో శతాబ్దిదాకా లేఖన సంప్రదాయంలో విరళంగా నయినా నిలిచింది. నన్నయనాటి తాళపత్రగ్రంథాలు లభిస్తే వాటిలోనూ ఴ కారం లేఖనంలో కనిపించటం సాధ్యమే. ప్రచ్చిన (ద.హిం. శా. 10.599.26, 625-50) వంటి రూపాల్లో ప్రాచీనకాలంలోని *ఴ్ట-అనేది రేఫగా మారింది.

§ 2.3.1 'క్రొత్త, ప్రాత' వంటి రేఫయుక్తపదాది హల్లులు భాషలో ఉండి తీరాలని సంప్రదాయపండితులింకా వాదిస్తునే ఉన్నారు. కాని క్రీ. శ. ఏడో శతాబ్ది నుంచి పదాది సంయుక్తాక్షరాల్లోని రేఫ వాడుకనుంచి తొలిగిపోవటం మొదలయిందన టానికి శాసన నిదర్శనాలు విరళంగా కనిపిస్తున్నాయి. ఉదా.

అయ్యవోలు (భారతి 16.613-19.13,691-92). ఇక్కడి -వోలు ప్రోలు శబ్ద రూపాంతరం. దీని మూలరూపం *పుఴల్ (>ప్ఴోల్>ప్రోలు).

గొచ్చి (ద.హిం.శా. 10.621.3, 9/10). ఇది *గ్రొచ్చినుంచి ఏర్పడ్డది

పోలము (ద.హిం. శా. 10.620.5,914). ఇది *ప్రోలము శబ్దభవం.

పవ్వు (ద.హిం శా. 4.1015.9.1084). ఇది *ప్రవ్వు శబ్దభవం.

మాని (ద.హిం.శా. 10.646.29, 1062). ఇది *మ్రానినుంచి ఏర్పడ్డది.

ఇలాటి రూపాలు క్రీ. శ. పదకొండో శతాబ్దం చివరికాలంలో కూడా అల్ప సంఖ్యాకంగానే ఉండేవి. అంటే పదాది సంయుక్తాక్షరగతమైన సాధురేఫ అప్పటికింకా భాషలో తొలగిపోలేదని, తొలగిపోవటమనే లక్షణం ఏడో శతాబ్దంలోనే ఆరంభమయిందని చెప్పవచ్చు. నేటి భాషలో ఈ మార్పు పూర్తిగా కనిపిస్తుంది. లేఖన సంప్రదాయంలో కొందరు పండితుల పట్టుదలవల్ల నిలిచినా వారి వాగ్వ్యవహారంలో కూడా ఈ మార్పు ఇప్పటికి పూర్తిగా వచ్చింది. పూర్వపరిశీలనలో ఈ మార్పు పన్నెండో శతాబ్ది మధ్యకాలంలో వచ్చి ఉంటుందని తోచింది (చూ. భద్రిరాజు కృష్ణమూర్తి, T.V B. § 1.145).

అజ్మధ్యంలోని ఱకారం డకారంగా పరిణమించటం కూడా ఏడో శతాబ్దికే జరిగిందనటానికి నిదర్శనలు లభిస్తున్నాయి. ఉదా.

చోడు (ఎపి. ఇం. 27.229_30.1, 600-25)

కుడుచు (ద. హిం. శా. 6.584. 10,641). ఇది '*కుఱి' ధాతువునుంచి ఏర్పడింది.

భాషలో ప్రత్యేక వర్ణంగా ఉన్న ఱకారం దాన్నుంచి తొలగిపోవటం భాషా వికాసానికి ఒక నిదర్శన. పాతవి పోవటం, కొత్తవి రావటం పరిణామశీలమైన భాషా లక్షణమే.

§2.32 క్రీ. శ. తొమ్మిదో శతాబ్దానికి అంతకుముందు భాషలో పదమధ్యంలో ఉండే ణకారం నకారంగా పరిణమించిందనటానికి సాక్ష్యాలు దొరుకుతున్నాయి. ప్రొద్దుటూరు తాలూకాలో దొరికిన క్రీ. శ. 625-50 నాటి ఒక శాసనంలో ణకారయుక్తమైన 'ఆణతి' (ఎపి. ఇం. 27.234_36.15) శబ్దమూ, నకారయుక్తమైన పని(.32) శబ్దమూ రెండూ ఏకసమయంలోనే దొరుకుతున్నాయి. మొదటిది ప్రాకృత శబ్దం అణత్తి (<సం. ఆజ్ఞప్తిః) నుంచి ఏర్పడింది; రెండోది పణి అనే ప్రాకృత శబ్దానికి ఆనాటి రూపం. తొమ్మిదో శతాబ్దంనాటి ఒక శాసనంలో 'తన' శబ్దానికి బదులుగా 'తణ'(ద.హిం.శా. 10. 639.11.825) అనే విలోమలేఖనం కనిపిస్తుంది. అంటే ఆనాటికి భాషలో అజ్మధ్యణనలకు భేదం నశించిందని అర్థం. పదకొండో శతాబ్దిదాకా ప్రాచీనమైన ణకారయుక్తరూపాలు క్వచిత్తుగా కనిపించినా (కొణం—ద.హిం.శా. 10.647.30,1097), ధ్వని పరిణామం తొమ్మిదో శతాబ్దానికే పూర్తి అయిందని పై విలోమలేఖనం రుజువు చేస్తున్నది. పదమధ్య ద్విరుక్తణకారం కూడా 9/10 శతాబ్దాలనాటికి ద్విరుక్తనకారంగా మారినట్లు కింది ఉదాహరణ నిరూపిస్తుంది:

కొణ్ణ (ద. హిం. శా. 10. 611. 2, 8) : కొన్న (తె. శా. 1.163 65. 70–71, 892–922).

ఈ మార్పు జరిగిన తర్వాత కొంతకాలంపాటు లిపిలో ణకారఘటిత రూపాలు కనిపించేవి (అణ్ణ—ఎపి ఇం. 30.280–84.7, 972). అయితే ఇవి కన్నడభాషాప్రభావానికి సన్నిహితంగా ఉన్న దక్షిణరాయలసీమలోనే ఎక్కువగా ఉండేవి.

ఈ ధ్వనిపరిణామంకాక అజ్మధ్యదకారం కొన్ని రూపాల్లో డకారంగా మారటం కూడా ఏడో శతాబ్దిలోనే ఆరంభమయింది. ఇది స్థానికమయింది. కొన్ని రూపాల్లో మాత్రమే ఈ మార్పు వచ్చింది. ఈ మార్పు రేనాటిసీమలో మొదలై ఇతర ప్రాంతాలకు కాలక్రమాన వ్యాపించినట్లు శాసన ప్రయోగాలవల్ల గ్రహించటం సాధ్యమవుతున్నది. ఉదా.

కొడికి (ఎపి. ఇం. 15. 249–52. 17, 554)
కొఱికి (ఎపి. ఇం. 31. 74–80. 21, 669)

చిన్నయసూరి 'అదంగ్వాముల దాటు' డకార మవుతుందన్నది ఈలాటి మాటల విషయంలోనే.

§ 2.33 గ్రాంథిక వ్యావహారికవాదుల మధ్య తీవ్రఘర్షణకు దారితీసిన విషయాల్లో సాధుశకటరేఫల విషయం ముఖ్యమైనది. పూర్వలాక్షణికులకే ఏ శబ్దంలో ఏ రేఫ ఉన్నదన్న విషయంలో అభిప్రాయభేదాలు, అస్థిరభావాలు ఉన్నవనటానికి వారువారిచ్చిన వివరణలే నిదర్శనం. పోతనాది మహాకవులు ఈ భేదాన్ని పాటించలేకపోయారని కొందరు, సరిగానే పాటించారని కొందరు గ్రాంథికవాదులే వివదించటం అందరికీ తెలిసిన విషయమే. అప్పకవి ఆక్షేపణ ('బమ్మెరపోతరాజకృత భాగవతంబు....') తెలుగు విద్యార్థులూ పండితులూ విన్నదే. కాని, క్రీ. శ. నాలుగైదు శతాబ్దాల్లో గోదావరీ తీరంలో సాధుశకటరేఫభేదం నశించటం ఆరంభమయిందనటానికి శాసనస్థ నిదర్శనా లనేకం దొరుకుతూనే ఉన్నాయి. పెదవేగిశాసనంలో 'అటుతొాఱ' (భారతి 1.111–22.10–11, 395–410). 'చెఱ్వ్రయుప' (.13–14). 'కమ్మరాష్ట్రదువ'(.15)అనే మూడు మాటలున్నాయి. రెండోమాటలో ఉన్న శకటరేఫ ఆదేశవందంలో పంక్తి మారేసరికి సాధురేఫగా మారింది. లిపి సంకేతం లేనందువల్ల శకటరేఫను రాయలేదనటానికి ఇక్కడ వీలులేదు. అందువల్ల అప్పటికి చాలా కాలం ముందుగానే ఆ రెండుధ్వనులూ ఒకేవర్ణంగా పర్యవసించాయని, లేఖక ప్రమాదంవల్ల ఆ రహస్యం ఇక్కడ బయటపడిందని చెప్పవచ్చు. ఏడోశతాబ్దినాటి 'ఇరుకుటూరు' (ఎపి. ఇం. 31.74–80.39–40, 669) అనే పదంలోను, ఎనిమిదో శతాబ్ది నాటి 'చిక్కేరు' (JAHRS 5. 51–56 19, 763), 'నూర' (ద. హిం. శా.

10 37. 2,8) అనే శబ్దాల్లోను, ఉండవలసిన చోట్ల శకటరేఫ కనిపించదు. ఇఱుసు, ఏఱు, నూఱు-శబ్దాలు శకటరేఫఘటితా లనేవిషయంలో మన లాక్షణికులకు అభిప్రాయభేదమే లేదు. పైవాటిలోని ఏడోశతాబ్దిపదం పలనాటిది. ఎనిమిదో శతాబ్ది మాటలు విశాఖనుంచి అనంతపురం వరకున్న భూభాగాలవి. అందువల్ల రేఫఱకారాల భిన్నవర్ణత్వం ఏడో శతాబ్దానికి ముందే అజ్మధ్యంలో తొలగిపోవటం మధ్యాంధ్ర దేశంలో ఆరంభమై ఎనిమిదో శతాబ్దికి రాష్ట్రవ్యాప్తమయిందని చెప్పవచ్చు. ఇందుకు మరో నిదర్శనం విలోమలేఖనం. ఎనిమిదో శతాబ్దంలోని 'పదమఱలూఱి' (ద. హిం. శా. 10, 605, 1-2, 8)అనే మాటలో సాధురేఫఘటితమని నిర్వివాదంగా చెప్పదగిన 'ఊఱు' శబ్దంలో శకటరేఫ కనిపించటం ఈ వాదానికి ఎంతో సహాయకరమయింది. నన్నయ కవితలో ఈ పరిణామం కనిపించినా కనిపించక పోయినా ఆయన తన నాటి వ్యావహారికాన్ని ఉపయోగించాడనటానికిగాని. శకటరేఫ ఆయన నాటికి భాషలో అర్థభేదస్ఫోరకమై ప్రత్యేకవర్ణంగా ఉండేదనటానికిగాని వీలే లేదు కదా. ఇప్పటికైనా శకటరేఫను వర్ణసమామ్నాయంలోగాని లేఖనంలో గానినిలపటం అనవసరమే గదా. ఱకారంలాగానే ఴకారం కూడా భాషలో ప్రత్యేక వర్ణత్వం కోలుపోయింది. ఇదీ భాషా వికాసానికి మరో నిదర్శనమే.

§ 2.34 నేటి తెలుగులోగాని కావ్యభాషలోగాని పదాదిన ళకారం లేదు. చిన్నయసూరి తాను తప్పని భావించే పదాదియవలు భాషలో ఉచ్చారణలో ఉన్నా నిషేధించాడే గాని తెలుగులో పదాది ఙ, ఞ, ణ, ళ-లు లేవని చెప్పనయినా లేదు. ఈ నాలుగిటిలో మొదటి మూడూ ఏనాటి తెలుగులోనూ పదాదివర్ణాలు కావని చెప్పవచ్చు. ళకారం ప్రాచీనాంధ్రంలో పదాదిన ఉండేది. ఇతర ద్రవిడ భాషలతో పోల్చి చూస్తే ఇది వింత పరిణామం. పురాణాంధ్రంలో ప్రథమాక్షరం మీదినుంచి ద్వితీయాక్షరం మీదికి ఊనిక మారినందున వర్ణవ్యత్యయంతోపాటు అచ్సంకోచంకూడా జరిగి పదాదిన గ, డ, ద, వ, ర, ఱ, ల, ళ లు వర్ణాలున్న శబ్దాలేర్పడ్డాయి (చూ. భద్రిరాజు కృష్ణమూర్తి, TVB § 1.121-38). ఈ మార్పువల్ల (అ$^{1}$ హ అ$^{2}$ > హ అ$^{1}$ అ$^{2}$ > హ అ) ఏర్పడ్డ ళకారాది పదాలు శాసనాల్లో కనిపిస్తాయి. ఉదా: ళోన (=లోన; ద. హిం. శా. 10-623.8, 9-10). 'ళోన' కు పూర్వరూపమైన 'ఒళన' కూడా శాసనభాషలో లభిస్తున్నది (ఆం. ప. 1941-42. 5-15.1,600-25). ఇది 'లోన'గా ఎప్పుడు పరిణమించిందో శాసనప్రయోగాలు దొరకనందున చెప్పలేము. కాని అజ్మధ్య ళకారం ఏడో శతాబ్దికే లకారంగా మారటం మొదలుపెట్టి తొమ్మిదో శతాబ్దానికి పూర్తిగా మారిందనటానికి ఆధారాలు దొరుకుతున్నాయి. ళకారం లకారంగా మారిందనటానికి ప్రత్యక్ష నిదర్శనం ఎనిమిదో శతాబ్ది నాటి నరసరావుపేట తాలూకా

లోని ఒక శాసనంలో లభిస్తుంది. ఉదా: కొలచి (ద.హిం.శా.6.250.7, 742-98). ఇది ప్రాచీన ద్రావిడ ధాతువు *కొళ్ నుంచి ఏర్పడ్డది. అయితే ప్రాచీన ద్రావిడ *లకారం ఉండవలసినచోట్ల ళకారం రాసిన విలోమలేఖనాలు ఏడో శతాబ్దంనుంచే దొరుకుతున్నాయి. ఉదా. అయ్యవాళు (భారతి 16.613-19. 13, 691-92), కళరు (భారతి 5. 935-48. 13, 675), తళవర (ఎపి.ఇం. 31.74-80.22, 669). ఒకనాటి ప్రత్యేకవర్ణమైన ళకారం లకారంగా మారటం భాషా వికాసక్రమాన్ని సూచిస్తుంది. అజ్ఝర్యంలోని ద్విరుక్త ళకారంకూడా ఎనిమిదో శతాబ్దానికి లకారంగా మారిపోయిందనటానికి నిదర్శనలు లేకపోలేదు. ఉదా.

పళ్ళి (ఎపి. ఇం. 31. 74-80.21,669). ఇది 'పల్లె' అని అర్థమిచ్చే శబ్దం.

పల్లి (CP 2, 1914-15. 26, 764-99). ఇది పైశబ్దానికి తరవాతి రూపం.

§ 2.35 'యకారంబును వుషావావోలును వెలుఁగు మాటలకు మొదట లేవు' అని చిన్నయసూరి ఘోషించాడు (బా. వ్యా. సంజ్ఞా. 17). ఇది తననాటి, నేటి, వాగ్వ్యవహారానికి కేవలం విరుద్ధం. 'అద్యఃక్రియాసు ధాతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః' (ఆం. శ. చిం. సంజ్ఞా.24), సర్వత్రాజ్యత్వార్యం జ్ఞేయం యస్య ప్రమతప్రకృతికేభ్యః' (ఆం. శ. చిం. సంధి. 28), 'వికృత్యాదిగతో మోఽత్ర స్యా చ్ఛబ్దాన్తరయోగతః, ప్రాణమాత్రావశేష స్స్వ్య దత్ర శ్రీకవి సమ్మతే' (వి. వి. సంజ్ఞా. 22) అనే పూర్వలాక్షణిక వాక్యాలకు విరుద్ధమైనా, అప్పకవి గొప్పను నమ్ముకొని చిన్నయసూరి సూత్రీకరించినా, శాసన నిదర్శనాలను బట్టి క్రీ. శ. అయిదో శతాబ్దంనుంచి పదాది యకారమూ తొమ్మిదో శతాబ్దంనుంచి వకారమూ భాషలో ఉన్నట్లు చెప్పవచ్చు. లేకపోతే కింది ప్రయోగాలకు లేఖనంలో స్థానముండేది కాదు. ఉదా.

యుళ్ళలూరు (ఎపి. ఇం. 9.233-36. 20, 426).

యలమ్మ (ద. హిం. శా. 10. 29. 16, 971) > ఎల్లమ్మ

వకొట్టి (ద. హిం. శా. 10. 614. 6, 9) > ఒకొటి

వుద్దిని (ఎపి. ఇం. 30. 280-84. 12, 972) > ఉద్దిని

ప్రాచీన లేఖన వ్యవహారంలో పై విధంగా ఉండగా, ఈ నాటికీ ఇదే వ్యవస్థ ఉచ్చారణలో వినిపిస్తుండగా, ఇందుకు విరుద్ధమైన-లేదా దీన్ని అంగీకరించని-కావ్యభాషకు ప్రాచీనతాగౌరవం ఎలా కలుగుతుంది? అత్యంత ప్రాచీనకాలం నుంచీ భాషలో నిలిచిన ఈ విషయం వికాసక్రమాన్ని సూచించకపోయినా కావ్యభాష వ్యవహారదూర మయిందనటానికి నిదర్శనమే.

§ 2.36 చిన్నయసూరి 'ఇయకు మాఱుగా నామాంతంబున యత్వంబు బహుళంబుగా నగు' (బా. వ్యా. అచ్చ. 28) అని సూత్రించి వివరణలో ఒక్క 'మృత్యము' అన్న శబ్దానికి మాత్రమే ఇకారలోపం అంగీకరించారు. బహుజనపల్లివారు 'మృత్తియ శబ్దేతరంబులందును దఱచుగ ఇత్వలోపంబు గానంబడియెడి' (ప్రౌ. వ్యా. శబ్ద. 49) అని సూత్రీకరించి మరికొన్ని శబ్దాలను చేర్చారు. వారిచ్చిన ప్రయోగాల్లో ప్రాచీనతమమైనది తిక్కన అనుశాసనిక పర్వంలో వాడిన 'దివ్య' శబ్దం (4. 119). ఇదే శబ్దానికి శాసన ప్రయోగాలు నన్నయకు సమకాలంలోనే దొరుకుతున్నాయి. ఉదా.

దివ్య (ద. హిం. శా. 4 1317. 6. 1081)
దీవ్య (AR 1933, App. B. 56. 7, 1072)

నన్నయ కావ్యభాష సమకాలవ్యవహారభాష కాదనటానికి ఇది మరో నిదర్శనం. ఒక ధ్వనిపరిణామం లిపిబద్ధం కావటానికి ఎంతో ముందుగానే వ్యవహారంలో ఉంటుంది. సంప్రదాయధోరణిలో గతానుగతికంగా లిఖించే లేఖకులు ప్రమాదవశాన మొదటిసారి ఆయాధ్వని విశేషాలు రాస్తారు. బహుళవ్యాప్తిలోకి వచ్చిన ధ్వనిపరిణామం విషయంలో ప్రమాదప్రశ్న లేదు. పై ప్రయోగాలనుబట్టి పదకొండో శతాబ్దికే ఆరంభమయిన పదమధ్యాచ్చు లోపించటం, ఫలితంగా అజ్మధ్యసంయుక్తాక్షర మేర్పడటం అనే ధ్వనిపరిణామం తిక్కన ప్రయోగంవల్ల ఆయన కాలానికి కావ్యభాషలో ప్రవేశం పొందదగినంత ప్రాచీనత్వాన్ని సంపాదించుకుందని చెప్పవచ్చు.

§ 2. 37 గ్రాంథికభాషావాదానికి 'జీవగర్ర' వంటి అనుస్వారం చరిత్రను పరిశీలిస్తే భాషావికాసంలోని విశేషలక్షణాలు కొన్ని తెలుస్తాయి. వర్గానునాసికాలకు బదులు ప్రత్యామ్నాయసంకేతంగా అనుస్వారాన్ని లేఖనంలో ఉపయోగించటం క్రీ. శ. నాలుగో శతాబ్దంనుంచీ కనిపిస్తుంది. పదాంశంలోను, పదాంతావధుల దగ్గరా, పదాంతంలోనూ ఈ లేఖనపద్ధతి అప్పటినుంచీ వాడుకలో ఉన్నా పదాంతంలో ఆ విధంగా రాయటాన్ని పండిత సంప్రదాయం నిషేధిస్తున్నది. నిషేధ సూత్రం వ్యాకరణగ్రంథాల్లో లేకపోయినా ఆ లేఖనపద్ధతిని అపాయంగానే పరిగణిస్తున్నారు. ప్రవర్తమానం (ఎపి. ఇం. 29 160-64. 5. 680) వంటివి ఇందుకు శాసనస్థ దుష్ప్రయోగాలు ఇవే కావు. పంక్త్యాదిని అనుస్వారలేఖనం కూడా ఏడో శతాబ్దినుంచీ కనిపిస్తున్నది. ఉదా. పురంబున (ద. హిం. శా. 6. 584 6-7, 641). ఇలాంటి ఉదాహరణలనేకం. భాష 'చెవి' పోయి అయినాక కాలంలో ఇలాంటివి వచ్చాయనుకోవటం అసమంజసం. ఈ చెవిపోవటం నన్నయాదులకు నాలుగువందల సంవత్సరాలకు పూర్వమే, తెలుగుభాష లిపిబద్ధమై తొలికాలంలోనే జరిగింది.

అర్ధానుస్వారానికి ఏనాటి శాసన లిపిలోనూ సంకేతం లేదు. మొదట బిందువుగా అక్షరాల నెత్తిమీద ఉంటుండే అనుస్వారం తరవాత సున్నగా మారి పద మధ్యంలో లిఖిత మవుతుండేది. ఛందస్సునుబట్టి పద్యశాసనాల్లో అర్ధానుస్వారాన్ని పునరుద్ధరించటం సాధ్యమౌతుంది కొన్ని సమయాల్లో. అనుస్వారంకాక వర్గానునాసికమే లేఖనంలో కనిపించినప్పుడు కూడా ఈ పునరుద్ధరణం (reconstitution) సాధ్యమవుతుండేది. ఉదా.

ప్రిథుం బణ్డరంగుం బణ్చిన....పట్టెంగొని....వేంగినాణ్టిం....(భారతి 5, 473–84. 4–6, 848) అనే భాగాన్ని నేటి లిపిలో *ప్రథుఁ బండరంగుఁ బంచిన.... వేఁగినాఁటి-అని చదవకపోతే ఛందోభంగమవుతుంది. 'గవ్వఱంబ్....కొట్టంబుల్' (పై. 3, 6) అనేచోట్ల *గర్వమ్....కొట్టముల్-అని చదవాలి.

వీటినిబట్టి అరసున్న (ఉచ్చారణలో పూర్వాచ్చు అనునాసిక్యం) అనేది ఏయే పదాల్లో ఉండేదో తెలుసుకోవటంతోబాటు, 'మ' కారస్థానంలో బిందు పూర్వక బకారం రాస్తుండే వారని కూడా తేటపడుతుంది. ఈ సంప్రదాయం గ్రహించని పండితపరంపరవల్ల బిందుపూర్వకబకారయుక్తపదాలు నన్నయాదుల కాలంలో ఉచ్చారణలో ఉన్నాయనే భ్రమ లోకానికి సంక్రమించింది. ఇంత ప్రాచీనకాలంలో 'ంబు'<'ము' అనే పరిణామం జరిగినా 'ంబు' రూపఘటిత కావ్యభాషను ఇప్పటికీ వాడేవారు భాషావికాసం గుర్తించలేదని అనుకోవాలి.

దీర్ఘంమీద సాధ్యపూర్ణం రాదని, కొన్నిచోట్ల వస్తే ప్రాసభేదమవుతుందనీ కాదనీ రకరకాల చర్చలు వచ్చాయి. వాటి వివరాలతో ఇక్కడ ప్రమేయంలేదు. 'కూంతునరియ పోల్వం గాంత లెండ్రు' (R P S 26–29. 11, 1065) అనే శాసన ప్రయోగాన్ని 'పిండె ఖలుండు దక్షుఁడను పీఁచిఁడి పాయుఁడు' మొదలైన నన్నెచోడ ప్రయోగాదులతో అనుసంధించి పరిశీలిస్తే మాండలికంగానయినా దీర్ఘాచ్చు మీద పూర్ణబిందూచ్చారణ ప్రాచీనాంధ్రంలో ఉండేదని గమనించగలం. అంతే మాండలికాలు కావ్యభాషలో చోటు చేసుకున్నాయని-లేదా చేసుకోవటం మొదలయిందని-గ్రహించవచ్చు. కావ్యభాషకే ఈ స్థితి ఉన్నప్పుడు వ్యావహారికం మాండలిక భూయిష్ఠమై పోతుంది కాబట్టి ఉపాదేయం కాదనే వాదం ఎంత తార్కికమయింది? అనుపాదేయత రెంటికీ సమంగా వర్తిస్తుందని గ్రహిస్తే చాలు. ఈ విధమైన ప్రధాన ధ్వని పరిణామాలు పదకొండో శతాబ్దంవరకున్న శాసనభాషలో కనిపిస్తూ భాషా వికాసాన్ని నిరూపిస్తున్నాయి.

§ 2.4 గ్రాంథిక వ్యావహారిక వివాదాల్లో 'సంధి' విషయంలో జరిగిన చర్చలు

అసంఖ్యాకం. వ్యావహారికవాదులు సంధి సరిగా పాటించలేదనే ఆక్షేపణతో ఆరంభమైన వివాదం కావ్యభాషలో 'విసంధి'ని అంగీకరించేటంతవరకూ దిగజారింది. ప్రాచీన భాషను సరిగా అర్థంచేసుకోగలవారికి అందులోని సంధి విధానం ప్రత్యేక క్లేశ కారణం కాదు కాబట్టి ఇది అర్థరహితమైన అంగీకారమని గురజాడ అప్పారావుగారు అధిక్షేపించారు. ఆయా విషయాల ప్రస్తావనకు వచ్చేముందు శాసనభాషలోని సంధి విసంధి విధానాలను పరీక్షించి భాషావికాసాన్ని గుర్తించటం మంచిది.

పదాంతంలోని అత్తు సంధిలో లోపించటం 9/10 శతాబ్దాలనుంచి మాత్రమే కనిపిస్తుంది. ఆరో శతాబ్దంలో పదాంతాత్తు నిలిచిఉన్నట్లు నిదర్శనాలున్నాయి. యడాగమం ఏడో శతాబ్దినుంచి కనిపిస్తుంది. ఉదా.

సంధికి: ఇద్దట్లు(ఇద్ద+అట్లు)—(శా. ప. మం. 1. 2-3. 41, 898-922).

విసంధికి: పన్నస ఇరవది (ఎపి.ఇం. 27. 225-28.12-13, 575-600).

యడాగమానికి: కలయన్ (ద. హిం. శా. 6. 585. 11, 633-63).

అక్కడక్కడ పరస్వరం ఉ ఊ ఒ ఓ లలో ఏదైనా అయితే నేటి వ్యవహారంలోలాగా వడాగమం రావటం పదో శతాబ్దం నుంచి కనిపిస్తుంది. ఉదా.

ఎట్టి- వుమ్మయును (ఉమయును)-(ద. హిం. శా. 10.29 18.971).

ఇత్సంధికి పదో శతాబ్దం నుంచి ఉదాహరణలు లభిస్తున్నాయి. అంతవరకూ వికల్పంగా ఉన్న యడాగమం ఆ తరవాత బహుళంగా మారింది. ఉదా.

సంధికి: శ్రీరెల్లన్ (తె. శా. 1.163-65.41-42, 892-922).

విసంధికి: ఇరువట్టయిది ఏను (AR 392/1904 11-13, 575-600).

యడాగమానికి: ఇరవదియాదినాల్కు (ఎపి. ఇం. 27.225-28.13-14. 575-600).

ఉత్సంధి మొదటినుంచీ బహుళంగానే ఉండేది. నిత్యం కానేకాదు. ఏడో శతాబ్దం నుంచి యడాగమానికి ప్రయోగాలు దొరుకుతున్నాయి. పదకొండో శతాబ్ది నాటికి ఈ ఆగమం బహుళవ్యాప్తిలోకి వచ్చింది. ఉదా.

సంధి: ఊర్లును (ద. హిం. శా. 6.585.9, 633-63).

విసంధి: రేనాణ్డు ఏళన్ (ఎపి. ఇం. 27 221-25.4-5, 575-600).

యడాగమం: వారు యిట్లకాను (ద. హిం. శా. 6.584.10,641).

పదాంతాచ్చులు హల్లుకు ముందుకూడా లోపించటం కద్దు. ఇది విరళంగా ఉండేది. ఉదా. అన్వారు(అను-వారు; ఆం. ప. 1941-42.5, 625-50); నలుతుమ్ములు (నలు-తుమ్ములు: AR 293/1949-50.9,8). శాస్త్రీయంగా చెప్పాలంటే హలంతశబ్దాలకు ఈ రూపాల్లో అజాగమం రాలేదనాలి.

ఏకాక్షరధాతువుల తుది హల్లుకు అచ్చులముందు ఏదో శతాబ్దంనుంచీ ద్విరుక్తత కనిపించేది. ఉదా. అన్నేణ్డన్ (అను/ అన్-ఏణ్డన్: భారతి 23.182-86, 5,641). ఈ ప్రయోగ ప్రాచీనతను గమనించిన తరవాత 'అన్నిష్టసఖి' వంటి నన్నయ ప్రయోగాల విషయంలో అప్రస్తుత శాస్త్ర చర్చలు మానివేయటం మంచిది. పండితులు నన్నయ హృదయం గురించి కలవరపడటం, పోతరాజాదులను సంరక్షించాలో అక్కరలేదో తర్కించటం నిష్కారణశ్రమే.

కావ్యభాషకు రాసి, భాషాసృష్టికి విధేయంగా చెప్పిన మన వ్యాకరణ సూత్రాలను పై శాసనప్రయోగాలతో పోల్చిచూస్తే భాషావికాసక్రమానికి సంప్రదాయ వ్యాకరణ నిర్దేశాలకూ సంబంధం లేదనిపిస్తుంది. క్రీ. శ. 1100 ల వరకూ దొరికిన శాసనాల్లోని అచ్సంధిని పరీక్షించి తయారుచేసిన కింది పట్టిక అనాటి సంధి విసంధి స్వరూపాన్ని ప్రయోగ సంఖ్యా తారతమ్యాన్నిబట్టి నిరూపిస్తుంది.

| సంధి విశేషం | సంధిగత రూప సంఖ్య | విసంధుల సంఖ్య | ఆగమయుత రూప సంఖ్య |
|---|---|---|---|
| అత్సంధి | 9 | 21 | 50 |
| ఇత్సంధి | 6 | 14 | 33 |
| ఉత్సంధి | 21 | 16 | 12 |

ఆగమయుత రూపాల సంఖ్య పదాది యవల సంఖ్యతో సమానం. ఉత్సంధి నిత్యమనే భ్రమ పోగొట్టుకోవటం మంచిది. అప్పటినుంచి ఇప్పటివరకు ఇదే స్థితి.

§ 2.41 గసడదవాదేశం క్రీ. శ. ఎనిమిది పదకొండు శతాబ్దాల మధ్యకాలంలో నిత్యంగాను, అంతకుముందు వైకల్పికంగాను ఉండేది. దాదేశానికి శాసన ప్రయోగాలు దొరకలేదు. ఉదా.

సంధికి : అణతి-గాను (ఎపి. ఇం. 27.234-36.15,625-50)
పణి-సేసిన (ద హిం శా. 6.584.5, 641)
సీతి-దప్పి (శా. ప. మం. 1.2-3.39, 898-934)
పను-వట్లు (ద. హిం. శా 6.585.10, 633-63)
విసంధికి : రెండు-తోటకు (ఎపి. ఇం. 27.234-36.11, 625-50)
అప్లు — పట్టు (భారతి 5.935 948 8-9,675)

ఈ ఆదేశం సంప్రదాయ వ్యాకరణాలు చెప్పిన దానికన్నా ఎక్కువ వ్యాప్తిలో

ఉండేది. తత్సమాల్లో, ద్రుతాంతాలమీద, విశేషణాల తరవాత, క్త్వార్థకాలమీద, సమాసగతమైన సంవృతాక్షరాల్లో, గసడదవాదేశం జరిగేది. ఉదా.

(i) తత్సమాల్లో :
కలయంత-గాలంబు (ద. హిం. శా. 6.585-11, 633-63)
విత్తుపట్టు-ప్రసాదశ్శ్రీసిరి (ఎపి. ఇం. 7.177-82.74.845-70)

(ii) ద్రుతాంత శబ్దాలమీద :
నాలును-వుట్టు (నె. శా. 1.281-82.2-3,7)
కట్టె-సూరె (ద. హిం. శా. 6.250.7. 742-78)
ఇన్దు-ప్రత్యక్షబ యన్నన్ (శా. ప. మం. 1.2-3.26-27,898-934)

(iii) విశేషణాలమీద :
ఇరు-వుట్టి (ద. హిం. శా. 6.585.9, 633-63)

(iv) క్త్వార్థకాలమీద:
పొంది-గాని (తె. శా. 1.163-65. 6,892-922)

(v) సమాసగత సంవృతాక్షరాల్లో:
నిడు-గట్ట (ఎపి. ఇం. 18.313-16.15, 696-709)
దమ్మ-వురంబున (భారతి 5.473-84.10-11, 848)

అయితే మొత్తంమీద ఈ ఆదేశం శాసనభాషలో చాలా తక్కువ.

పై ప్రయోగాల్లో కొన్ని సంప్రదాయ వ్యాకరణాల ప్రకారం తప్పులు. తత్సమాలకు గసడదవాదేశాన్ని సూరి నిషేధించాడు. ('తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు'-బా. వ్యా. సంధి 14). అంగీకరించిందికూడా 'ప్రథమ' మీద, 'కళలగు క్రియా పదములమీద సహితము' (బా. వ్యా. సంధి 13). 'కొన్ని యెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక కతపలకు గదవలు గానంబడియెడి' (ప్రౌ. వ్యా. సంధి. 5) అన్న సీతారామాచార్యులవారు 'ప్రాసంబులందని యర్థము అనే వివరణతో సూత్రావకాశాన్ని వికేకరించారు. పాల్కురికి సోమనాథుని ప్రాచీన శివకవులు గసడదవాదేశాన్ని ఇంచుమించు నిత్యంగానే పాటించిన ప్రయోగశరణాలైన వ్యాకరణ గ్రంథాలు వాటిని లక్ష్యపెట్టలేదు. 'శివకవి-భవికవి సిద్ధాంతం శైవ వైష్ణవ విభేదానికి దారితీసి శాస్త్ర విషయంలో కూడా పట్టుదల కలిగించిందేమో తెలీదు. లాక్షణిక మతాల కిచ్చిన గౌరవమర్యాదలను కావ్య ప్రయోగాలకు ఇవ్వాలని ఉన్నయసూరి. 'శాస్త్ర ప్రయోగవచసోః శాస్త్రం బలి దుచ్యతే, అనిష్పన్నపదే తేన ప్రయోగాశ్రయణం మతమ్' (వి. వి. సంధి. 31

అనే అథర్వణోక్తిని పాటించాడు చాలావరకు. కాని ఆ విషయం మరిచి అత్తు సంధి విషయంలో అథర్వణీయాన్ని తోసిపుచ్చి 'ఆధునికుడైన' శ్రీకృష్ణదేవరాయల 'గంగను కాసె'ను పరిరక్షించటానికి ప్రయత్నం చేశాడు. ఈ శ్రద్ధ శివకవులు ప్రాచీనులైనా వారి విషయంలో లేకపోగా ప్రత్యేకించి నిషేధశాస్త్రం చెప్పి ఇంత విస్తృతంగా ఉన్న గసడదవాదేశాన్ని సంస్కృతసమాల విషయంలో నిరాకరించాడు. ఆచార్యుల వారు ప్రయోగప్రియులైనా ప్రాసమాత్రానికి ప్రామాణ్యమిచ్చి భవికవిగా తమ కర్తవ్యం నెరవేర్చుకున్నారు. ప్రశాంతంగా ఉండవలసిన శాస్త్రదృష్టికిగూడా పాట్లు తప్పలేదు।

§ 2.42 పండితాభిమానం సంపాదించిన మరో సంధి ద్రుతసంధి. ప్రత్యయాంతంలోని అనునాసికవర్ణానికి ద్రుతమనే పేరు పెట్టారు. క్రీ. శ. 6-9 శతాబ్దాల మధ్య ద్రుతసంధి వైకల్పికంగానే ఉండేది. కాలక్రమాన బహుళంగా మారినా, పదకొండో శతాబ్దికి కూడా ఇది నిత్యసంధి కాలేదు. అయితే తొమ్మిది పది శతాబ్దాల పద్యశాసనాల్లో మాత్రం ఇది నిత్యసంధిగా ఉండేది. అంటే సమకాల వ్యవహార భాషాలక్షణాలకూ కావ్యభాషాలక్షణాలకూ అప్పటినుంచే దూరత్వం కలుగుతున్నదని అర్థం. ద్రుతంమీది పరుషాలు సరళాలుగా మారటం ప్రాచీన శాసన భాషలో పదిరకాలుగా ఉండేది. ఉదా.

i) ద్వితీయాప్రత్యయాంమీద:
దీని-గాచినవారు (నె. శా. 3.1151.10, 650)

ii) తృతీయాప్రత్యయాంమీద:
వైషింబుశచేతం-బట్టం కట్టబడి (ద. హిం. శా. 10. 640. 4, 9/10)

iii) చతుర్థీప్రత్యయాల మీద:
నాకు-బణిసేసిన (ద. హిం. శా. 6. 584. 5, 641)

iv) సప్తమీప్రత్యయాల మీద:
సుద్ద పక్షబున - బఞ్చమియు (JAHC 3. 16_21. 9_10, 678)

v) సముచ్చయం మీద:
పడ్డెణ్డుం-గొణి (భారతి 5. 473_84. 40_41, 848)

vi) అన్నంతక్రియల మీద :
కట్ట-బడిన (ద. హిం. శా. 10. 629. 5, 825)

vii) భూతకాలిక సమాపకక్రియల మీద:
కట్టించెం-గ్రమబున (శా. ప. మం. 1. 2-3. 40_41, 898-934)

viii) విధ్యర్థక క్రియలమీద:
చేయవలయుం-గాన (తె. శా. 1.163_65. 29_30, 892_922)

ix) అవ్యయాల మీద:
నేలయెల్లం - గావంబూని (పై. 12)

x) విశేషణాల మీద:
విణ్ణు - జెఱువున (ద. హిం. శా. 10.652,6.1095)
ద్రుతసంధి జరగని సందర్భాలు లేకపోలేదు. ఉదా.
పాటకు - కుణ్డికాఖ్యశ(ఎపి. ఇం. 27.225_28. 11_12, 575_600)
పులొంబున - చెఱువు....(ద. హిం. శా. 6.584. 6-7, 641)
చేరమజ్గలమ్బున - తొజ్జుకొణ్డన్ (ద. హిం. శా. 10.631. 6. 8.9/10)
ఏణ్డన్ - పళ్ళినాట్టి (భారతి 23.182-86.5, 641)

ద్రుతం మీద యడాగమ వడాగమాలుచేయటం కూడా ఏడో శతాబ్దంనుంచి కనిపిస్తుంది. అందువల్ల పదాదియవలు వాడుకలో ఉన్నాయని.'సర్వత్రాజ్యవత్ కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః' అనే ఆంధ్రశబ్దచింతామణి సూత్రం కావ్యభాషా లక్షణ సూచకమేనని, నన్నయాదుల కావ్యభాషలో పదాదియకారాన్ని తొలగించి ముద్రించటం నిరాధారమైన దుస్సాహసమేనని గ్రహించాలి. ఉదా.

i) యడాగమం:
పఞ్చమియు - యాదిత్యవారంబు (JAHC 3.16-21.9.11, 641)
విషయంబు - యేలు (ద. హిం. శా. 10.23.4, 719.20)
పనిమిట - యేసు (ద. హిం. శా.) 6.250.4, 742_98)

ii) వడాగమం:
ఇట్లరా__వెలుగువారు (ఆం. ప. 1941_42.14-15.2-3, 600_25)
పోటున_వరొట్టి (ద.హిం.శా. 10.614 5..6, 8)
రట్టగుడియు. వుద్దిని (ఎపి. ఇం. 30 .280_81.12,972).

ప్రథమాంత శబ్దాలమీద కూడా పదాది యకారాన్ని నిలిప రాయటం ప్రాచీ కాలంలో ఉండేది. ఉదా. సంవత్సరమ్బుళ్_యేనగు (ఎపి. ఇం. 27.234_36.6.. 625.50)

§ 2.43 కొన్ని తెలుగు మాటలకు సంస్కృత పద్ధతిలో సంధి చేయట తత్సమాలకు విరూప సంధులు చేయటం అప్పటికీ ఉండేది. ఉదా.

(i) మన్చ్యబ్జ (మన్చి-అబ్జ: ఎపి. ఇం. 17-334-337.11,610)
(ii) నీలీస్వర (నీల-ఈస్వర: ద.హిం.శా. 10.652.6.1095)

'మన్చ్యబ్జ' అనే చోట 'మంచెబ్జ' అనే ఉచ్చారణ ఉండగా 'ఎ'(æ) ధ్వనిని పునరుద్ధరించకుండా విభాషసంధిగా భావించటం తప్పని ఒకరు విమర్శించారు. క్రీ. శ. 1100 వరకున్న శాసనాల్లో ఇదొక్కటే ఇటువంటి ప్రయోగమున్నప్పుడు 'ఎ' ధ్వని పునరుద్ధరించటం శాస్త్ర విరుద్ధం. తరవాతి కాలపు శాసనాల్లో 'గొఱ్ఱె. గొఱ్ఱ. గొఱ్ఱియ' వంటి అనేకశబ్దాలు ఏకకాలంలో ప్రయుక్తమైనమాట వాస్తవం. ఆ రూపాలను పోల్చి చూసినప్పుడు మాత్రమే 'ఎ' ధ్వని పునరుద్ధరణ సాధ్యమవుతుంది (చూ. §2.93).

§ 2.44 ఇప్పటికీ వాగ్వ్యవహారంలో ఉన్న పదాంత సంధిని ఆనాటి శాసనాల్లో లిపిబద్ధంగా చూడవచ్చు. ఈ సంధివిధానం పరిశీలించినప్పుడు పదాంత సంవృతాక్షరాల్లోని న, మ, లకు క్రీ.శ. నాలుగైదు శతాబ్దులకే ప్రత్యేక వర్ణత్వం పోయిందని చెప్పవచ్చు. ఉదా.

కమ్ముర్రాశ్చెరువ (భారతి 1.110-22.15, 395-410)
చెఱ్చెఱువ (పై. 13-14)

పదాంతమకారం సంవృతాక్షరంలో కంఠ్యస్పర్శంగా ఏడో శతాబ్దికి మారిందనటానికి కింది ఉదాహరణ సాక్షి:

ఉదకపూర్వ్వఙ్జేసి (ఎ.పి.ఇం. 30.69-71.5, 699-700)

§ 2.5 కొన్ని నామవిభక్తుల విషయంలో నేను కావ్యభాషలో ముద్రితమైన గ్రంథాలు కొన్ని విలక్షణతలు ప్రదర్శిస్తుంటాయి. బిందుపూర్వకబువర్ణకం ప్రాచీనమయిందని నన్నయాదుల కావ్యాలను ప్రచురించేటప్పుడు ఎక్కువగా ముద్రిస్తున్నారు. నిజానికి మువర్ణకయుక్తరూపాలు నన్నయకన్నా వందల సంవత్సరాలు ప్రాచీనమైనవి. వాటిని నన్నయ వాడి ఉండకపోతే కావ్యభాష అప్పటికే వ్యవహారదూరమయిందని చెప్పుకోవాలి. నన్నయ వాడలేదనటానికి లిఖితసాక్ష్యం ఇప్పుడు దొరకదు. బిందుపూర్వకబువర్ణకాన్నే అతడు వాడినా దానికి 'ము' అనే ఉచ్చారణం సాధ్యమే ననటానికి ఇంతకు ముందు అనుస్వార విషయ చర్చలో ఉదాహరణ లిచ్చి ఉన్నాను (చూ. § 2.4: *గద్యమ్....కొట్టముల్). ఆధునిక సాహిత్యంలో ముఖ్యంగా 'మ్బు' ఘటిత రూపాలు వాడటం నవీనతకు చిహ్నం. ఈ రూపాలు క్రీ.శ. తొమ్మిదో శతాబ్దానికే భాషలో ఏర్పడ్డవేగాని మధ్యకాలంలో ఏర్పడ్డవి కావు. ముప్రత్యయ సహితంగా. రహితంగా అనేక శబ్దాలు శాసనాల్లో కనిపిస్తాయి. అవన్నీ ఇప్పుడు భాషలో ఉన్నాయని చెప్పలేం. భాషా వ్యాకరణాలు అంగీకరించిన రూపాలు వాడుకలో లేనప్పుడు, అవి అంగీకరించని రూపాలు శాసనాల్లో కనిపిస్తాయి. సంప్రదాయ వ్యాకరణాలు ప్రకృతి. ప్రత్యయ

విభాగంలో గుర్తించని అమహత్ప్రత్యయం 'ము' తోపాటు సరిగా గుర్తించని 'వు' ప్రత్యయం విషయం కూడా కింది ఉదాహరణలవల్ల తెలుస్తాయి.

(i) ప్రత్యయ రహితంగా సహితంగా కనిపించే ఏకపదాలు కొన్ని :

దేశ్యాల్లో :

ఇల్లు-φ (ద. హిం. శా. 10.645.48, 1060: కోయిల-ము (IA 13 50 57, 918-25)

రాముడు-φ (భారతి 7.297-318 44,715-20): మదు-వు (CP 13/1908-9. 19, 709)

తద్భవాల్లో :

దణ్డు-φ (RPS 71-72.19,847): దణ్డా-వు (భారతి 5.618.7,897)

తత్సమాల్లో :

ద్రమ్మ-φ (తె. శా. 1-163-65.67,892-922): ద్రమ్మ-ము (JAHRS 1.81-85.3,10)

పదకొండో శతాబ్ది శాసనాల్లో 'కుంచ: కుంచము, బెల్ల: బెల్లము, మానిక: మానికము, సీమ: సీమము' మొదలైన అనేకోదాహరణలు కనిపిస్తాయి.

అమహత్ప్రత్యయం భిన్నరూపాలు కింది ఉదాహరణల్లో కనిపిస్తాయి:

నాగ-బు (భారతి 5.934.1,200)

కొట్ట-ంబు-న (ఎపి. ఇం 27225-28.10.575-600)

చే-ను (ద. హిం. శా. 6 585.10,633-63)

దేశ-ము (నె. శా. 3.1151 6,650)

పురస్సర-ం (ఎపి. ఇం. 29.160-64.4,680)

ప్రసాద-φ-చేసిరి (ద. హిం. శా. 10 609.14,675-99)

సాసన-వు (CP 10/1908-9.1,709)

కిరన-ము-న (భారతి 5.618 5,850)

కొల-న్-ఇ (ఎపి. ఇం. 27.46.29,915-25)

పై విదర్శనలనుబట్టి వుప్రత్యయం ఎనిమిదో శతాబ్దం నుంచి మాత్రమే భాషలో కనిపించేదని, అది విహితంగా ఎరువు మాటలలోనే వచ్చేదని తెలుస్తుంది. కొన్ని మాటల్లో ఇది ముప్రత్యయానికి ప్రత్యామ్నాయంగా వైకల్పికంగా వచ్చేది. ఉదా.

పరిహార-ము (ఎపి. ఇం. 27.236-38.10-11,700-25):

పరియారు-వు (RPS 71-72.19-20.847)

ప్రాకార-ంబు (భారతి 5.618.11,850):

ప్రాకారు-వు (ద. హిం. శా. 10 65.11,1090-91)

వీటినిబట్టి వుప్రత్యయం చేరేటప్పుడు ప్రాతిపదిక చివరి అత్తు ఉత్తుగా మారేదని తెలుస్తుంది. బుప్రత్యయం లేఖకదోషమో పాఠకదోషమో కావచ్చు. -ంబు ప్రత్యయం అమహదేకవచనంగా ఏడో శతాబ్దికి ఎరువు మాటల్లోను, ఎనిమిదో శతాబ్దికి దేశ్యపదాల్లోను-',మ్ (ం)/ము'గా మారిందని చెప్పవచ్చు. అప్రతిహతంగా ము ప్రత్యయాన్ని వాడటం ఏడో శతాబ్దికే భాషలో స్థిరపడిపోయినా పండితు లిప్పటికీ అది దోషమని భావిస్తున్నారు. చేను, కొలను వంటి శబ్దాల్లోని - ను ప్రాతిపదికలో భాగం కాదు. ముప్రత్యయాని కది రూపాంతరం. ముప్రత్యయాంతాలకు లాగానే వీటికీ 'ను' తో కలిసీ, కలియకా బహువచన రూపాలుండటం ఇందుకో ప్రధాననిదర్శనం. రెండోది కెయన్/కెయమ్, కుళమ్/కుళన్ ⊖ వంటి పర్యాయ రూపాలు తమిళంలో కూడా ఉండటం.

లు, ల, న, లు పరమైనప్పుడు తత్పూర్వ స్వరానికి దీర్ఘం రావటం నన్నయ సమకాల వ్యవహారంలో ఉన్నదనటానికి ఈ నిదర్శనాలు శాసన భాషలో దొరుకు తున్నాయి:

(i) ఏకవచనంలో:

నరకా-నం (ద. హిం. శా. 10.4.14,1008)

రాజ్యా-నయు (భారతి 5 796 17,1023)

భోగా-నకు (ద. హిం. శా. 10.644.78 79,1060)

లింగా-నకుం (నె. శా. 3.1072.16, 1088)

నిమిత్యా-న (ద హిం. శా. 4.1300.5,1095)

(ii) బహువచనంలో:

కుంచా-లు (ద హిం. శా. 4.1014.5,1038)

పరా-లు (ద. హిం శా 10 60.1,1091)

'అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబైన మహత్తు....' (బా.వ్యా. తత్స.38) మీదనే కాక ఇతరత్రాకూడా బహువచనంలో -రుప్రత్యయం చేరటం క్రీ. శ. ఎనిమిదో శతాబ్దినుంచీ కనిపిస్తుంది. ప్రౌఢవ్యాకర్త 'ద్విత్వయుక్తలాంతా'లకు గూడా (ప్రౌ. వ్యా. శబ్ద. 23) ప్రాసగత ప్రయోగాలను పురస్కరించుకొని రేఫాదేశం చెప్పేడు. ఈ రెండు లక్షణాలకూ సరిపడని ప్రయోగాలనూ, ప్రౌఢ వ్యాకర్త చెప్పిన మల్లశబ్ద విషయమూ కింద గమనించండి.

మల్లు-ర (ద. హిం. శా. 10 614.6.8)

మలిను-రు (శా. ప. మం. 1.2-3.15,698-934)

సంయుక్తు-రు (ఆం. సా. ప. ప. 24.158-62 4.10)

సంప్రదాయ వ్యాకరణాలేమన్నా ఎవ్వ-రు (భారతి 23.182-86.14,641), వేవు-రు (ఎపి. ఇం. 27.234 36.19,625-59) వంటివి కూడా ఈ రకం ప్రయోగాలే.

§ 2.51 ద్వితీయాది విభక్త్యంగంలో 'వాని', 'వీని' వంటి రూపాలేగాని 'వాడి, వీడి'వంటివి అసాధువులని వ్యాకర్తలు భావిస్తున్నందున అర్వాచీన రూపాలని భావించనక్కరలేదు. నేటి 'వీటి' శబ్దానికి పూర్వరూపమైన వీన్ని (ద. హిం. శా. 10.628.8, 825) ఉచ్చారణలో 'వీణ్ణి'తో సమానం. 'న్న' అనే వర్ణద్వయం 'ణ్ణ'గా ఏడో శతాబ్దికే మారిపోయింది అందుకు నిదర్శనగా 'తాన్నిగోన్న' (IA 9.102-3.7,5), కొణ్ణ (ఎపి. ఇం. 27.231-34.8,625-50) అనే శాసన ప్రయోగాలు చాలు.

§ 2.52 షష్ఠీ ప్రత్యయానికి ముందు నగాగమం రాని రూపాలు తొమ్మిదో శతాబ్దం నుంచీ శాసనాల్లో దొరుకుతున్నాయి. ఉదా.

చేను-కు (నె. శా. 3.1151.9,651)
సోము-కు (నె. శా. 3.1151 7-8,650)

§ 2.53 పరిమాణార్థకమైన - ఎడు ప్రత్యయం అర్ధానుస్వారం లేకుండానే క్రీ. శ. పదకొండో శతాబ్దంనుంచి కనిపిస్తున్నది. ఉదా. మానెడు (ద. హిం. శా. 5.12-11, 1074). ఇది ఆధునిక పరిస్థితికి ప్రతిబింబమే గదా.

§ 2.54 భూతకాలిక విశేషణ ప్రత్యయం - ఇనలోని ప్రథమాచ్చులోపించి పూర్వ పరహల్లులు (వర్ణ)సమీకరణం పొందిన రూపాలు తొమ్మిదో శతాబ్దంనుంచి కనిపిస్తున్నాయి. ఉదా.

(i) పురోగామి వర్ణసమీకరణం:
మన్న (<మనిన; తె.శా. 1.163-65.74 892-922)

(ii) తిరోగామి వర్ణసమీకరణం:
ఇన్న (<ఇడిన; శా. ప. మం. 1.2-3.41,898 - 934)
ఉన్న (<ఉండిన; భారతి 5.618.12.897)
కొణ్ణ (<కొణిన; ద. హిం. శా. 10.611.2.8)

§ 2.55 అత్తిన్ (శా. ప. మం. 1.2-3 7,898-934), నెగి (పై. 10), పోత (భారతి 5.618.3.850), తొల్లి (RPS 25-29.5,1065), పడువతి (పై. 7) వంటి అవ్యయాలు కావ్యభాషాశైలిలో ఉన్న శాసనాల్లో మాత్రమే దొరుకుతున్నాయి. కావ్యభాషా పదజాలం వ్యవహార దూరమై విలక్షణతను సంపాదించుకున్నదనటానికి ఇదొక నిదర్శనం.

§ 2.6 'కల' అనే అపూర్ణ క్రియను (defective verb) అన్నంతరూపాలకుచేర్చి భవిష్యదర్థాన్ని సూచించే క్రియా పదాలను వాడటం క్రీ. శ. పదకొండో శతాబ్దంలో గోదావరీ మండలంలో ఆరంభమైనట్లు దొరికిన శాసనాధారాలనుబట్టి చెప్పవచ్చు. అంతకు ముందుకాలంలో అలాంటి ప్రయోగాలున్నట్లు సాక్ష్యం దొరకలేదు. ఉదా:

ప్రతిపాలింపం-గల (ద. హిం. శా. 6.109.17,1076)
చెయ్య-గల (ద. హిం. శా. 5 71 8-9,1099)
ఓయం-గల (ద. హిం. శా. 4 1009.8-9,1092)

§ 2.61 నన్నయ కావ్యభాషలో కనిపించని తచ్ఛబ్దవకారంలోపంగల క్రియా
రూపాలు పదకొండో శతాబ్దంనుంచి మాత్రమే శాసనాల్లో దొరుకుతున్నాయి. ఉదా.

ఇచ్చినాణ్డు (<ఇచ్చినవాణ్డు: AR 77/1956-57. 14-15, 1096)

తిక్కన కవితలో ప్రవేశం సంపాదించిన ఈరూపం (ఇచ్చినాండు-అని)పద
కొండో శతాబ్దినాటి గోదావరీ మండలంలో బయలుదేరిన ప్రాంతీయపదమని. దీనికి
పదమూడో శతాబ్దినాటికి కావ్యభాషా భాగత్వం వచ్చిందనీ గుర్తించాలి. ఒకనాటి
'మాండలికాలు' మరోనాటి 'కావ్యభాష'లో భాగాలయినాయని గమనించాలి.

§ 2.62 ధాతుగత ప్రథమాక్షరదీర్ఘం హ్రస్వమై తరవాతిహల్లు ద్విరుక్త
మైన క్రియారూపాలు ఇప్పటికీ వ్యాకర్తల లెక్కన అసాధురూపాలే. పదకొండో
శతాబ్దంలో అలాటి రూపాలు శాసనభాషలో కనిపిస్తాయి. ఉదా.

పొయ్య (*పోయన్-కు బదులు: ద. హిం. శా. 5.71. 8-9,1099)

§ 2.63 'ఉన్నకలవ వర్ణకంబుల మీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు
విభాషనగు' (బా. వ్యా. క్రియా. 117) అనే సూత్రం ప్రకారం పూర్వరూపంనుంచి
'కలాఁడు' అనే అర్వాచీనరూపం సాధ్యమవుతుంది. ఇలా పరిణామ నిరూపణం
(process statement) చేయటానికి ఆధారం కనిపించదు. అతడు: ఆతడు,
ఇతడు: ఈతడు- వంటి శబ్దాల్లోలాగా అచ్చుల హ్రస్వదీర్ఘతలు పర్యాయోపయోగంలో
ఉన్నాయని భావించటం మంచిది. తద్ధర్మార్థక సమాపకక్రియారూపాలు 'కళాడు'
(*కలాడు: ఎపి.ఇం. 30. 12, 26, 8) వంటివి ప్రాచీనకాలంలోనే ఉన్నాయి
కాబట్టి పరిణామ నిరూపణం భావ్యం కాదు.

తద్ధర్మార్థక విశేషణ ప్రత్యయాలైన 'ఎడి, ఎడు' లేగాక 'ఏ, ఏటి' అనేవాటి
తరవాతి రూపాలుకూడా పదకొండో శతాబ్దంనుంచీ శాసన భాషలో కనిపిస్తున్నాయి.

ఉదా.

అఏ (*అయే: ద. హిం. శా. 4.1029.10, 1100)

అనేటి (*అనేవి: ద. హిం. శా. 6 586.8, 1074)

భాషావికాసక్రమానికి ఇవి మరికొన్ని నిదర్శనాలు.

§ 2.64 'అను' ధాతువు అన్నంత క్రియా రూపం వర్ణవ్యత్యయం చెందగా
ఏర్పడ్డ 'నాన్' అనే రూపం నన్నయ కవితలో ప్రవేశించింది (నన్నయ పదప్రయోగ
కోశము, పే. 580). నాం (RPS 25-29.7, 1065) అనేది ప్రాతిపదికాంత దీర్ఘాచ్చు
మీద ప్రత్యయాది అకారం లోపించటంవల్ల, ఆదివర్ణవ్యత్యయం జరగటంవల్ల
ఏర్పడ్డరూపం. ఈ ధ్వనిపరిణామం నన్నయకు సమకాలంలోనే జరిగింది. తనకాలంలో
తన ప్రాంతంలో శిష్ట వ్యవహారంలో ఉన్న రూపాన్ని నన్నయ గ్రహించాడని చెప్ప

వలసి ఉంటుంది. అంటే 'మాండలిక రూపం' 'గ్రాంథికం'లో ప్రవేశించి భాషను 'చెడగొట్టిం' దన్నమాట.

నన్నయ కవితలో - ఇలు/-ఇల్లు ప్రత్యయాలు చేరిన క్రియాపదాలు కనిపిస్తాయి. ముట్టిలు (తె.శా.1.163-65,59, 892-922), ప్రవర్తిల్లు (ద.హిం.శా. 10.23. 2-3, 719-20) వంటివి నన్నయకు పూర్వం శాసనాల్లోకూడా విరళవిరళంగా కనిపించిన క్రియా రూపాలు. పదకొండోశతాబ్దం తరవాత కూడా వాటి విషయంలో పరిస్థితి మారలేదు. మహాకవులు ప్రయోగించినంత మాత్రాన జవజీవాలు కోల్పోయిన మాటలు భాషలో ప్రచురంగా వాడుకలోకి రావని ఈ పరిస్థితి నిరూపిస్తుంది.

§ 2.65 సంప్రదాయ పండితులు 'నేని' అనే ప్రత్యయం ఉన్నదని వాదించటంకద్దు. 'ఈవును జూచితట్టి సభయేని వినంబడ దేయుగంబులన్'(భార.2-2-85) అనే పద్యాన్ని 'నేని' కోసం *'నీవును' అని కొందరు దిద్దివేశారు. నన్నయ పద ప్రయోగకోశంలో 'నేని' ఆరోపంగా లేదుగాని 'ఏని' కింద 'నీవును....సభనేని' అనే ప్రయోగం కనిపిస్తుంది। (నన్నయ పదప్రయోగకోశము, పే. 294). ఇదో చిత్రమైన సర్దుబాటు. ఇదికాక 'ఏని/నేని' ద్రుతమా కళా అన్న చర్చలు తీవ్ర తీవ్రంగా జరిగేయి. 'ఏని' రూపం ఒక్కచోటే శాసనాల్లో ఉంది. ఒకే శాసనంలో అది కళగా, ద్రుతంగా రెండు రూపాలతోనూ ఉంది. ఉదా.

ఎవ్వ-యేనిన్ (తె. శా. 1. 163-65. 54-55, 892-922)
కలర్—ఏనియు (అదే. 72, 73 పంక్తులు)

పై ప్రయోగాలను గమనించిన తరవాత బాలవ్యాకరణాన్ని (2. 9;8.41, .119), గంటి జోగి సోమయాజిగారి ఆంధ్రభాషావికాసాన్ని (1948; పే. 307, 491,552-54) పరికిస్తే ఈ విషయం మరింత స్పష్టమవుతుంది.

§ 2.66 సంప్రదాయ వ్యాకరణాలు అంగీకరించని రూపాల్లో, కావ్యభాషలో తరుచుగా కనిపించని ఆకారాల్లో, గిడుగు వెంకట రామమూర్తిగారు వాడిన రూపాల్లో సముచ్చయార్థక ప్రత్యయం శాసనాల్లో ప్రత్యక్షమవుతుంది. ఉదా.

గుడియుంని (*గుడియున్ని: ద. హిం. శా. 6.586. 7,1074)
దేవానొజ్జలకూ (*దేవనొజ్జలకూ: JAHRS 1.81-85.4,10)
ఎప్పుడూను (ద. హిం. శా. 19.4-8,1008)

భాషావికాసక్రమంలో పదో శతాబ్దినాటికి వచ్చిన ఈ రూపాలు ఇంచుమించు వెయ్యేళ్ళ తరవాత కూడా ప్రయోగయోగ్యాలు కావనటం ఎంత సమంజసమో తెలియదు. ఆ రూపాలు వ్యవహారభ్రష్టం కానంతవరకూ అనుపాదేయాలు కావు.

§ 2.70 గ్రాంథిక వ్యావహారిక భాషావివాదంలో పదజాల విషయం కూడా ప్రముఖ స్థానమాక్రమించింది. అందులో మిశ్రసమాసాల విషయం మరీ ముఖ్యం. ఒక భాషలోకి ఇతర భాషా పదాలు ఎప్పుడెప్పుడు ఎన్నెన్ని రకాలుగా ప్రవేశించినా, ఒక నియమిత కాలంలోని ఆ భాషాస్వరూపంలో అవి భాగాలనే పరిగణిస్తారు. చారిత్రక వ్యాకరణం రాసేటప్పుడో, నిఘంటువులలో వ్యుత్పత్తి నిరూపణ చేసేటప్పుడో, ఆయాపదాలు ఏకాలంలో ఏధ్వనిపరివర్తనతో ఏ విధమైన అర్థ విపరిణామంతో వచ్చాయో గమనించవలసి ఉంటుంది. వర్ణనాత్మక వ్యాకరణాల్లో ఆ ప్రసంగమే రాదు. దానికి నిమిత్తమూ లేదు. శాసన భాషను ఈ దృష్టితో పరిశీలిస్తే కొన్ని ముఖ్యవిషయాలు బయటపడతాయి.

§ 2.71 తెలుగు అనాదినుంచి సంస్కృతమయంగా ఉండేదనే భ్రమను పరిశీలిస్తే, క్రి.శ. 6–10 శతాబ్దాల మధ్యకాలంలోని శాసనభాషలో దేశ్యేతరశబ్దాలు నూటికి 20–25 పాళ్ళు మాత్రమే ఉండేవని, పదకొండో శతాబ్దంలో (బహుశా కావ్యభాషాప్రభావంవల్ల) అవి నూటికి 50 పాళ్ళవరకూ పెరిగ్గేయని తెలుస్తుంది. అంటే రానురాను ఇతరభాషల ప్రభావం (సంస్కృత ప్రాకృతాలుగూడా ఇతరభాషలే) పెరిగిందని గ్రహించాలి.

§ 2.72 సంస్కృత ప్రాకృతాలను మనం ఉన్నవి ఉన్నట్లు దిగుమతి చేసుకున్నాం అనుకోటం రెండో భ్రమ. అన్యదేశ్యాలను గ్రహించేటప్పుడు చాలా సందర్భాల్లో అర్థ విపరిణామం జరుగుతుంది. నన్నయ వాడిన సంస్కృతపదాలన్నిటినీ సంస్కృత నిఘంటువుల్లోని శబ్దాల అర్థాలతో పోల్చినప్పుడుగాని నిజం తేలదు. శాసనభాషలోనుంచి ఇందుకు ఉపోద్బలకంగా కొన్ని ఉపపత్తులు మాత్రమే చూపుతున్నాను. బ్రాకెట్లలో ఆ మాటలకు ఆనాడున్న అర్థాలిస్తున్నాను. సంస్కృతంలో వాటికున్న సామాన్యార్థాలను ప్రత్యేకించి చెప్పనక్కరలేదనుకుంటాను.

వక్రమ్బు (= అప్పు; నె. శా. 1.287.2,650)
కరణమ్ (= గ్రామాధికారి; ద. హిం. శా. 10.645.49–50. 1060)
జీవితంబు (= జీతం; తె. శా. 1.163–65.62 – 63,892–922)
నియోగముల్ (= జిల్లాలు; ద. హిం. శా. 10.645.56.1060)

ఇక నన్నయాదుల భాషలోనూ శాసనాల్లోనూ కనిపించే అర్థిన్ (శా. ప. మం. 1.2–3 7,898–934), రమణతో (అదే, 37 పంక్తి) వంటి పదాల విషయం వేరే చెప్పనక్కరలేదు.

§ 2.73 అన్యదేశ్యాలను మన భాషలోకి ఒకసారి గ్రహించిన తరవాత ఆ పదాలు మన భాషాధర్మాలకు అనుగుణంగా రూపభేదాలు పొందుతాయి. ఎరువు మాటలకు మూలమైన భాషగాని, దాని వ్యాకరణంగాని ఈ రూపభేదాలమీద ప్రభావం చూపలేవు. అయినా అజ్ఞానకృతదోషాలని కొందరు, పూర్వప్రయోగాలు కాబట్టి సమర్థించాలని కొందరు అభిప్రాయభేదాలతో పండితులు చర్చిస్తునే ఉంటారు. కాని భాషలో వాటికి ప్రాచుర్యం ఉంటూనే ఉంటుంది. ఇలాటి రూపాలు కొన్ని (చాలా వరకు కావ్యభాష చలవవల్లనే) పదకొండో శతాబ్దంనుంచి కనిపిస్తున్నాయి. ఉదా:

ప్రధాని (ద. హిం. శా. 4.1010.5.1055)
మనోవల్లభి, వనజనేత్రి (ఎపి. ఇం. 4.314-18.21,1075-76)
ఉరమాల (ద. హిం. శా. 6.109.29.1076)

§ 2.74 శాసనభాషా పదజాలంలో తత్సమాలు (మూలం నుంచి తెలుగులోకి వచ్చినప్పుడు వర్ణవికారాదులు పొందనివి), తద్భవాలు (మార్పులు పొందినవి), దేశ్యాలతో కలిసి ఏర్పడ్డ సమస్తపదాలు కోకొల్లలుగా ఉన్నాయి. ఇవి సంప్రదాయ వ్యాకరణ లక్షణాలకు విరుద్ధమే కావచ్చు. కానీ ప్రాచీనకాలం నుంచి ఈనాటివరకూ ప్రవాహినిగా ఉన్న మన భాషాస్వభావాన్ని సూచించే ఈ శబ్ద నిర్మాణక్రమాన్ని పరిహరించటం అసాధ్యమని గుర్తిస్తే చాలు; మిశ్రసమాసాల విషయంలో అప్రస్తుత చర్చలు లేకుండా పోతాయి. శాసనాల్లోని మిశ్రసమాసాల రకాలివి :

(i) తద్భవ దేశ్యాలు కలిసినవి :

కణ్డసామి (ఎపి. ఇం 31.74-80 36,669)
గొల్లపల్లు (ద.హిం. శా. 4.1016.2,1087)
మావ్వశాల గరువణ్డు (RPS 187-89.7-8,1018)
మొగమాడువు (శా. ప. సం. 1.2-3.42,898-934).

(ii) తత్సమ దేశ్యాలు కలిసినవి :

అమృతపడి (నె. శా. 3.1072.17,1088)
గణ్డభైరవ మగ్గణము (ద. హిం. శా. 10 647.23-24,1097)
జయమార (ద. హిం. శా. 6 109.29,1076)

పోరుమ్ముఖరాము (ద. హిం. శా. 10.599..1-2.625_50)
మనవర్తీణక (భారతి 3.83-94.45. 1060)

(iii) తత్సమతద్భవాలు కలిసినవి :

ఉపారబుద్ధి (ద. హిం. శా. 10.638.3,9/10)
ఘనరాచమణి (నె. శా. 3.1152-55.29-30.7)
చౌషష్టి (భారతి 5-618.3.850)
లోహదణ్డు (ద.హిం.శా. 4.1161-5,1082)

(iv) తత్సమతద్భవదేశ్యాలు కలిసినవి:

వేణవోజన్లు (ఎపి. ఇం. 2.40-42. 18-20.725)
దేవాన్రాజులకూ (JAHRS 1.81-85.4,10)

పై విధంగా మిశ్రసమాసాలు కల్పించటం క్రీ. శ. ఏడో శతాబ్దంనుంచీ కనిపిస్తున్నది. వీటిలో తత్సమదేశ్యాలు కలిసిన శబ్దాల సంఖ్య తద్భవదేశ్యాలు కలిసిన వాటికన్నా రెట్టింపు ఎక్కువ.

§ 2.75 తెలుగు భాష మొదట క్రియా ప్రధానంగా ఉండేదని (గంటి జోగి సోమయాజి, ఆంధ్ర భాషా వికాసము, 1948, పే. 143,144,150 వగైరా), తద్ధర్మార్థక విశేషణాలను ఉపయోగించి తొలి రోజుల్లో వాక్య నిర్మాణం జరిగేదని, నన్నయభట్టు కాలానికి భాష 'ద్రవస్థితిని' కోల్పోయి 'స్థిరపద్ధ'దని, ఆయన 'ప్రమాణీకరించిన' తరవాత తెలుగులో సమాపకక్రియల వాడకం పెరిగిందని (ముందు సమాపకక్రియ లేదప్పుడు. తరవాత వాటి వాడుక పెరిగి ఉంటుంది!), రకరకాలుగా ఊహాగానాలు భాషావిషయకంగా జరిగేయి. స్థిరీకరణ ప్రమాణీకరణాల విషయం దేవుడెరుగుగాని. శాసనాలను పరీక్షిస్తే అనాదినుంచీ సమాపక క్రియలున్న వాక్యాలే అత్యధిక సంఖ్యాకంగా ఉండేవని తెలుస్తుంది. ఈ మాటకు నిదర్శనాలు పూర్తిగా చూపవలసివస్తే మొత్తంగా శాసనాలన్నిటినీ ఎత్తిరాయాల్సి ఉంటుంది. అందువల్ల కొన్ని ఉదాహరణలు మాత్రమే-అందులోనూ ఏడో శతాబ్దివే-ఇస్తాను.

బోళచేత శపట గొణిరి (ఆం. ప. 1941-42. 2,600-25)
విషయదోళ కొణిరి (అదే. 5 పంక్తి)
కమ్మరి పనియణ వ్రాసె (ద. హిం. శా. 10.599.21-22,625-50)
కుమారశర్మ్మణికి ఉదకపూర్వ్వణ జేసి ఇచ్చిరి (ఎపి.ఇం.30.68-71.5. 699-700)

కఱ్ఱగార్లు కొట్టిరి (అదే. పంక్తి 8)
గొరవళ్ మెచ్చి చే నిచ్చిరి. (నె. శా. 3. 1152_55.35_36.7)

§ 2.8 కర్త, కర్మ. క్రియల సాధారణ క్రమాన్ని మార్చి రాసే 'కావ్య భాషా' వాక్య నిర్మాణ పద్ధతికూడా నన్నయ 'సృష్టి' కాదు; కనీసం ఏదో శతాబ్ది నుంచీ శాసన భాషలో కనిపిస్తూ వచ్చిన సంప్రదాయమే. అయితే ఈ పద్ధతులు శాసనభాషలో విరళంగా ఉండేవి. రకానికి కనీసం ఒక్క ఉదాహరణమయినా ఇస్తూ అక్కడక్కడ లభించినంతమటుకూ ఆనాటి పద్యశాసనాల్లోని అటువంటి వాక్యాలనుకూడా కుండలీకరణాల్లో ప్రదర్శిస్తుంటాను. ఉదా.

(i) కర్తలేని వాక్యాలు:

వానపోతుల ముచ్చియకు....ఇచ్చిరి....నేల (ద. హిం. శా. 10.590. 29_31.625_50)

శవణబోలకు....మఋపొలము పన్నస అడియిచ్చితిరి (AR 233/ 1949 _ 50.4 _ 8.8)

(ii) కర్మలేని వాక్యాలు:

కఱ్ఱగార్లు కొట్టిరి (ఎపి. ఇం. 30.69_71.6.699_700)
ప్రభురాము స్తు క్తోచె (నె. శా. 2.606_7.13_14.8)
మంగర్ల కొమ్మన కొలచిపెట్టె కట్టె (ద. హిం. శా. 6.250.7. 742_98)

(iii) వాక్యాంతంలో కర్త:

ప్రసాద చేసిరి....తొల్పకామి పట్టగుళ్లు (ఎపి. ఇం. 27.236-38. 12_15. 700_25)

[దీనియపెట్టెం బద్మొపలియుకు](ఎపి.ఇం. 4.314-18.21,1075-76)

(iv) వాక్యాంతంలో కర్మ:

గణ్డర ముత్రాజా పొడిచి పడిమె తోఋక్కాకు (ద. హిం. శా. 10. 640.3_6.9/10)

[మల్లపెత్తించె గుడియు మఠంబునుం గార్తికేయునకు] (శా. ప. మం. 1.2-3.27_29,898 _ 934)

(v) కర్మ-కర్త-క్రియ:

శ్రీసతికి దత్తి హంసుణువుళ దేవణ యిచె (AR 182/1933_34. pt.ii.p. 41.1 _ 8.7)

(vi) విశేష్యం–విశేషణం :

విల్చె విద్దమయ్య విక్రకపచమ్ము (నె. శా. 1. 287.4,650)

[శ్రీ యుద్ధమల్లు ద్రైతించె నమితతేజుండు] (శా. ప. మం.1. 2–3.43–44, 898–934)

§ 2.81 కొన్నివేల వాక్యాలున్న శాసనభాషలో యత్తదర్థకప్రయోగం గల వాక్యాలు నాలుగే నాలుగు లభిస్తున్నాయి. అదీన్నీ క్రీ. శ. 9/10 శతాబ్దాల నుంచి మాత్రమే. సంస్కృతాభిమానంవల్ల మన కవులు వీటినే ఆదర్శంగా తీసుకొని భాషనెంత కృత్రిమపరిచారో గమనించవచ్చు. ఉదా.

వీకేమి వలయు దాని వేఁడికొమ్మని (తె. శా. 1.163–65.30–32.892–922)

ఎవ్వఁడేని రక్షించు వానిద ధమ్మకావు (JAHRS. 81–85.7.10)

ఈ వృత్తి ఎవ్వాండేని అపహరించిన వాని పితృపితామహులు 60 వేలేండ్లు నయకనరకావం పడుదురు. (ద. హిం. శా. 10.4 12–14,1008).

వేగినాఁటి కెవ్వరు రాజులైరి వారుం భూపూర్వ స్థితిం దప్పక పాలించువారు ( ద. హిం. శా. 6.102.34–38. 1006).

§ 2.82 సంస్కృత భాషా ప్రభావంవల్ల తెలుగులోకి వచ్చిన కర్మణి ప్రయోగం గల వాక్యాలు మూడు మాత్రమే తొమ్మిది–పదకొండు శతాబ్దాల మధ్య కాలంలోని శాసన భాషలో దొరుకుతున్నాయి. కావ్యభాష ఈ రచనావిధానానికి అత్యంత ప్రాచుర్య మిచ్చి వ్యవహార దూరమయింది. ఉదా.

పట్టం కట్టబడిన వాన్ఱు (ద. హిం. శా. 10.629.5–6,825)

అతని చేయంబడిన ధమ్మకావుల (తె.శా. 1.163–65.55 – 56,892–922)

పై దుంబుళచేతం బట్టం కట్టబడి యేలి (ద. హిం. శా. 10. 640. 4–5,9/10)

§ 2.83 నన్నయ కావ్యభాషలో కనిపించే పదబంధాలవంటివి శాసన భాషలో కూడా ఆయనకు పూర్వకాలంలోనూ సమకాలంలోనూ కనిపిస్తున్నాయి. ఉదా.

పిడిచిన బసిఁడి నూఱు గద్యాణంబులు (JAHC 3.16–21.14 – 16,678)

ప్రసాద చేసిరి (ఎపి. ఇం. 27.236–38.12–13,700–25)

సురలోకం బెజె (ద. హిం. శా. 10.639–10,825)

సుఖంబుణ్డి (తె. శా. 1.163 – 65.2324, 892 – 922)

సుఖంబు మనువారు (అదే. 68 పంక్తి)
అతని కొటిపించిన చెఱువులు (అదే. 53, 54 పంక్తులు)
అతని చేయంబడిన ధర్మ్మకార్యవులు (అదే. పంక్తులు 55.56)
నీచేసిన యుపకారంబునకుం (అదే. పంక్తులు 27_29)
చలవందిరి సేసె (ద. హిం. శా. 6.586.8_9,1074)
తమ ప్రతిష్ఠసేసిన....ఈశ్వరాలయంబునకు (ద.హిం.శా. 10. 644. 66_70. 1060)
తమ వేయించిన....తటాకంబున (అదే. పంక్తులు 61_65)
వెలకుంగొని విడిచిన యిల్లు (ద. హిం.శా. 10.651.13,1090_91)

§ 2.8 పాల్కురికి సోమనాథులు అభిమానించిన 'మిశ్రప్రాకృతశైలి'కి కూడా శాసనభాషలో కొద్దిపాటి ప్రవేశముంది. అంటే ఈ విధంగా విరళవిరళంగా కనిపించే వ్యవహారవిధానాన్నే కావ్యాల కెక్కించి 'బాగు' పరిచేవారు. ఉదా.

క్షేత్రం ఖణ్డుగపల్ల సహితమ్ (ఎపి.ఇం. 10 100_6.28,674)
....ఏఱువ విషయం చేరన్ తస్యమాతా దత్తం....శతపంచాశత్ క్షేత్రమ్ (ఎపి. ఇం. 29.160_64.8_9,680)
దేవళమ్మకార్యస్య గుడి (ద.హిం.శా 10.608.2,8)
....కొమరకు పల్ల వాచార్య్యస్య లిఖితం (ఎపి.ఇం. 203 – 6,24.29,850)
క్రొత్తబోయు తటాకః (ఎపి. ఇం. 9.47 59,945_46)
ఇవన్నీ భాషావికాస సూచకాలయిన మార్పులే.

## నన్నయానంతరభాషావికాసం

§ 2.9 ఈ విధంగా నన్నయకు ముందూ, ఆయనకు సమకాలంలోనూ, శాసనస్థమైన వ్యావహారికభాష పొందిన వికాసాన్ని, ప్రాచీన కావ్యభాషకూ దానికీ గల భేద సాదృశ్యాలను కొంత విపులంగా చర్చించిన మీదట తరవాత కాలంలోని వికాసక్రమాన్ని స్థూలంగా నిర్దేశించటానికి ప్రయత్నిస్తాను. క్రీ. శ. 1100 తరవాత కావ్యభాషారూపాలూ వ్యావహారికరూపాలూ ఒకదాని పక్కన మరొకటిగా ఒకే శాసనంలో కనిపించే సందర్భాలున్నాయి. వాటిని ముందు ఉదాహరిస్తాను.

| శాసన కాలం (క్రీ. శ.) | శాసనం వివరాలు | పంక్తి పంక్తులు | గ్రాంథిక రూపాలు | వ్యావహారిక రూపాలు |
|---|---|---|---|---|
| 1150_60 | ద.హిం.శా. | 25 | ఇచ్చితిమి | |
| | 10.58 | 28,29 | నివేద్యానకు | |
| | | 29 | | ఇస్తిమి |

| శాసన కాలం | శాసనం వివరాలు | పంక్తి పంక్తులు | గ్రాంథిక రూపాలు | వ్యావహారిక రూపాలు |
|---|---|---|---|---|
| 1164 | ద.హిం.శా. 4-704 | 7 | | మస్మహోగ్రాజులు |
| | | 15 | | వెనక |
| 1228 | C.I.T. No. *10* | 20, 21 | గణపతి దేవ మహారాజులు | |
| | | 31,32 | | గణపద్దేవ మహారాజు |
| | | 37,38 | | ఇస్తిమి |
| | | 38,39 | ఎపదేని ఈనివాని | |
| 1234 | C.I.T.No. *13* | 14,15 (I) | చేయును, విచ్చేయుడి | |
| | | 14,15 (I) | | సంతోషం చేస్తిరి |
| | | 24 (II) | | ప్రియం |
| | | 26 (II) | | మరో విధము |
| | | 28,29 (II) | | దోషాలం జనువారు |
| | | 6 (III) | | జాగరం, బియ్యం |
| | | 30 (III) | బియ్యము | |
| 1259 | C.I.T. No. *52* | 87 పే. | రెండవ | |
| | | | | నాలుగో, ఏడో |
| 1313 | శా.ప.మం. 1 | 87 పే. | | పెయ్య లేంఛది: వెలసిన సూరును |
| | | | పురమున ఒసగి | |
| 1315 | C.I.T. No. *53* | 31,32 | | వేఇంచి యూసూంట్లు ముప్పయ్యాఖు |
| | | 68,69 | ఉంకువరు | |
| | | 54,55 | | సూర్యాత్ చంద్రాదులుండున్న |
| | | 61,62 | | ఎల్ల ప్రజలుండున్న ప్రతిపాలించీది |

| శాసన కాలం | శాసనం వివరాలు | పంక్తి పంక్తులు | గ్రాంథిక రూపాలు | వ్యావహారిక రూపాలు |
|---|---|---|---|---|
| | | 68 | నంముడి (నమ్మ్రడి) | |
| 1417 | శా.ప.మం.1 No. 74 | పే. 97 | చేయుచుండెను | |
| | | | | కొండయేలం బుత్తెం స్తేను, పృథివింన్షి. ఆకాశముంన్నుం |
| 1509 | ద.హిం.శా. 4.802 | 20 | | చెప్లేటి |
| | | 21 | | అనేటి |
| | | 32,33 | చెల్లగలది అని నేము మా భక్తిని | |
| 1513 | ద.హి.శా. 4.800 | 11 | | రాజ్యం సేస్తుంది |
| | | 18 | | పుట్యాదు చేను |
| | | 20_24 | అక్షేత్రానకు జెల్లె అనుభవించుమని | |
| | | 20;25 | | ఇస్తిమి |
| 1551 | C.I.T. No. 3 | 7,8 (I) | దేవాములకుం జేయించిన | |
| | | | | రాజ్యం చెయ్యంగాను |
| | | 11,12 (I) | | పాలింస్తునుండిన |
| | | 2-4 (II) | | యెల్లకాలాలకున్నూ సర్వమాన్యం చేస్తిమి: క్రితం పూర్వాన |
| | | 13,14 (II) | | అవధరించేృది |
| | | 16, 17 (II) | | శాసనం నిల్పిరి |
| | | 3-5 (III) | | హతం చేశిన |
| 1564 | ద.హిం.శా. 4,698 | 14 | శాసనక్రమ మెట్లనను | |
| | | 22 | | కటద చేశిన విష[illegible] |
| | | 26 | | అనతి స్తేను |

| శాసన కాలం | శాసనం వివరాలు | పంక్తి పంక్తులు | గ్రాంథిక రూపాలు | వ్యావహారిక రూపాలు |
|---|---|---|---|---|
| | | 33 | | నిరసయంగారి పల్లను |
| | | 37,38 | | దెభై నాల్గున్న |
| | | 43 | | ఇప్పిస్తిమి |
| 1592 | శా.ప.మం. 1.No.83 | పే. 108 | ఆగునేండు | |
| | | | వుండ్దెను | |
| | | | | అంపితేను |
| | | | | యీలాగు |
| | | | | రాజ్యం పరిపాలిస్తున్న |
| 1593 | ద.హిం.శా. 4.711 | 11 | | గ్రామాలు మామూలు |
| | | | | అవుచుంన్నవి |
| | | 15 | పంప్ప సవధరించ్చెను | |
| | | 17 | | మంగళగిరికాడ వుండ్డి |
| | | 26-29 | | నానారాష్ట్రాలకు నానా |
| | | | | బాబులకున్న లోను |
| | | | | గాన్ను నఫరు నఫరుకి |
| | | | | ప్రత్యేకాలు మస్తాను |
| | | 28,29 | చేసిన ప్రకారము | |
| | | 37 | మానితిమి | గడ్డిం ఖకీదులు |
| | | 41 | | యీ శాసన |
| | | | | ప్రకారం రాస్తిమి |
| | | 46 | నిలిపెను | కంభం |
| 16 శతా. | ద.హిం.శా. 4.710 | 21,22 | | నివేశనం సగమున్న |
| | | 26 | ఇచ్చువారము | |
| | | 26,27 | | నాలుగో భాగము |
| 1763 | శా.ప.మం. 2 No. 40 | పే. 32 | ఈ మూడు | |
| | | | చరణములు పొల్లులు | |
| | | | వివ వెక్కినాదను | |
| | | | | తొలి పద్యంలో |
| | | | | తెలిసేటందుకు |
| | | | | మళ్లి ( <మరలి) |

పై శాసనాల్లో 1150/60, 1164, 1564, 1592, 1593, 16 శతాబ్దాల శాసనాలు గుంటూరు జిల్లావి; 1228, 1234, 1551 నాటివి వరంగల్లు జిల్లావి; 1259 నాటిది మహబూబ్ నగర్ జిల్లాది; 1313, 1417 నాటివి కృష్ణాజిల్లావి; 1315 నాటిది మెదక్ జిల్లాది; 1509, 1513 నాటివి అనంతపురం జిల్లావి; 1763 నాటిది శ్రీకాకుళం జిల్లాది. అంటే నేటి వ్యావహారికరూపాలు ప్రాచీనరూపాలు భాషావికాసక్రమంలో క్రమ పరిణామంవల్ల ఏర్పడ్డవేనని, అవి ప్రాంతీయతాభేదం లేకుండా రాష్ట్రం అంతటా లిపిబద్ధ మైనవే నని తెలుస్తుంది.

§ 2.91 క్రీ. శ. పన్నెండు పదునాలుగు శతాబ్దాల మధ్యకాలంలో రమారమి రెండువేల తెలుగు శాసనాలు, 15, 16 శతాబ్దాల్లో ఇంచుమించు 500 శాసనాలు ఇప్పటికి ముద్రితమై దొరుకుతున్నవి. వాటిలో నుంచి దిఙ్మాత్రంగా కొన్ని రూపాలను ప్రదర్శిస్తే వ్యావహారిక భాషావికాసానికి పరిణామశీలమైన ఉదాహరణలు లభిస్తాయి. వీటిని స్థూలంగా పరిశీలించినా కొన్ని భాషాలక్షణాలు స్పష్టమవుతాయి. మొదటి ఉదాహరణ లిచ్చి తరవాత వాటివల్ల వెలుగులోకి వచ్చే ప్రధాన విశేషాలను కొన్నిటిని స్థూలంగా వివరిస్తాను. వివరాలకు కీ. శే. డాక్టర్ ఎం. కందప్పచెట్టిగారి అముద్రిత పరిశోధన వ్యాసం (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో దొరుకుతుంది) చూడాలి.

| శాసనరూపం | శాసనం వివరాలు |
|---|---|
| కొంద కిందుగాను | (C.I.T. No. 25. 16) |
| పుట్యండు | (ద. హిం. శా. 4.781- A. 8, 1235) |
| తనకూ | (శా. ప. సం. 1. No. 62, p.84, 1253) |
| ఇస్తిమి | (ద. హిం. శా. 4. 935.38, 1269) |
| ఎవ్వరడ్డపడ్డా | (ద. హిం. శా. 4.935-39, 1269) |
| మూలస్థానం శ్రీమహాలక్ష్మి దేవునికి | (C.I.T. No. 30. 9-10, 1303) |
| వద్దను | (ద. హిం. శా. 4. 810,1499) |
| వచ్చేస్తున్న...కనకాభిషేకం చేసిన రొఖ వరహాలు...ఇవే అక్షరాలాను ముపై వేలు | (ద. హిం. శా. 4. 282-1, 1514) |
| అరగించే అమృతపడి నైవేద్యం పళ్యాలు | (అదే. పంక్తి 2) |
| అరగించే అట్టుగాను | (పై) |
| వారి చాతను ఇప్పించిన | (ద. హిం. శా. 4. 699.23, 1546) |
| సోమయాజుల వార్కి | (అదే. పంక్తి 25) |

| శాసనరూపం | శాసనం వివరాలు |
|---|---|
| నాల్గోభాగమున్ను | (అదే. పంక్తి 36) |
| రెడ్డివారిగుంట్ట పడ్డను | (అదే. పంక్తి 39) |
| క్రయం రొఖగట్టి | (అదే. పంక్తి 51) |
| చేయించ్చిన కయింకర్య వివరం | |
| మంచ్చేశివున్న | (ద. హిం. శా. 4.280. 3.1556) |
| సమపుక వచ్చేయట్టుగా నున్ను | (అదే. పంక్తి 5) |
| మధ్యాహ్న అవసరం | |
| మంచ్చేశేటప్పు డల్లాను | (అదే. పంక్తి 7) |
| మాంగాణి స్వామ్యాను చెల్లివచ్చే | |
| పిఠలాపురం శ్రోత్రియం మకి స్థావరం | (అదే. పంక్తి 12) |
| మది సహా ధారపోయించ్చ | (అదే. పంక్తి 12) |
| సమపుక వచ్చేటందుకు | (అదే. పంక్తి 14) |
| యీ పేటకు రొంలు ఇచ్చిన వివరం | (శా. ప. సం. 2. నెం. 39, పే. 30, 1600) |

గ్రామాయలు ఆకారం అయ్యేటందుకు....యేయే స్థలాల నుంచి యెవరెవరు వచ్చినా ....పంపిస్తేను....గ్రామాలనుంచి....ప్రజలున్నూ బారాబళవంతులున్న....(అన్నవి తామ్ర శాసనం, ఆం. సాం. చ. పే. 353, 1490)

చేస్తున్నారో....రాయలవారు అనిన వివరం....ప్రజల్కు గ్రామం చూపించి ....పొలం యేర్పాటుచేసి (అదే. పే. 354)

మిరాశిలు యిచ్చిన వివరం....బాలా వుప్రపం చేస్తూ వుండగా (పెద్ద బెళగల్లు తామ్రశాసనం, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పే. 352, 1492)

పొలిమేరలు యేర్పాటుచేసి రాయసం పిరమరుసును అంపించి శిలాశాసనాలు యేర్పరచిన వివరం....యీ ప్రకారం.బారాబలవంతులు యెవరంటే (అదే.పే.353)

పుత్తుకొని (*పుచ్చుకొని; ద. హిం. శా. 6.745.10)

యెశోనిధి (అదే. 10.151.52)

జెవము (నె. శా. 2.18.3)

శెంఖు (ద. హిం. శా. 6.1052.11)

యవ్వరు (నె. శా. 1.17–18)

యనక (తె శా. 2.100.16)

మాను (ద. హిం. శా. 10.241.19)
కింద (అదే. 10.704.13)
పత్తిపాడు (అదే. పంక్తి 161)
పడశిన (అదే. 6.845.12)
చేశి (అదే. 6.995.7, 1138.11, 1142.16)
కలుహార (అదే. 4.672.9)
వరుషంబు (అదే. 5. 1008.1)
ఊళ్ళు (అదే. 6.1118.10)
పీళ్ళు (తె. శా. 2.37.3)
మహాదేవైన (ద. హిం. శా. 6.1097.9)
భీమీశ్వర (అదే. 10.177.42)
క్రిష్ణచతుర్దసి (అదే. 5.1070.4)
నెల్లు (*నెలలు; తె. శా. 1.47.5)
రాత్రిళ్ళు (నె. శా. 1.23.28)
భానుపత్రాయనింగారు (ద. హిం. శా. 6.977.12)
ధర్మాన్ని (నె. శా. 1.40.8)
దీపముకు (ద. హిం. శా. 5.1043.9)
తన ప్రిత్తివల్న (ద. హిం. శా. 10.422.36)
సుంకము వల్లను (ద. హిం. శా. 10.480.19)
ప్రిపాలక (ద. హిం. శా. 10.89.6)
ద్వార (ద. హిం. శా. 6.1136.7)
స్థలము మింద (అదే. 10.334.85)
గంగాపురము వద్ద (తె. శా. 1.158.16)
ఐను (ద. హిం. శా. 6.228.63; ఈ శబ్దం పన్నెండో శతాబ్దంనుంచీ తెలంగాణా గుంటూరులలోను, 14 శతాబ్దినుంచి ఇతరత్రా దొరుకుతున్నది. ప్రాచీన కావ్యభాషలో శాసనాల్లో 'ఏను' శబ్దమే దొరుకుతుంది )
వెయ్యి (అదే. 5.1202)
ఇశ్వయి (అదే. 5.1188.64)
ముప్పై (అదే. 6.936.7)

ఎనభై (అదే. 6.1035.15)
తొంభయి (అదే. 5. 1188.16)
మన్నింస్తిమి (అదే. 10.499.15)
కట్టిస్తిమి (నె.శా. 1.7.28)
చేసే (నె.శా. 1.38.63; ద. హిం.శా. 5.4.13)
చేస్తే (నె.శా. 3.48.56)
మూన్య (ద.హిం.శా. 6.1183.15, 1199.12, 1203.7, 1204.16)
పెట్నె (*పెట్టిన; అదే. 5.26.4)
సమర్పించను (*సమర్పించెను; అదే. 5 1228.10)
చేశను (చేసెను; అదే. 6.10.3.12)
దేవమ్మంగారి చాతను (*చేతను; అదే. 6.696.7)
ఉచ్చ్రుణ్ను (అదే. 4.709.75)
కుచ్చెణ్ను (అదే. పంక్తి 136)
బ్రుందావనం (అదే. 5.104.12)
పిత్రుస్థానము (అదే. 4.1248.9, 1112)
సుక్రుతము (అదే. 5.48.24)
తల్లిదండ్రులకు (అదే. 5.47.21)
గోత్రులైన (అదే. 5.1153.5)
సుపుత్రుండైన (అదే. 5.1167.4)
పళ్యేము (అదే. 5.47.17)
పళ్ళం (అదే. 4.984.6)
పళాలు (అదే పంక్తి)
పళ్యాలు (అదే. 4.984.6)
గొఱ్యలు (అదే. 5.1180.9; 5.1239.11)
గొఱెలు (అదే. 6.667.10; 887.12)
అజ్ఞేయభాగం (అదే. 10.749.24)
పత్చులు (*పచ్చలు; తిరుపతి శాసనాలు 3.32-2)
ఉచ్చవ దేవళ్యున్ను (ద.హిం.శా. 4.1344.7)
కొత్తయంటికి (అదే. 4.711.31)

పెగవ (అదే. 10.737 47)
చెర్పు కింద (అదే. 4.702.149; 4.686.14)
చెయ్యంగాను (తె.శా. 1.156.8)
దేమున్కి (నె.శా. 3. పొదిలి 14.23)
పండుమేశ (ద. హిం. శా. 5.26.7)
కలపు దయచేస్తేను (అదే. 10.751.22)
కాప (*సేవ; అదే 10.747.9,17,19)
సులతాని (అదే. 10.743.6)
తాణేదార్ (అదే. 10.745.12)
ఖబరు (అదే. 10.751.23)
మక్తా (అదే. 4.711.28)
వాళ్ళు (అదే. 5.102.4)
కవుళ్ళు (అదే. 4.711.14)
ఖంచికల తోటి (అదే. 6.1168.32; 1098.17)
అయినవాంట్లు (అదే. 10.751.23)
యక్కిడివాంట్లు (అదే. పంక్తి 24)
పిల్లవాంట్లు (నె.శా. 3—రాపూరు 11.19)
చేసేరు (ద.హిం.శా. 4.1375. 23)
ధరించేము (అదే. 6.248.58)
రక్షించేది (నె.శా. 2.284.15)
వేస్తేను (ద.హిం.శా. 5.26.3)
ఖిలమైపోతేను (అదే. 10.749.7)
విన్నపం చేస్తేను (అదే. 10.745.25)
చేశినాను (అదే. 10.735.17)
చేసుక (అదే. 5.30.16;నె.శా.3. పొదిలి 34.18)
రాజ్యం సేస్తుంటి (ద.హిం.శా. 4.800.11)
పాలిస్తున్న (అదే. 10.751.17)
దేవుడికి (నె.శా. 3.138.9,1247)
వాడ్ని పెద్దకొడుకు (*వాండ్ని/వాడ్ని-; నె.శా 3. 9. 29. 1259)

పంక్తియల వాతసు (ప. హిం. శా. 4.699.57,1546)
చెల్యాలు (*చెల్లెలు: అదే. 4.933.9,1241)
నూన (అదే. 6.864.10,1376)
దీపనూన్యా (అదే. 6.1203.7,1226)
వామటికొలుపు (అదే. 6.756.10,1113)

§ 2.92 ఇవిగాక గురజాడ అప్పారావుగారు (చూ. App. A. to 'the Minute of Dissent to the Report of the Telugu Composition Sub - Committee', pp. 117-122) మరికొన్ని వ్యావహారిక ప్రయోగాలను శాసనాలనుంచి ఉద్ధరించారు. పైన ఉదాహరించిన వాటిలో చాలావరకు నన్నెచోడ కృష్ణదేవరాయాది విద్వత్ప్రభువుల, తాళ్ళపాక చిన తిరుమలయ్యవంటి పండిత కవుల, శాసనాల్లోనుంచి వెతికి తీసినవే. ప్రాఙ్నన్నయయుగ శాసనభాషనులాగా విపులంగా విమర్శించకపోయినా స్థూలంగా కొన్ని ప్రముఖ లక్షణాలు చర్చించటం సాధ్యమే. శ్రీనాథుడు, పెద్దన, విజయరంగ చొక్కనాథుడు వంటి విద్వత్కవుల చాన శాసనాల్లోని వ్యావహారికంగురించి ప్రస్తావించటమే గాక కొన్ని ఉదాహరణలను గూడా గిడుగు వెంకట రామమూర్తిగారు (చూ. వ్యాసావళి, పే. 13,14,15; గద్య చింతామణి, ప్రథమ భాగం, పే. 357-66) ఇచ్చారు. వారు చర్చించిన విశేషాలను ఇక్కడ ప్రస్తావించటం పరిహరించాను. అసంఖ్యాక శాసన శబ్దాల చరిత్రను పూర్తిగా పరిశీలించటం ఇక్కడ సాధ్యం కాదు; అంత అవసరమూలేదు. (వివరాలు తెలుసుకో గోరేవారు బూదరాజు రాధాకృష్ణ రాసిన 200-1100 శతాబ్దాల శాసన భాషా చారిత్రక వ్యాకరణాన్ని, శ్రీ. శే. ఎం. కందప్పచెట్టిగారు 1200-1400 మధ్యకాల శాసనభాషకు రాసిన చారిత్రక వ్యాకరణాన్ని చూడవచ్చు. ఆంగ్లంలోఉన్న ఈ రెండు గ్రంథాలూ క్రమంగా ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయాల్లో లభిస్తాయి.)

§ 2.93 పై శాసన నిదర్శనాలవల్ల తెలిసే ప్రధానతమవిషయం పన్నెండో శతాబ్దం తరవాత తెలుగులో ఎ (= æ or E) అనే నూతన వర్ణం స్వతంత్రంగా ఏర్పడ్డదనేది. ఇప్పటి మన భాషలో ఇది ప్రత్యేక వర్ణమే. ఈ వర్ణానికి లేఖన చిహ్నం లేనందున అప్పటివారు రకరకాలుగా ఆయా మాటలను రాయవలసి వచ్చేది. ఈ ధ్వనికి సంకేతంలేక 'చెప్పారు, చెప్పేరు; వ్రాసారు, వ్రాశారు, వ్రాసేరు....' మొదలైన విధాలుగా మనం రాస్తున్నట్లే ఆనాటివారూ చేతనైన ప్రయత్నాలు చేశారు. లేఖన సంప్రదాయంలోని అవ్యవస్థనుబట్టి ఈ విషయాన్ని పునరుద్ధరించటం సాధ్య పడుతుంది. ఉదా.

నూన్యా, నూన, నూనె, నూనియ;
పళ్యెము, పళ్యాలు; పళ్ళెం, పళాలు;
గొలెలు, గొల్యాలు;
చెల్లెలు, చెల్యాలు;

చేత, చాత:
సేవ, శావ:
చేసెను, చేశను:
సమర్పించను, సమర్పించెను:
సెలవు, శలవు

పై జంటలను పోల్చిచూస్తే అకార, ఎకారాలకు మధ్యస్థమైన ఉచ్చారణగల మరో ధ్వని విశేషం ఉండేదని తెలుస్తుంది. ధ్వనిశాస్త్రరీత్యా ఎ (= æ or *E*) కాక తప్పదు. కాబట్టి మరో ప్రత్యేక వర్ణం తెలుగులో ఏర్పడ్డదని చెప్పవచ్చు.

§ 2.94 పై ప్రయోగాలవల్ల తెలిసే మరో విశేషం దంత్యోచ్చారణగల చకారం తెలుగులో ఉండేదని. ఆంధ్రశబ్దచింతామణ్యాదుల మాటలకుగాని అప్పకవి వివరణలకుగాని నిజంగా ప్రాముఖ్య మివ్వనక్కరలేదు. చింతామణి నన్నయకృతమే అనాటి లేఖన సంప్రదాయంలో దంత్యచజలకు ప్రత్యేక లిపి చిహ్నమే ఏర్పడివుంటే కింది భిన్నలేఖనాలకు ఆస్కారంలేదు. ఆ ధ్వనిని సూచించటానికి 'త్స' కారం రాయటం, 'త్స' కు బదులు 'చ' కారం రాయటం రెండూ కనిపిస్తాయి. ఈ మార్పులు పధ్నాలుగో శతాబ్దివి.

పుత్సుకొని = పుచ్చుకొని
పత్సాలు = పచ్చలు
ఉచ్చవదేవర్యున్న (ద.హిం.శా. 4.1344.7) = ఉత్సవ

ఏడువాడలపాలెం తామ్రశాసనంలోని 'చిత్తెల మొదత్స' అనే స్థలనామంలోని 'మొదత్స'కు '*మొదచ' అనే ఉచ్చారణ ఉందని ఊహించవచ్చు. (రా.ప.సం. 187-189.18.1018)

§ 2.95 పదాది దకారం దకారంగా మారటం కూడా పధ్నాలుగో శతాబ్దిలోనే జరిగినట్లు శాసనాలు నిరూపిస్తాయి. ఉదా.

దున్న (ఎపి.ఇం. 5.147.138,1213).
దున్న (నె.శా. 2.7, 1314)

§ 2.96 శాసన పరిశీలనవల్ల కొన్ని మాండలిక లక్షణాలు తెలుస్తాయి. ఎ వర్ణ విషయంలో పదమధ్య యకారఘటితరూపాలు కళింగాంధ్ర ప్రాంతాల్లోను, ఎకారాంతరూపాలు మధ్యాంధ్రంలోను, అదంత రూపాలు దక్షిణాంధ్రంలోను కనిపిస్తున్నాయి. 16వ శతాబ్దికి ముందు తెలంగాణా ప్రాంతీయ మాండలికం ప్రత్యేకతను సంపాదించుకున్న నిదర్శనలు దొరకవు. ఇలాంటి వనేకం. శాసనవ్యవహార ప్రభావంవల్ల కావ్యభాషలో ప్రవేశించిన వాడుకమాటలను, మాండలికాలను తరవాతి ప్రకరణంలో నిరూపిస్తాను.

# 3. వ్యావహారిక భాషా వికాసం

## సాహిత్యంలో

§ 3.0 నన్నయకు పూర్వం తెలుగువాళ్ళు 'గాసట బీసట' ('కాసట బీసట' అనాలేమో¹; నడకుదుటి వీరరాజుగారు: కాసట బీసట: సారస్వత వ్యాసములు. రెండవ సంపుటము, పే. 168-173: ఎఱ్ఱన నృసింహపురాణ పద్యము-పే. 171) మాత్రమే చదివి 'గాథలు త్రవ్వు'తుండేవారని. దాని స్వరూపం చాళుక్య విమలాదిత్యునినాటి ఏకువాడల పాలెపు తామ్రశాసనభాష తెలుపుతుందని పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు భావించారని నడకుదుటి వీరరాజుగారు చెబుతున్నారు. వారి లెక్కను పై పదబంధానికి 'అన్యభాష'లనే అర్థమయినా, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారివంటి సనాతన విద్వాంసుల దృష్టిలో 'అర్థం కానిది' అనే అర్థం (పై. పే. 173). ఈ మాటల కర్థం పదాల పాటల రూపంలో ఉన్న 'దేశీయ కవిత' అని తాపీ ధర్మారావుగారు (చూ. కొత్తపాళీ, పే 97) చెబుతున్నారు. ఇదే సమంజసతరమైన వివరణ. నన్నయకు మూడు నాలుగు వందల సంవత్సరాల ముందే కావ్యభాష ఉందని శాసనాధారాలు నిరూపిస్తున్నాయి. నన్నెచోడుడు ప్రస్తావించిన దేశిమార్గం పల్లెపాటల రూపంలోనైనా ఉండి ఉంటుంది. నన్నయ ఆదిమహాకవి కావచ్చునేమోగాని ఆద్యకవి కాడు. దేశీయ కవితా విశేషాలు అకస్మాత్తుగా పుట్టినవి కావు. హఠాదుత్పన్నతావాదం నిలిచేదీ కాదు. రంగనాథ రామాయణాదుల్లో చేరిన అమూలక కథావిశేషాలకు ఎన్నిటికో 'జనశ్రుతి' ఒక్కటే ఇప్పటికీ తెలిసిన ఆధారం. ఆ జనశ్రుతి పాటల రూపంలో ఉండవచ్చు: మన పండితులూ నన్నయనాటి 'సభ'లూ దానికి సారస్వత ప్రతిష్ఠ ఇచ్చివుండక పోవచ్చు. నన్నెచోడ కవి 'జానుఁదెనుఁగు' వాదానికి, పాల్కురికి సోమనాథుల ద్విపదవాఙ్మయాన్ని 'ప్రజాకథ' లనూ పరిరక్షించాలని, దేశికవితకోసం పెనుగులాడాలని, భాషాంతరీకరణాలు మాని తెలుగు సాహితి స్వతంత్రంగా బతకాలని చేసిన ప్రయత్నాలకు, 'సభ'ల అనుమతి లేకపోయినా ప్రజాసామాన్యం ఆదరగౌరవా లిచ్చిందని (పై. పే. 109-113) నమ్మవచ్చు. ఇప్పుడు లభిస్తున్న గేయ సాహిత్యంలో పదకవితలో ఏవి ప్రాఙ్నన్నయకాలానివో నిరూపించటానికి సులభ మార్గంగాని స్పష్టమార్గంగాని లేదు. అందువల్ల ప్రాచీనకాల కవిత్వంలోనుంచి భాషావికాస సూచకాలైన ఉదాహరణలు చూపటం కష్టం.

§ 3.1 భాషాసాహిత్యాల విషయంలో మన పూర్వకవులు అక్కడక్కడ చెప్పిన స్వకీయాభిప్రాయాలను పురస్కరించుకొని కొన్ని ఊహలు చేయవచ్చు. మచ్చుకు, తిక్కన 'ప్రాఁతవడ్డ మాట'లను పరిహరించాలనటంబట్టి ఇప్పటి మన

పండితుల్లాగా అప్పటి విద్వత్కవులు పూర్వపూర్వకాల శబ్దప్రయోగాన్ని అభిమానించేవారు కాదనవచ్చు. ఆయా మహాకవుల కావ్యాల కన్నిటికీ 'పదప్రయోగ కోశాలు' వచ్చేదాకా–వచ్చిన వాటినైనా ఈ దృష్టితో పరిశీలించేదాకా–గ్రాంథికాంధ్రం లోనే కాలపరిణామక్రమంలో భాషా స్వరూప స్వభావాలకు సంబంధించి వచ్చిన మార్పులను నిష్కర్షగా చెప్పటం కష్టం. అయితే స్థూలదృష్టికే కనిపించే మార్పులు అనేకం దొరుకుతునే ఉన్నాయి. 'ఇచ్చినాఁడు' వంటి క్రియారూపాలు నన్నయ భాషలో లేవు; తిక్కన భాషలో పూర్వకాలికరూపం 'ఇచ్చినవాఁడు' తోబాటు 'ఇచ్చినాఁడు' కూడా ప్రయుక్త మయింది. భాషలో వచ్చిన మార్పుకు ఇది సూచన కాదా? మొదట గ్రాంథికవాదులై తరవాత కొంతమారిన మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారివంటి విద్వత్కవుల దృష్టికే చాలా మార్పులు కనిపించాయి (చూ. 'భారతభాషకును నేటి గ్రాంథికభాషకును భేదము': సారస్వత వ్యాసములు, రెండవ సంపుటము, పే. 64-76; ముఖ్యంగా పే. 70-74). "కొమ్ములు తిరిగిన మహాకవులు, 'చల్లా అంబలి త్రావితిన్' అన్నప్పుడును, 'సిరాము సేన' అన్నప్పుడును, 'అందరికిన్ దలా యొకటి' అన్నప్పుడును, 'చిరుమన చెచ్చి రాచరిక మిచ్చిన' అన్నప్పుడును, 'మొక్క(ము) సామి' అన్నప్పుడును, 'సూసినా మేలు బాగెము సేసినాము' అన్నప్పుడును, 'నుయిదాటే వానికిన్' అన్నప్పుడును, 'కూచీకూసని చిన్న కూకటులతో' అన్నప్పుడును, "వంచే సేప్పల" అన్నప్పుడును, ఆ మహాకవుల చెవులకు ఏ పదాలు ఇంపుగా ఉన్నవో అవే ప్రయోగించినారు. వారు ప్రమాదముల వల్ల ఆ పదాలు ప్రయోగించినారని తలచడము తప్పు. ప్రాచీనరూపాలకీ, నవీనరూపాలకీ ఇదే భేదము. ఈ కాలములో 'గ్రాంథిక భాష' అనే భాషలో వ్యావహారికరూపాలు ఉండటానికి యిదే కారణము" అన్న వారి వాక్యాలు స్థూలంగా సాహిత్యంలో కనిపించేకొన్ని వ్యావహారిక రూపాలనునిర్దేశిస్తున్నాయి. గిడుగు వేంకటరామమూర్తిగారు ప్రాచీన కావ్యాలలోనుంచి వెతికితీసిన వ్యావహారికరూపాలు–భాషావికాస క్రమాన్ని సూచించే ప్రయోగాలు–'బాలకవి శరణ్యం'లో, 'ఆంధ్రపండితభిషక్కుల భాషా భేషజం'లో అనేకం ఉండనే ఉన్నాయి. చిలుకూరి నారాయణరావుగారు 1937 లో రెండు సంపుటాలుగా ప్రకటించిన 'ఆంధ్ర భాషా చరిత్రము'లో (చూ. 2 సంపుటం: ఉత్తరాంధ్రము: పే. 1681-1746: అనుబంధము I: పే. 1747-50) కావ్య, శాసన భాషా భేదాలలోని వ్యావహారిక రూపాలను ఏరితారు. అవిగాక మరికొన్ని కావ్యాల నుంచి సంగ్రహించిన ప్రయోగాలను కూడా ఇక్కడ ప్రదర్శిస్తాను. తెలుగు భాషలో చారిత్రక కాలంలో వచ్చిన పరిణామ ఫలితంగా అన్యదేశ్యాలు (సంస్కృత ప్రాకృత

శబ్దాలుకూడా నిజానికి అన్యభాషా పదాలే అయినా, మన పండిత లాక్షణికులు జన్యజనకసంబంధాలోపంవల్ల సంస్కృతప్రాకృత శబ్దాలను 'ఆంధ్ర' భాషా భాగంగానే పరిగణించారు.) భాషలో వచ్చి చేరాయి. తిక్కన కాలంనుంచీ వీటికి కావ్యప్రయోగాలు లభిస్తాయి. సమకాల జనవ్యవహారంలో ఉన్న పదరూపాలను తెలిసిగాని, తెలియకగాని, తెలిసీతెలియకగాని, తమ తమ సంస్కారభేదంవల్ల సాహిత్యంలో చేర్చిన కవులున్నారు. శ్రీనాథ కావ్యాల కాలంనుంచీ ఇవి కనిపిస్తాయి. ఇక కేవలం మాండలికపదాలుగా ఉన్నవాటికి సాహిత్యంలో స్థానం కల్పించినవారు కొందరున్నారు. నన్నయ కాలంనుంచీ వీటికి సాహిత్యంలో ప్రవేశం కలిగించడం పూర్వ ప్రకరణంలో కొన్ని ఉదాహరణలిచ్చాను. ఈ మూడూ మూడు విధాలుగా భాషా వికాసాన్ని సూచిస్తాయి. అందువల్ల విడివిడిగా ఆయా కాల ప్రయోగాలను పృథక్కరించి ఉదాహరించటం మంచిదనిపిస్తుంది.

## అన్యదేశ్యాలు

§ 3.2 తిక్కన కవితలో ఒకటి రెండు అన్యదేశ్య శబ్దాలుమాత్రమే కనిపిస్తాయి. నన్నయ 'గాడీలు' అన్నాడా 'గాడిద' లన్నాడా అనే చర్చను వదిలి వేస్తే తిక్కనే ఈ పదజాలానికి సాహితీగౌరవ మిచ్చిన మహాకవి. ఆయన ప్రయోగించిన 'త్రాసు' శబ్దం 'తరాజ్' నుంచి ఏర్పడ్డది (చూ. కె. గోపాల కృష్ణారావుగారు, తెలుగుపై ఉరుదూ పారసీకముల ప్రభావము, పే. 12). శ్రీనాథ కాలంనుంచి అన్యదేశ్య పదజాలం మన కావ్యాల్లో ఎక్కువగా వాడుకలోకి వచ్చింది. సంఘజీవి అయిన కవిని రాజకీయకారణాలవల్ల వచ్చిన మహమ్మదీయ భాషా ప్రభావం ఆకర్షించింది. మహమ్మదీయుల రాజకీయ శక్తితోపాటు వాళ్ళ భాషాపదాల సంఖ్యాబలంకూడా తెలుగులో పెరిగింది. చిన్నచిన్న జమీందార్లను ఆశ్రయించి కవులమీద తమ అధికారం నెరపిన లాక్షణికులకు మహమ్మదీయ ప్రాభవంలో – లేదా వారితో నిత్యరాజకీయసంబంధాల్లో – ఉన్నరాజులమీద ప్రభావం సన్నగిల్లి ఉంటుంది. 'కొత్త ఒక వింత - పాత ఒక రోత' అనే సామెత కూడా ఈ నవీనాకర్షణను కొంతకుకొంత సమర్థిస్తుంది. తెలుగురాజులలాగే పండిత సభలుకూడా బలహీనపడగానే కవి కొంత స్వాతంత్ర్యవాయువు పీల్చి ఉంటాడు. శ్రీనాథునివంటి పండితకవి అన్యదేశ్యాలను ప్రయోగించినప్పుడు, సామాన్యకవులకు అది మేలుబంతి అయినప్పుడు లాక్షణికులు చేయగలిగింది లేకపోయివుంటుంది. రాజబలం సంపాదించిన శ్రీనాథుడు 'మ్లేచ్ఛ' పదాలేకాక తిట్లుకూడా 'కన్నుల పండువ'గా ఉండేవని వర్ణించాడు.

"అన్నయమంత్రిశేఖరుఁ డహమ్మదుపేరు వజాస్యహామిధృ
త్సన్నిభకీస్ మది స్వముచితంబుగ వేసు మహీసురేంద్రదా

ఖ్యోన్నతి సంతతాభ్యుదయ మొందఁగఁ బారసిభాష వ్రాసినన్
గన్నులపండువై యమరుఁ గాకిత మంచలి పద్దపద్ధతుల్" (భీమ. i-74)

ఆశ్రయదాతల అన్యభాషాపాండితికూడా శ్రీనాథుణ్ణి ఆకర్షించింది: "అరబీ భాష తురుష్కభాష ... భాషావిశేషంబు లచ్చెరువై వచ్చు నరేటియన్నిటికి గోష్ఠి సంప్రయోగంబులన్" (భీమ. 1-73). "ఖుసి మెయిన్ సురతాణ నిండుకొలువై కూర్చున్నచో...." (హర. 1-22) మొదలైనచోట్ల శ్రీనాథుడు స్వేచ్ఛగా అన్యదేశ్యాలను వాడేడు.[3] 'గాయగోవాళ, మూరురాయరగండ' మొదలైన కర్ణాట బిరుదావళినే గాక కన్నడ పదాలనుగూడా శ్రీనాథుడే మొదటిసారిగా విశృంఖలంగా ఉపయోగించాడు: 'ఎల్లా శిష్యులఁగొంచు వత్తునా' (భీమ. 2-120). ఈ ప్రయోగాముల విషయంలో సమకాలపండితులు వివదించి అతనిచేత 'నా కవిత్వంబు నిజము కర్ణాటభాష' (భీమ. 1-15) అనిపించారేగాని, 'మ్లేచ్ఛ' పదాల విషయంలో ఎందుచేతనో నోరెత్తినట్లులేదు. పెద్దనవంటి పెద్దకవులు దేవతావిరహిణీ చంద్రోపాలంభనలోకూడా మహమ్మదీయాచారాలను ప్రస్తావించే స్థితికి వచ్చారు: "గోవధము సేయు తురకల దైవంబవు....' (మను. 3-42). శ్రీనాథ పద్ధతిలో అనేకాన్యదేశ్యాలను 'ఆంధ్రకవితాపితామహుండే' వాడేడు:

"పచ్చని హారుమంజి పని వాగె పకెక్కర
పారసి పల్లంబు పట్టమయము
రాణ నొప్పారు పైఠాణంబు సింగిణి
తరుకు లకోరుల తరసకంబు
మిహిపసిండి వరుంజు మొహదా కెలంకుల
తావు గుజ్జరిసేఁత కేవడంబు
డాకెలంకున సిరాజీ కరాచురకత్తి
మొలఁగటఁ గ్రొవ్వాడి గొరకలహాది"....(మను. 4-28)

ఈ విధంగా సాగిన కైతలో దేశ్యాన్యదేశ్యభేదమే కనిపించదు. తరవాతి కాలంలోని అప్పకవిలాంటి ఛాందసలాక్షణికులు కూడా 'వ్యవహారహాని' భయంవల్ల మ్లేచ్ఛోక్తులను అంగీకరించి, అవివాడిన కవులకావ్యాలకు ప్రామాణికత ప్రసాదించారు. సుదీర్ఘమైనా అప్పకవి చర్చను ప్రామాణ్యబుద్ధితో ఉద్ధరిస్తాను:

"ఆయాదేశమువారికి, నాయాదేశంబు భాష సమరిన కావ్యం
బాయతపురుషార్థంబులఁ, బాయక సమకూర్చు దేవభాషయ పోలెన్.

"సురభాషార్థము తెలియని, తరుణులకును శూద్రులకును దమతమ సీమం
బరఁగిన మాటలఁజెప్పిన, పరకావ్యము రసమున కవశ్యక మయ్యెన్.
"క్షితి మ్లేచ్ఛభాష శ్రుతిగ, స్థితమగు నట్లైన నా ధరిత్రిని దానిన్
మతిరోసి విడువఁ గూడదు, సతతము వ్యవహారహాని సంధిలు కతనన్.

---

సీతంబని దేశీయము, జాతియంబును పఠించు సమయమున నిజ
ఖ్యాతల భాషాకృతులను, ఖ్యాతిగ మ్లేచ్ఛోక్తు లాదిగాఁ గూర్తు రజా.
ఆంధ్రకవితాపితామహుని చాటుధార:
సమరక్షోణిని గృష్ణరాయల భుజాశాతాసిచేఁ బద్ధ దు
ర్దమదోర్దండ బెడందకోట యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి 'శవా సహో హరిహరంగా ఖూబు ఖోదాకీతే
టుముకీ భాయిలభాయిదే ములికి' యంచు న్నింటికిం బోవుచున్.
నంది తిమ్మన చాటుధార:
రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూర ఖడ్గాహిచేఁ
గాయం బూడ్చి కళింగదేశ నృపతుల్ 'హా నిష్ఠురీ ఘోషణీ
మాయాభీకుమురూకులోటు ఘహారా మాయాసదా జాహరే
మాయాగ్గేయమదే' యటంద్రు దివి రంభాజారునిన్ యక్షుసిన్.
శ్రీ కాళహస్తి మాహాత్మ్యమందు:
బిజమాడు దేవర నిజకృపామహిమఁ జెన్నారు నాయిల్లు ఓవారు సీకు
నాకు నీపాదార్చనము సేయ సదలింగమూర్తి సేసితె వచ్చి మూర్తమాడి
యొదయ చిత్తేశ నాయునికి నీ మజ్జనమాడు శివార్చన మాడుదేసు.... "
(అప్పకవీయము, 1.64-70)

పై వాటిలో మొదటి రెంటిలోను మూలభాషా పదాలను గణయతి ప్రాసల కోసం గందరగోళంగా మార్చటం జరిగింది. మొదటిది ఉరుదూ పదాలతో, రెండోది ఒరియా పదాలతో, మూడోది కన్నడ పదాలతో నింపినవి. చివరిది జంగమ వీర శైవుల గృహభాష కన్నడంతో తెలుగును చేసిన సమ్మిశ్రణం. ఆ జాతికి చెందని వారికి ఆ మాటలు అర్థంకావు-కానక్కరలేదు. దీన్ని వర్గమాండలికం (class dia-lect) అంటారు. అర్థం చేసుకోదలిచినవాళ్ళు ప్రయత్నపూర్వకంగా నేర్చుకుంటారు. ఇన్ని అన్యదేశ్యాలతో మాండలిక రూపాలతో నిండిన ఈ 'గ్రాంథికం' అర్థమై అలాగే ఉన్న 'వ్యావహారికం' అర్థం కాదని మన విద్వాంసులు ఎలా సమర్థించారో వారికే తెలియాలి. నిజానికి భిన్నదేశీయ పదాలయిన సంస్కృత ప్రాకృత పదాలు

తెలుగులో ప్రవేశించటానికి లేని అభ్యంతరం అలాటివే అయిన ఉరుదూ కన్నడాది పదాలు చేరటానికి ఉండనక్కరలేదు. ఆయా భాషల్లో మన పండితులకున్న పరిచయజ్ఞానలోపమే రూపనిష్పత్తి అసాధ్యమనే భావం కల్పించి ఉండాలి. తత్సమ శబ్దాల రూపనిష్పత్తికి విస్తారమైన ప్రణాళికలను అనేకసూత్రాలనూ కల్పించు కొన్న మన వ్యాకర్తలు ప్రాకృతపదాల విషయంలోనే రెండు మూడు ఉదాహరణలతో సరిపుచ్చుకున్నారు. ఇది వాస్తవానికి జ్ఞానలోపంవల్ల వచ్చిన దుస్థితి మాత్రమే. ఇక అన్యభాషల విషయం చెప్పనక్కరలేదు. తమ అజ్ఞానాన్ని ఆశక్తతనూ కప్పి పుచ్చుకోటానికే అన్యదేశ్యాలవల్ల భాషాసాహిత్యాలు అస్తంకారంగా పోతాయని వాదించి ఉంటారు. చిలుకూరి నారాయణరావుగారు 'ఆంధ్రభాషా చరిత్రము'లో (సంపుటం 1, తెనుఁగునఁ జేరిన యన్యదేశీయ శబ్దజాలము, పే. 575_621), గిడుగు వేంకట రామమూర్తిగారు 'ఆంధ్ర పండితభిషక్కుల భాషా భేషజం'లో, నిడుదవోలు వేంకటరావుగారు శబ్దరత్నాకరానికి చేర్చిన అనుబంధంలో, బ్రౌణ్యామిత్ర నిఘంటువులో తెలుగులో చేరిన అన్యదేశ్యాలకు కవి ప్రయోగాలను కూడా అక్కడక్కడ సంతరించిన వివరణలు, ప్రయోగాలు కనిపిస్తాయి. పేరుమోసిన పెద్ద కవుల ప్రయోగాలు మాత్రం ఉద్ధరిస్తాను:

శ్రీనాథ మహాకవి ప్రయోగాలు:

దివాణము (హర. 4.9)

మురాయించెన్ (హర. 3.89)

సామాన్లు (హర. 1.27)

సురథాణ (హర 1.22)

అల్లసాని పెద్దన ప్రయోగాలు:

అంచన (మను. 5.58); అసివారు (మను. 1.11); ఎకరాలు (1.46); నాగర (6.31); నకీబులు (5-42); మొస్తారము (4.115); పంజులు (5.44); ముక్కాము (5.100); మొండువాలు (1.40).

ఇతర కవి ప్రయోగాలు :

అలకన (పాండు. మా. 2.31); ఠాణము (పాండు. 1.109); తరటు చేసినన్ (పాండు. 1.163); దివాణము (పాండు. 1.109)

ఉలుపా (కళాపూ. 6.131); తసిలీములు (కళాపూ .2 15); దినుసు (కళాపూ.

480) గిముకాకరకులు (కవికర్ణరసాయనము, 3.195): బతినీ (అదే. 3.195)
కొజ్జా (భోజరాజీయము. 4.319)
మాస్టీకు (రామాభ్యుదయము. 6. పే. 124; 7. పే. 169): లూటి (అదే. 7. పే. 132)
మజ్జాన, పొజ్జాన (శ్రీకాళ. మా. సత్కీరకథ)
ఈ బిడారు మృగీమదశ్రీ బిడారు (విజయవిలాసము. 1 ఆ)
ఖాయీ యిది యొక నుడిలో (ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము. పే. 49)

మెలిబెట్టి చుట్టిన తెలి పైతిజీపాగ, చెవిసందిపాగలోఁ జెక్కుకలము
తొడదిన నెరిచల్వ నడరు సంగీజోము....
పదతలంబుల నెజ్జిపారు పాపోసులు, చెక్కుగా చంక చీటీ ఖరీతి
నడికట్టులో మొలనిడిన ఖలందాను, హస్తాగ్రమున వ్రేలు దస్తరంబు
—దూబగుంట నారాయణ కవి, పంచతంత్రము. 2-30

ముఖపుర్మముల టోపి మునఁగఁజుట్టిన (అదే. 1.172)
మెలిపెట్టిచుట్టిన తెలి పరంగి ముదాసుపై లపేటాదబ్బ పసులఁ జెలఁగు
బంగారు వ్రాఁతల పట్టు హిజారు కంబరు చీని వినుతాని పాసు నొసలు
తనుకాంతి కనిపింపఁ దనరు నంగీజోడు పలిపెంపు ఖాలువ పల్లెవాటు
పసుదలలోన దావాకత్తి వదలు పాపోసులు గోరంటఁ బొలుచు గోళ్ళు....
—శుకసప్తతి, 4.27

మల్వారుఁడై 'తలారికి బులావు ధగిడికే' యను మాటకు (అదే. 4.28)
పసరపుమాంసముఁ బెట్టియు. పసకల సులతాను ముసలిమానులఁజేసెన్
—వేమన, ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పే. 394.

గంజాయిగుండ హుక్కా లుడికెడి నీళ్ళు (అడిదము సూరకవి. చాటు పద్యమణి మంజరి. పే.170)

ఎలమితో సోమయాజుల పెద్ద రూక్లిలు గుడిగుడీలుగఁ జేసికొనెడివారు
—సింహాద్రి నారసింహ శతకము. ఆం. సాం.చ., పే. 387

జడవిప్పి జులుపాలు సవరింపు మిరువంక బలు కిటికీదారు పాగఁజుట్టు
పడిగ నంగీ యిజార్దొడుగు దట్టీ జుట్టు కైజారుదోపు డాల్కత్తిఁబట్టు

బీబి నాంచారినిఁ బిలిపింపువేగమే తుద కభ్యసింపుము తురకభాష
సిచులకు సలాంచేయ నేసహింప ——అదే. పే. 388
చేరి పాములకు తాజీము లీయఁగలేక మును నమాజాఫ్వసుల్ వినఁగలేక
—భల్లా పేరకవి భద్రగిరి శతకము, అదే. పే 389
అవనీశ్వరుఁడు మందుఁడైన నర్థుల కియ్యవద్దని వద్ద దివాను చెప్పు
మునిషి యొక్కటి చెప్పు బుకిషి యొక్కఁడు చెప్పు తరువాతనో మజుందా
చెప్పు

తలఁద్రిప్పుచును శిరస్తా చెప్పు వెంటనే కేలు మొగిడ్చి వకీలు చెప్పు
దేశపాండ్యా తాను తినవలెనని చెప్పు ముతసద్ది చెవిలోన మొరసి చెప్పు
—పదాల సారంగపాణి వేణుగోపాల శతకము, అదే. పే. 406.

కురాసాని (ద్విపద రఘునాథాభ్యుదయము, పే. 51)
పౌజు (రఘునాథాభ్యుదయ యక్షగానము, పే. 41)
సజాలు (చంద్రికా పరిణయము, 3-58)
జాఫరా (హంసవింశతి, 1-240); బాజారు (అదే. 2-153); సిస్తుగ (అదే
5.25);
ఖుశాలు (అదే. 5-182); సెదాసు, ఖూబు (అదే. 5-201)
నేజ (రాఘవాభ్యుదయము, 4-15); జరుబాబు (అదే. 4.181)
ఫిరంగీలు (అహల్యా సంక్రందనము, 2.95)
జూలుము (రాధికా సాంత్వనము, 110)
సకాసిగుదారు (సత్యభామా సాంత్వనము, 3-4); హజూరు (అదే. 4.60)
బందిఖానా (అదే. 4.118); కపురు (అదే. 4.180)

ఇలాటివి అనేకానేకం. మన కవులు 'మ్లేచ్ఛ' పదాలు వాటి వాటిని 'అచ్చ తెనుగు'లో భాగమనుకోవటానికి తెలగనార్యుడి యయాతిచరిత్ర నిదర్శనం. ఈ తీ ఎంతదాకా పోయిందో నిరూపించటానికి శిష్టు కృష్ణమూర్తిశాస్త్రివంటి లాక్షణిక క చెప్పిన 'పీరు తెలుంగు సామ లంబీతబీయతు నొప్పు గొప్ప సర్కారువలే జమీ దరఖాస్తుగ నేలిన రాజమాన్య హంపీరులు....' వంటి సుదీర్ఘమాలికా వృత్తా నిదర్శనాలు. వీటికి వేటికీ లేని 'అర్థం కాకపోవటం, అలాక్షణికతలు' ఆధుని రచయితలు అన్యదేశ్యాలను ఉపయోగించటంవల్ల వస్తుందనుకోవటం, 'భా

సాంకర్యం' కలుగుతుందని వాపోవటం అతార్కికమే కాక అజ్ఞానం కూడా. భాషలో కొత్తరకం పదజాలం చేరటం దాని వికాసానికి నిరూపణం.

## వ్యావహారిక రూపాలు

§ 3.3 శ్రీనాథుడి కాలంనుంచి వ్యావహారిక రూపాలు పద్య గ్రంథాల్లో చాటువుల్లో దొరుకుతున్నాయి. దేశం చూసినవాడు కాబట్టి, కొత్తదారులు తొక్కినా సామాన్య లాక్షణికులూ కవులూ వేలెత్తి చూపటానికి సాహసించలేని వ్యక్తి కాబట్టి, అతడే నిరంకుశతకు చిహ్నంగా ఈ 'అసాధు' రూపాల జీవశక్తిని కవితలో వినియోగించుకో గలిగేడు. కొన్ని ఉదాహరణలు చూద్దాం:

'హరిదాటించెఁ బురోపకంఠమున....ఇరువై నాలుగుమూళ్ళ మేర (కాశీ. 1-52)

'దస్త్రియవ్ మసిబుడ్లయుం గలములున్....వస్తూ చూస్తిమి రోస్తిమిన్ బడమటన్ వ్యాపారులం గ్రూరులన్ (చాటు పద్యమణి మంజరి. పే. 128)

'....ఏకీకృతముగ నేసులం, నేసులు వినవకిరె ముదిర యేసులముదిరా' (అదే. పే. 134)

'....చే సిమిలే సి మామె కుడిచేతికి దండము....' (పీఠి. వేటూరి పీఠిక, పే. 60)

శ్రీనాథకృత మనబడే 'పలనాటి వీరచరిత్ర'లో "అరసున్నాలు, బండిరాలు, భాష ప్రవాహంలో లేని అనావశ్యక గజడదబసవలు మొదలైనవి. నేను చేర్చినవేను. ఇవి లేకుంటే తెలుగు గ్రంథం కాదనుకొనే దశలో ఛాందసమార్గాన్ని అనుసరించి వాటిని చేర్చాను. ఈ అకార్యానికి ప్రాయశ్చిత్త రూపంగా వాటి విప్పుడు తొలగించాను" అన్న అక్కిరాజు ఉమాకాంతంగారి మాట (చూ. ద్వితీయ భూమిక) నిజమే అయితే అది సజీవ వ్యావహారిక గ్రంథ మన్నమాట. ధూర్జటివంటి నిరంకుశు లయిన కవులు ఈ రూపాలు యథేచ్ఛగా వాడేరు; ఇతరులు ప్రమాదవశాన వాడి వుంటారు. 'అసాధు'వులయిన ఈ ప్రయోగాలవల్ల భాషా చరిత్రలోని కొన్ని ముఖ్య పరిణామాలను గుర్తించటం సాధ్యమవుతుంది. ఇలాటి ప్రయోజనవంత రూపాలను మొదట ఉద్ధరించి తరవాత ఇతర వ్యావహారిక రూపాలను సాహిత్య ప్రయోగాల్లోనుంచి ఉదాహరిస్తాను.

ఋకారానికి ఉచ్చారణలో మార్పు వచ్చినందున ప్రత్యేక వర్ణత్వం దానికి తెలుగులో లేదని ఇంతకు ముందు స్థాపించాం. 'సత్తురుమత్తైరి వారు మరుద్గణంబు' వంటి తిక్కన ప్రయోగం (శల్య. 2-160) ఇందుకు [illegible] లో బల పతివంటి లాక్షణిక కవి 'బృంగి తపించ త [illegible]' ([illegible] 1.21) అనే



విలోమ లేఖనంవల్ల యతి సరిపెట్టుకున్నాడంటే వ్యవహారబలం ఎంతటిదో గమనించవచ్చు.

మధ్యకాలంలో స్వతంత్రంగా 'ఱ' వర్ణం తెలుగులో ఏర్పడిందనటానికి ఇంతకు ముందు శాసనస్థ నిదర్శనాలు కొన్ని ఇచ్చాను. ఈ కింది ప్రయోగాలు ఆ భావానికి మరి కొంత బలమిస్తాయి:[4]

'చన్నయాచార్యు(డాచార్య చక్రవర్తి' (*చెన్నయ- అంటే యతి భంగం; గంగావధూటీ పరిణయము, 1-33)

'చఱకగు వింటి బిర్కు( చెఱుచన్' (*చెఱకు-అంటే యతిభంగం; అహోబల పతి కాళింది కన్యాపరిణయము, 3-86); నీ తంత్రాన సుమీ (అదే. 2-71)

చాయన్వలె (యతిస్థానంలో; చింతలపల్లి ఛాయాపతి, రాఘవాభ్యుదయము 5-260)

చాటంత పబ్బుదో(చె (శుకసప్తతి. 4 124)

కిణ్ణాకు పంపితే (అహల్యా సంక్రందనము, 3-67)

మెంతాకు (హంసవింశతి, 4-133); చెరించే విధము (అదే. 5-195)

ఎంతసేపాయ (విష్ణుమాయావిలాసము, 2. పే. 46); ఎక్కడ బోయనో (అదే. 2.44)

ఇనుప కదేలు (బిల్హణీయము, 2-34)

కుందనపుం గదేలు (చంద్రరేఖా విలాపము, 2-88)

కళావతెమ్మ (ఉషాపరిణయము, 1-10; మన్నారుదాసవిలాసము, 1-46)

ముత్తేల హారములను (రాజగోపాల విలాసము, 2-33)

ఈ కింది నామవాచక రూపాలను గమనిస్తే ఏదో కొంత మాండలికయోగత కూడా ఈ 'అసాధుత్వం'తో బాటు కలిసివుండేమో ననిపిస్తుంది.

సరంబు (= *సరస్సు; కట్టావరదరాజు రామాయణము, 2. పే. 32)

కుఱుచగడ్డిగము; గడ్డిగడిగ్గి (విజయరాఘవ రఘునాథాభ్యుదయము, పే. 30)

ఎనుబో(తు వచ్చుటన్ (హంసవింశతి. 5-33)

చందు మున్నగు గ్రహోచ్చయములు (విష్ణుమాయావిలాసము, 3. పే. 50)

వలయు(గా కి(క దాప వశగాదు మమత (అదే. 4. పే. 91)

అతగానికి (శుక సప్తతి. 2-190)

ముసుకు (అదే. 4. 188)

ఎఱ్ఱ, సఱ్ఱ (షట్చక్రవర్తి చరిత్ర, 2-108); ఆతల (అదే. 7-45)

సంసర్గ సలిపినావు (అదే)

యవ్వనాఢ్య (కాళిందీ కన్యాపరిణయము. 2.115); కర్గె క్రమాంబు చెప్పఁగలవ్

(అదే. 2-8)

తలారికాండ్లు (అప్పకవీయము. 2.196)

కాణాచికాండ్లు (శుకసప్తతి. 4-162)

వజీరుండు (అహల్యా సంక్రందనము, 1-51)

మొగలీ వజీరుఁడు (సత్యభామా సాంత్వనము. 3 54)

అంబు గ్రుంగిన తప్తలోహంబు కరణి (బిల్హణీయము. 1-149)

ఈ కింది బహువచన రూపాలు కూడా పై వాటి వంటివే:

ఎలుగులు తోడేళ్ళు నేసులు లేళ్ళు (కట్టా....రామాయణము. 2. పే. 4)

ఒళ్ళలోఁ గకితంబు లొప్పుగా నునిచి (విజయరాఘవ రఘునాథాభ్యుదయము, పే 61)

వంకలను డొంకలను టీళ్ళఁ దాళ్ళ డాళ్ళ<br>గొప్పలను దిప్పలను మళ్ళ గుళ్ళ సూళ్ళ } హంసవింశతి. 1.189

పొలము కాండ్లకుఁ బుట్టు (హంసవింశతి. 5.35)

పసుల గాళ్ళను (గంగాపురమాహాత్మ్యము, 2.1)

మాటర సెదరింపుడు (రాఘవాభ్యుదయము. 6-103)

పైళ్ళ (షట్చక్రవర్తి చరిత్ర. 2-42)

కొమాళ్ళ (పాంచాలీ పరిణయము. 1-39)

నెల రెక్కళ్ళకు (సుగ్రీవ....చంపూ రామాయణము. 1-14)

ఫిరంగిలు (అహల్యా సంక్రందనము. 1-65)

కింది రూపాల్లో బాపసిద్ధ క్రియలు ఉండవలసిన చోట్ల కనిపించవు:

తిద్దరణిపాలకు ముంగల (చంద్రికా పరిణయము. 5-33)

బృందావనము లోగిలందు వెలయ (హంసవింశతి. 1.151)

మఱుసనాఁడు (అదే 5-202)

నావల మేల్పోగను కీల (సకలజనమనోహరము. 3-40)

కూతవగుటను వోరికిఁ దోఁచినట్లు (అదే. 3.44)

పగలినుం డేచంగ (షట్చక్రవర్తి చరిత్ర, 3.62)

కింది ప్రయోగాల్లో ఔపవిభక్తికాలు ఉండరాని చోట్ల కనిపిస్తాయి:

అవని చెంగట నామటి మేర (కట్టా....రామాయణము, 2.35)

పోలుగ వాతాపి పొట్టటఁజేసి (అదే. 2.37)

అడుగిటిలోనఁబట్టు ( = అడుగులోన: షట్చక్రవర్తి చరిత్ర, 2-66)

నేతిడి నెఱ్ఱఁగ వేఁచిన వేఁపుడు (పాంచాలీ పరిణయము, 4-47)

కింది రూపాల్లోని విభక్తి ప్రత్యయాలు గమనార్హమైనవి:

మనసుకె (రాఘవాభ్యుదయము, 6.249): తోటి (అదే. 4.157)

అందుకు నామనోరథం దక్కద....(హంస. 1-84)

రెడ్డి నింట్లోకి పిలిచి నీరేరుహాక్షి....(అదే 3-91)

భూములనుంచి (రాఘవాభ్యుదయము, 3.64)

కల్లనావల్ల గోరంత గలిగెనేని (సారంగధర చరిత్ర. 2 అ)

శేషుకైన (గంగాపుర మాహాత్మ్యము, 2-115)

ఆర్తరక్షణ బిరుదుకు హానివచ్చు (సింహాద్రి నారసింహ శతకము, 16)

కింది ప్రయోగాల్లోని పదమధ్య సంధిని గమనించండి:

రెన్నెల్లు, మూన్నెల్లు (కట్టా....రామాయణము, 2. పే. 33)

రెన్నాళ్ళ తెరువు (అదే. 2. పే.35): బంట్రోతు (అదే.2 35): బంట్రవులు (అదే. 4.168)

తెప్పర్లి (ఉత్తర రామాయణము. 3-353)

ఏఖాన్నరును (చెంగల్వ కాళకవి రాజగోపాల విలాసము. 1-26)

మర్లి (షట్చక్రవర్తి చరిత్ర, 2-47)

కింది ప్రయోగాల్లోని సంధి విధానం గమనార్హం:

అముక్కోలు సుంకము (హంసవింశతి, 4.84): బావం పలుకులు (అదే 1.105) బొక్కసమింట్లు (కట్టా....రామాయణము, 2. పే. 151)

ముప్పది రెండ్రాగములు (షట్చక్రవర్తి చరిత్ర, 2.131): పుడమంతయు (అదే. 6.63):

మన నీలవేణిచె (గంగాపుర మాహాత్మ్యము, 2-133)

అగాటున నెఱఁగుండ నవధరించేవి (రఘునాథాభ్యుదయము. పే. 26)

పసపాకు పందిరి (హంసవింశతి. 1-151); వెందుంగరము (అదే. 4-26)
దానిల్లు (అదే. 4-60); తనిచ్చ (అదే. 4-146); ఆ జవరాలు తాల్చొగిన్
(అదే 5-88); దోవతొసంగు (అదే. 5-138); పట్టిచ్చి (అదే. 5-249)
మునుఁగేసికొని (ఉత్తర రామాయణము. 1-99); నిలరేము (అదే. 4-78)
అనవలసంటిగా కెఱుఁగవా (విజయ విలాసము. 1-161)
మోక్షమునకుఁదోవ మొసలెత్తుకొని పోయె (అదే. 2-43)
చెవులు పట్టాడించు (అదే. 2.106)
కాదేవినుఁదొక్కటి యిం, కాదేవిని (ఇంక + అదేవిని: ద్విపద సారంగధర చరిత్ర)
ఒకక్షరమైనను రాదు (శుక సప్తతి. 2-438)
నడవళ్ళెఱుంగుదురు (పాంచాలీ పరిణయము. 3-39)
బంగరు పరిటాకు (గంగాపుర మాహాత్మ్యము. 2-156); సరస తెమలక
(అదే. 2-212);
పోయి తప్పుడు (అదే. 3-169)
చేతెంట (= చేతి వెంట: బిజ్జల తిమ్మారెడ్డి అనర్ఘరాఘవము. 2-17)
మాయింటాతఁడు (అహల్యా సంక్రందనము. 3-58)
అంతరీపమునసుం దేతించి (బిల్హణీయము. 2-20)

ఈ మిశ్ర సమాసాలు లక్షణ వ్యతిరేకమైనవే:
శూద్రబిడ్డ (హంసవింశతి. 5-124)
బీగముద్రలు (ఉషా పరిణయము. 2-97)
మూఁడొక్కసం బన నమరున్ (అహల్యా సంక్రందనము. 2-52)

ఈ ధాతుజ విశేషణాలు అలాక్షణికమైనవే:
తెలివిడి (అప్పకవీయము. పే. 30.33)
మెఱుపులు మెఱుసుట (అదే. 2. ఆ. పే. 196)
దున్నికము (బిజ్జల తిమ్మారెడ్డి అనర్ఘరాఘవము 1-90)
చేసుట గాక విశేషంబు గలదె (కట్టా....రామాయణము. 2-30)

కింది క్రియారూపాలు భాషాపరిణామ క్రమంలో సహజంగా ఏర్పడి సాహిత్యంలో స్థానం సంపాదించినా అలాక్షణికాలుగానే పరిగణింపబడుతున్నాయి:
కర్తర్థకం: మిన మిన మెఱుచుఁ (రఘునాథ రామాయణము. 1-101)

భూతక్రియ : వెళ్ళె (పాంచాలీ పరిణయము, 5-47)
భూతకాలిక వ్యతిరేక విశేషణం: విచారించుకోక (శుకసప్తతి, 2-548)
తద్ధర్మ విశేషణం: ఎబిఁగేటట్టయితే (హంసవింశతి, 2.128): వచ్చుచుఁ
బొయ్యేటి (అదే. 2-162): సొగసనే దెబుఁగని (అదే. 3-74):
విటకోటి నెనసేటి (అదే. 3-74):
అయితే (అహల్యాసంక్రందనము, 1-104; 2-8): కల్గితే (అదే. 3.84): ఆల్లి
తేనే సరా, పాడితేనే సరా, మీటితేనే సరా, ఆడితేనే సరా (అదే. 3-50)
తద్ధర్మార్థకసమాపక క్రియ: తెలుసు (రాఘవాభ్యుదయము, 5-22)
విరుసు, నంపు (షట్చక్రవర్తి చరిత్ర, 2-60)
వస్తాఁడా.... తెస్తాఁడా.... చూస్తాఁడా.... ఇస్తాఁడా (అప్పకవీయము, 1.125)
చచ్చేవే చంద్రరేఖ (చంద్రరేఖా విలాపము, 2-70): వస్తాఁడు ... తెస్తాఁడు,
ఇస్తాఁడు.... చస్తాడా (అదే. 2-83)
బాపని కేమయినాను తెల్సునా? (సత్యభామా సాంత్వనము, 3-90)
భవిష్యత్క్రియ: వినిపించేరు, ప్రశంసించీని (రఘునాథాభ్యుదయం, పే. 4
మొక్కేను (ఉషాపరిణయము, 5-12)
చూతాము (షట్చక్రవర్తి చరిత్ర, 5-107)
చెదేవు (చంద్రారేఖావిలాపము, 2.141)
ఉభయ ప్రార్థన: వెదకుదాము (ఉషాపరిణయము, 3.107)
వ్యతిరేక సమాపకం: నిలలేము (ఉత్తర రామాయణము, 4-78)
చేదర్థకం: కడకు మిమ్మంపితే కార్య మీడేర్చి (విజయరాఘవ రఘునాథ
కాభ్యుదయము, పే. 43)
గట్టిగ నీమగఁ డెబిఁగే టట్టయితే సిగ్గుపాటు (హంసవింశతి, 2-128)
కేకయితేను (అదే. 2-166)
ఐతేనేమి (పాంచాలీ పరిణయము, 5-37)
చూచితే.... నొక్కితే.... మీటితే .. కూడితే (రంగాజి ఉషాపరి. 3-15)
అనేకమైన అలాక్షణిక క్రియాదిరూపాలు మరికొన్ని:
ఇయ్యఁగవలసెన్ (షట్చక్రవర్తి చరిత్ర, 3-79)
నాకియ్యమనిన (హంస వింశతి, 5-73): గడియఁ దీయ్యని (*తీయి + అని
అదే. 3-93)

ఆనతి యియ్యఁగ (ఉత్తర రామాయణము, 2 189)

పొంచుపఱచుక మునిమాపు పూజసేయ (హంసవింశతి, 1.182)

ఊడుకపోవు శంఖము సహో (విజయవిలాసము, 1-134)

గములు గూడుక యూడిగములు గావించి (విష్ణుమాయా విలాసము, 2-42)

కోసుక తిందునో (శుక సప్తతి, 2.373)

చూరుఁబట్టుకు వేళ్ళాడినార మిట్టు (సింహాద్రి నారసింహ శతకము, 41)

బుద్ధితెచ్చుకు యవనుల పొంక మణఁచు (అదే. 45)

పొంగలో పొంగలి (విజయవిలాసము, 3.41)

పందొమ్మిదో ఛందమునను (అప్పకవీయము, 3.287)

ఎన్నఁగఁ బందో కాదో (మన్నారుదాస విలాసము, 3.77)

వినే ( = వినవే; రాధికా సాంత్వనము, 69)

విజయ రాఘవ మేదినీ విభుని చెయ్యే. మెఁదటంచుచు (మన్నారుదాసవిలాసము, 5-69)

ఎంతో కరముప్పతిల్ల (బిల్హణీయము, 2-77)

ఏ అహోబలపతినో చేమకూరనో పరిహరించి పై ప్రయోగాలన్నీ సామాన్య కవుల వని తోసివేయటానికి వీల్లేదు. భాషావికాసక్రమంలో అనునిత్యం శిష్టవ్యవహారంలో ఉన్న పదాలను ఎంతటి మడిగట్టుకున్న పండితకవైనా అనాలోచితంగా ఉపయోగించకపోడు. ప్రతిభావంతులూ పరమవ్యుత్పన్నులూ అయిన మహాకవులకు కూడా ఇది తప్పించుకోలేని పరిస్థితి. అందుకు నిదర్శనగా దిగ్గజాలవంటి కవుల ప్రయోగాలను కొన్నింటిని మాత్రం ప్రదర్శిస్తున్నాను:

తిక్కన: 'ఇమ్మెయిన్. జావడమైనఁజూచి (ఉద్యోగ పర్వము, 3.61)

పోతన: మళ్ళవారును నిల్చి త్రెళ్ళవారు (భాగవతము, 6.81)

నాటుక (అదే. 5.2.145)

శ్రీనాథుడు: వినీ వినని భంగి (శృంగార నైషధము, 6.33)

ఎంత జడుఁడైనఁ గానీ (అదే 6.23)

చేరి చుంబించి మోహింపఁ జేతు రవిన (అదే 5.68)

పెద్దన: ఏడు దేశముల న్వసించితిరి మీరేడే గిరుల్చూచినా

రేడే తీర్థములందుఁ గ్రుంకిడితిరి.... ఏతోయథేచ్ఛా దాసినా

రాయాచోటుల....(మనుచరిత్ర, 1.68)

చలపకారము (అదే 5.58); వేఁటకరుల్ (అదే. 4.50)

నాచన సోమన: అయినా (ఉత్తర హరివంశము, 5.198); ఏమీ యెఱుఁగఁడు (అదే. 5.195)

కృష్ణ దేవరాయలు: మోచుక (ఆముక్తమాల్యద, 6.84); ఎగాదిగ (అదే. 2.50)

తెనాలి రామకృష్ణుఁడు: పాతికయెత్తు కాంచనముగానీ. వెండిగానీ (పాండురంగ మాహాత్మ్యము, 2.87); నుయి దాఁటే వానికిన్(అదే.4.273) అల్పాదనము (అదే. 3.62)

రామరాజభూషణుడు: తపంబు సవరించన్ సాఁగె (వసుచరిత్ర, 3,165); మోముఁదమ్మి దీపించమి (అదే. 4.82)

ధూర్జటి: రొక్కారొక్కముల్దిట్టి (శ్రీకాళహస్తిమాహాత్మ్యము, 3.58); భీతిత్యాగం బొనరించినా నను(డు (అదే. 3.218); పంచుక (అదే.1.75) వినునా వాకిలి గావుమంటినా .... ఎంగిలిచ్చి తిను తిండిగాని కాదంటినో (శ్రీకాళహస్తీశ్వర శతకము); నే నొల్లనంటే లాలింపరె తల్లిదండ్రులు (అదే. 52) ప్రతికర్మం బించుకే చేయఁగాఁ బోతే దోషముగాన (అదే. 69); రోసిం దేఁటిది రోఁత లేఁటివి.... పూసిందేఁటిది... మూసిందేఁటిది.... చేసిందేఁటిది (అదే. 71)

సూరన: అందఱకుం దలా యొకటి (ప్రభావతీ ప్రద్యుమ్నము. 5.88) భావజుఁడు వెళ్ళిపోయిన పాదుషేద (కళాపూర్ణోదయము. 3.83) త్రివ్వటంబున తఱిఁ ద్రవ్వటంబులు పెట్టి (అదే. 4.78)

అనంతుడు: దయ్యము యేమి సేతునని (భోజరాజీయము, 3.218)

పై విధంగానే కొందరు లాక్షణికులూ వారు ప్రామాణికులని భావించి ఉదాహరించిన కవులూ ప్రయోగించిన అపప్రయోగాలు లేకపోలేదు. ఉదా.

రోళ్ళురోకండ్లఁ బాద రోయక (వరాహ. 7.22)

చాలా నేఁగలుగంగ (అనిరుద్ధ 2.88).

నేనిప్రబోవు దాఁకా నిద్రఁబోవదు (వైజయంతీ. 2.125)

నల్లంచు కల్లెముల్ పళ్ళనంగ (కృష్ణ, విజ. 1.53).

ఎగాదిగ (సువం. 4.177; సమీ. విజ. 2.154)

తంత్రి వ్రాయదముఁ జూచి (జైమి. భార. 8 82)

సతకరముల్ పురాణములు (హంస. 2.43)

సాహసకృత్యంబు చేసినావు గాన (నిరంకు. 4.44)

చనపుల్ నెరపేవు (రంగరా. 2 169)

వర్ణించే వేళ (పార్వ. పరి. 1_1)

పెట్టుక (అప్ప. 5.91); ఎక్కుక (అదే. 4.316)

అక్షరాస్యుల, భక్తుల నిత్యపారాయణంలో ఉండే కొన్నిపద్యాల్లో ఇలాటి వ్యావహారిక రూపాలు కనిపిస్తున్నాయి. ఉదా.

గౌతమీ స్నానానఁ గదతేటుగా మంచె (నృసింహ శతకము. 8)

కరినేలింది హంశక్కి.....ఇచ్చింది...చేపట్టింది (దేవకీనందన శతకము. 100)

పుపుపుఁ దెన్నిగతుల పుట్టింది మొదలుగ (వేమన. 1.118)

చేరేదే దయచేతను (రామ స్తవరాజము. 18)

కొలిచేదిం బగలేక నే నడిగితే కోపించుదే లేక (దేవకీ. శత. 42)

ఆనపెట్టిన రాకపోతివి ఆమెపో అటుమొన్నసూ.....నిన్నరాతిరి చవికలోపల నీవు చెరి కూకుంటిరా.....(కందుకూరి జనార్దనాష్టకము)

వేణుగోపాల శతకము, చంద్ర శేఖర శతకము, భాషియదండకము. దాసు శ్రీరాములుగారి 'తెలుఁగునాఁడు' వంటి అనేక రచనల్లో అవ్యాకృతవ్యావహారిక రూపాలు అనేకం కనిపిస్తున్నాయి. ప్రయోగబహుళ్యంవల్ల వాదబలం పెరిగినా ప్రయోజనాంతరం లేనందువల్ల ఉదాహరించటం లేదు.

§ 3 31 పద్య కావ్యాల్లో వ్యావహారిక రూపాల సంఖ్య తక్కువగా ఉన్నా గేయ పదకవితల్లో అవి ఎక్కువగా ఉంటున్నాయి. అందుకు కారణం పదకవితా లాక్షణి కులు కూడా అనుమతించటమే కావచ్చు. సుమారు క్రీ. శ. 1300 నాటి పదకవితా పితామహుడు తాళ్ళపాక కృష్ణమాచార్యుడు 'సంకీర్తన లక్షణ'మనే తన గ్రంథంలో వ్యవహృత రూపాల చెల్లుబడిని అంగీకరించారు (నిడుదవోలు వెంకటరావుగారు, ఆంధ్ర వచన వాఙ్మయము, పే. 28). అందుకు ప్రమాణంగా వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వారి ఈ పద్యాలను ఉదాహరించారు (తెలుఁగు మెఱుఁగులు: తెలుఁగు తేటఁదనము, పే. 44).

"పల్లవనారీ మ్లేచ్ఛా, ద్యుల్లాసమనోజ్ఞబంధురోక్తులు చవులై
చెల్లును గ్రామ్యము లైనను, హల్లీసక ముఖ్యనాటకాదిక ఫణితిన్.
"జగతిఁగల చెల్లబల్లె, నగి నగి భాషించునట్టి నానుడి పలుకుల్
తగ దన రహిచెడుఁ బువ్వుల,సొగసుడుగన్ విసికి కంపుఁ జూపిన భంగిన్."

ఫలితంగా తాళ్ళపాక అన్నమాచార్యుల (1408–1503) కాలానికి వ్యాప్తిలోకి వచ్చిన కీర్తన సాహిత్యంలో వ్యావహారికం క్రమంగా వేళ్ళుతన్నటం ఆరంభించింది. అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్య, మన్నారుగుడి సభాపతయ్యల కీర్తనల్లోనూ క్రీ.శ. పదహారో శతాబ్దంలో ఆరంభమైన యక్షగాన సాహిత్యంలోనూ, (ముఖ్యంగా కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయంతో మొదలై) వ్యావహారిక రూపాలు అసంఖ్యాకంగా ప్రవేశించాయి. ఆ తరువాత మృత్యుంజయ విలాసము, రామదాసు కీర్తనలు, తూము నరసింహదాసు కీర్తనలు, నిట్టల ప్రకాశదాసు కీర్తనలూ ఆ దారినే తొక్కాయి (చూ. గిడుగు వేంకట రామమూర్తి, వ్యాసావళి, పే. 16). ఇక ఆధునిక కాలంలో బయలుదేరిన, బయలు దేరుతున్న, గేయ సాహిత్యాన్ని ఉదాహరించటం అసాధ్యమే. కాలక్రమాన 16-20 శతాబ్దాల మధ్య గేయవాఙ్మయం వ్యావహారికంలో ఉండటమన్న సంప్రదాయం ఒకటి ఏర్పడిందని చెప్పవచ్చు. మచ్చుకు ఒకటి రెండు ప్రయోగాలు మాత్రమే ప్రదర్శిస్తే సరిపోతుందనుకుంటాను.

అన్నమయ్య: దేవాలయాలు నానా దేశములెల్లా చొచ్చి .. కావు లేలే రాజులు దయకొంత పట్టదాయ (ఆధ్యాత్మ సంకీర్తనలు, 373, వేటూరి ప్రభాకరశాస్త్రి గారు: మేఁగడ తఱకలు—దక్షిణ దేశమందలి వాఙ్మయము, పే. 166)

మెత్తనైతే దిగబడి మేసిమేసి యింతలోనె, పొత్తుక వచ్చేవు చక్కనుండ నేరవా (శృంగార సంకీర్తనలు, పే.3); నెయ్యములల్లో నేరెళ్లో, వొయ్యన వూరెడి వువ్విళ్లో (అదే. పే. 166)

త్యాగరాజు : కోటినదులు ధనుష్కోటిలో నుండఁగా, ఏటికి తిరిగేవే ఓ మనసా (వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మేఁగడ తఱకలు, త్యాగరాజు, పే. 209); మనసు నిల్ప శక్తి లేకపోతే (అదే పే. 212).

క్షేత్రయ్య : అందుకైతే జాణవు-అల్లందుకైతే జాణవు (క్షేత్రయ్య పదములు, పే. 1); వచ్చినప్పుడు నేనే వద్దికి బోయేదేనాసి, ఇచ్చటికి రామ్మనేవెన్నను లేమగా (అదే. పే. 38)

§ 3.32 ఇక వచన సాహిత్య పరిణామంలో వ్యావహారిక భాషా వికాసాన్ని పరిశీలించవలసి ఉంది. ఏకామ్రనాథుని 'ప్రతాపచరిత్ర' (లేదా 'ఏకశిలానగర వృత్తాంతము') ఇప్పటికి దొరుకుతున్న వచనగ్రంథాల్లో మొట్టమొదటిదని, క్రీ. శ. పదమూడో శతాబ్దానిదనీ ఒక ప్రవాదం ఉన్నా మెకంజీకాలంలో పండితులు దీన్ని తిరగరాశారన్న వదంతికూడా లేకపోలేదు. నిడదవోలు వెంకటరావుగారి దృష్టిలో మొదటివాదమే యథార్థం (చూ. ఆంధ్రవచనవాఙ్మయము, పే. 31). మనకున్న మొదటి మహాగ్రంథం నన్నయ భారతానువాదం. ఆయన పెట్టిన ఒరవడిలో తరవాతి వారందరూ కాకపోయినా ఏకొద్దిమందో తప్ప మిగిలినవారంతా చంపూరచనలే చేశారు. వచనానికి ప్రాధాన్యం చాలా తక్కువ. ప్రబంధ యుగావతరణకాలంలో, మహాకవుల రూపకాలనుగూడా పద్యానువాదాలుగా సిద్ధపరుస్తుండే కాలంలో, కేవలవచనరచనలకు మర్యాద ఉండేదని నమ్మటంకూడా కష్టమే. ఇక్కడ 'గద్య, వచన' శబ్దాలను వేరువేరుగా భిన్నార్థద్యోతకాలుగా ఉపయోగిస్తున్నాను. అల్పసంఖ్యాకమైన గద్యరచనల విషయంకాక, సులభ పద్ధతిలో రాసిన కేవల వచనగ్రంథాల విషయమే ఇక్కడ చర్చకు వచ్చింది. క్రీ. శ. పదహారో శతాబ్దంనుంచీ కొద్దికొద్దిగా కేవల వచనగ్రంథాలు బయలుదేరాయని చెప్పవచ్చు. అప్పటికి సాహిత్యప్రక్రియలు బహుముఖాలుగా బయలుదేరాయి. చారిత్రక రచనలు, వచనకావ్యాలు, వ్యాఖ్యాగ్రంథాలు, టీకాటిప్పణులు, కథలు, క్షేత్రమాహాత్మ్యాలు, శాస్త్రగ్రంథాలు మొదలైన అనేకరూపాల్లో ఉన్న వచన సారస్వతం పందొమ్మిదో శతాబ్దానికి ఇతోధికాభివృద్ధికి వచ్చింది. అప్పటినుంచీ క్రైస్తవ మతప్రచారకుల, ఆంగ్ల సారస్వతవేత్తల ప్రభావాలవల్ల మరికొన్ని నూతన ప్రక్రియలు ఉద్భవిస్తూ వచ్చాయి. రకానికి ఒకటి రెండు వాక్యాల చొప్పున ప్రఖ్యాత గ్రంథాలనుంచి మాత్రం ఉదాహరణ లిస్తాను.

విశ్వనాథరాయని స్థానాపతి రాయవాచకం (సుమారు 1520) :

"ఆ పిమ్మట విఠల విరూపాక్షస్వామి ధ్వజారోహణమై వున్నది. రథోత్సవానకు విజయం చేయవలెను అని విన్నపం చేయంగా దళనాయకులు ఆ తీరున్నే రాయలవారు విచ్చేస్తా వున్నారు. స్వామి రథారూఢులైన తోడుతోనె వచ్చి విన్నపం చేయమని అంపించి రాయల నగరి తొమ్మిది సంప్రతులనున్ను పిలువనంపగా కరణాలు వచ్చి పదునెనిమిది రేవుల లెఖ్ఖలున్ను వినుపించిన తర్వాత ...." (పే. 4–5)

పుష్పగిరి తిమ్మన భాగవత సారము, వచన కావ్యం (1700) :

"సూతుండు శౌనకాది మహామునుల జూచి వింటిరా మునులారా ఇటువలె నుత్తరపుత్రుండు దడిగితే ప్రత్యుత్తరంబు శుకయోగి మహానుభావుడు పలికెను...."

-(నిడుదవోలు వెంకటరావుగారు. ఆంధ్ర వచన వాఙ్మయము, పే. 48-49)

కాశీ మహిమార్థ దర్పణము :

"ఒకానొక కాశీపట్టణము భూమియందున్నదై నాగానీ,అక్కడ వాసం చేసుకొని ఉండేవారికి పునరావృత్తులు లేవు గనుక తాను భూమిగదా, అయినాగానీ స్వర్గమందుండే వారికి పునరావృత్తి గలదు; తనయందుండే వారికి పునరావృత్తిలేదు...."

—(ఆంధ్ర వచన వాఙ్మయము, పే. 65)

కాంచీపుర మాహాత్మ్యము (1802). కావలి వేంకటబోరయ్యగారిది :

"స్వామి ప్రసన్నుడై కాంచీవనమధ్యమందు జటీభూతమై దేవతలు చూత వృక్షాకృతిగా వున్నందున నేను జ్యోతిరూపమై ఆ వృక్షం క్రింద వుంటున్నాను గనుక అక్కడికి నీవు ప్రవేశించి కారుణ్యావృత్తిని దర్శించి తపస్సు చేసినంతల్లో యిష్టార్థసిద్ధి గల్గుతుంది అని అనుజ్ఞలిచ్చెనూ...."

—(గద్య చింతామణి. 121)

క్రైస్తవ పురాణ కథా సంక్షేపము (1720) :

"పరలోక భూలోకం స్రిష్టికర్తలైనవారు నిర్మించిన విధం యిజూరేల్ అనే టషువంటి వారుల వేదమందు రాశివున్నది సంక్షేపమూ మొదటి భాండం స్రిష్టింపు"

—(ఆంధ్ర వచన వాఙ్మయము. పే. 69)

తెలింగ (1818) :

"యిశుక్రీస్తుని యొక్క పుట్టడము యీలాగు నాయెను.... మరియేమంటె వాడు ఈ ప్రకారంగా చింతచేస్తూ ఉండగా చూడు ఈశ్వరుని మాత స్వప్నమందు వానికొఉడు దర్శనమును ఇచ్చెను"—(ఆంధ్ర వచన వాఙ్మయము, పే. 72)

రావిపాటి గురుమూర్తిశాస్త్రి ద్వాత్రింశత్సాలభంజికల కథలు (1819) :

"విక్రమార్కుడు భూ సంచారము చేసే కాలములో వకనాడు అతని వద్దికి నలు గురు శిష్యులు వచ్చిరి.... అయ్యా మీరు యేయే దేశములు చూచినారు....యిప్పుడు యెక్కడి నుంచి వస్తున్నారు. యిక్కడినుంచి యెక్కడికి పోతున్నారు...."

—(గద్య చింతామణి, పే. 78)

తాతాచార్యులవారి తాతాచార్యుల కథలు (1855):

"యీ పంతులు నవ్వి యీ పూర్వార్థమును దిద్దినందుకు వొకఫలమున్ను లేదు; ఉత్తరార్థము దిద్దకపోయినందుకు వొక నష్టిన్ని లేదు. అయితే తమ పాండిత్యము యింతవల్ల అందరికి బాగా ప్రకాశించినది...."

—(గద్య చింతామణి, పే. 85)

పాటూరి రామస్వామిశాస్త్రి శుకసప్తతి కథలు (1840; అచ్చు: 1910?):

"యీ ప్రకార మాగ్గునిని పారవేసి ఏదోవాణ్ణి యెత్తుకొని పీడు యెక్కడవేసినా లేచి నా కంటెముందుగా వచ్చి చేరుతున్నాడు. యీ లేవ పూరివెలువల వుండే గుంటలో వేతామని గభక్కున వేశి పీడు యెట్టు లేచివస్తాడో చూతామని నలు దిక్కులూ కనిపెట్టి యుండెను"

—(గద్యచింతామణి, పే. 87)

రావిపాటి గురుమూర్తిశాస్త్రి పంచతంత్రి కథ (1834):

"విద్వాంసుండును ధార్మికుండును కానికొడుకు పుట్టితే ఫలమేమి?.... రూప మున్ను ధనమున్ను బలమున్ను కలిగినా శాస్త్రజ్ఞానము లేని కొడుకు యెందుకు?"

—(గద్య చింతామణి, పే. 92)

తంజాపూరి యాంధ్ర రాజుల చరిత్ర (1914 లో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అచ్చు వేయించినది):

"కాని యిక్కడ వొక చిక్కు తగులుకొన్నది. కృష్ణరాయల వంశం క్షత్రియ వంశం, అని వెనకటి శాసనాలలోను ప్రబంధాలలోను వర్ణన వుంటుంది. చంద్రవంశపు క్షత్రియులట. చెవ్వప్పనాయనివారి వంశం శూద్రవంశం, అని కూడా అప్పటి శాసనాలే ప్రదింవాలే చెప్పుతూ వున్నది."

—(గద్య చింతామణి. పే. 97)

కర్ణాటక రాజవృత్తాంతము (ఉత్తరభాగము):

"వారితో సమముగా కూర్చునేటట్టు నిర్ణయించి. మా ఫౌజుకు ప్రథమ జండా వడపేటట్టు నిర్ణయించి అంపించిన వెనుక। ఈ రెండు సర్కార్లు చేసుకొని మందీలు హోజీలశకన్నా మేలుగా—"

—(గద్య చింతామణి, పే. 107)

ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్రా చరిత్ర (1838 అచ్చు: రచన 1830):

"౯ తేదీ ఉదయాన ౫ ఘంటలకు లేచి యిక్కడికి నాల్గు కోసుల దూరములో నుండే తిలవారా అనే ఊరు దారిలో నర్మదా మహానది దాటి ౯ ఘంటలకు ప్రవేశించినాను. ఇక్కడ ౩ వందలమంది యెక్కే పడవ ఒకటిన్ని ౫౦ మంది యెక్కే చిన్న పడవ ఒకటిన్ని ఉన్నది."

పురుషార్థ ప్రదాయిని, వార్తాపత్రిక (1872), బందరు:

"ఈ అగ్ని ఉపాసన అనేది ఈ జగత్తులో సర్వభక్షకుడు కాబట్టి ఈయనను సమిష్టి స్వరూపుడయిన ఈశ్వరునకు ముఖముగా యెంచి ప్రార్థించడముకు కారణమయినది."

—(గద్య చింతామణి, పుట169)

స్వామినేని ముద్దు నరసింహం నాయుడుగారి హితసూచని, పీఠిక (1862):

(భాషా విషయకంగా సిద్ధాంత పరమైన చర్చచేసిన వారిలో ఈయన ప్రథముడు కాబట్టి సుదీర్ఘమయినా ఆయన మాటలను ( గ. చిం., పే. 184 – 85 ) ఎత్తిరాస్తున్నాను. పందొమ్మిదో శతాబ్దిలో మన పండితుల భాషా దృక్పథానికి ఇది మచ్చు).

"పద వ్యాపారమునకు ఏర్పరచబడే హద్దులు భాషను రచించడమునకున్ను లిఖించడమునకున్ను సాధ్యమయినంత సులభముగా నుండవలసినది అవశ్యమైయున్నది. ఆంధ్రభాషయందు కొన్ని పదములలో నొకానొక యక్షరమునకు అర్ధానుస్వారము చేరియుండడము జరూరైనట్టు లక్షణ గ్రంథములయందు చెప్పబడియున్నది; కాని అటువంటి చాలా పదములు ఇప్పట్లో అర్ధానుస్వారము లేకుండానే సాధారణమైన భాషయందు వాడిక చెయ్యబడుచున్నవి. పద వ్యాపారమునందు హద్దులు ఏర్పరచడమునకు దేశముయొక్క వాడికయున్ను రీతియున్ను ఆధారములై యుండవలసినవి గనుకనున్ను 'వాఁడు' 'వీఁడు' అనే పదములు ఉచ్చారణయందున్ను వాక్యగ్రంథముల లిపియందున్ను 'వాడు' 'వీడు' అని వాడిక చెయ్యబడుచున్నవి. శకటరేఫమనే యక్షరము కొన్ని పదములలో చేరియుండవలసినట్టు కూడా లక్షణ గ్రంథములలో చెప్పబడియున్నది; కాని అటువంటి పదములలో రేఫను చేర్చినా శకటరేఫను చేర్చినా అర్థము ఒకటే ఐయుంటున్నది కనుకనున్ను–రేఫ శకటరేఫలకు ఉచ్చారణయందు భేదమేమీ కనపడడములేదు కనుకనున్ను—అటువంటి చాలా పదములు

వాక్య గ్రంథములయందు ఇప్పట్లో శకటరేఫ లేకుండానే రేఫనుచేర్చి వ్రాయబడుచున్నవి గనుకనున్ను—'అందఱు', 'కొందఱు', 'బొఱ్ఱ', 'గుఱ్ఱము' అనే పదములు ఈ ప్రకారము శకటరేఫతో వ్రాయడము కంటె 'అందరు', 'కొందరు', 'బొర్ర,' 'గుర్రము' అని వ్రాయడము లిపికి సులభముగా నున్నది గనుకనున్ను—ఏకరీతిగా పలుకవలసిన పలుకులలో నొక దానికి ఒక యక్షరమున్ను మరియొకదానికి ఇంకొక యక్షరమున్ను వ్రాయవలసియుండడము అధికమైన చిక్కు కలుగడమునకు కారణమౌచున్నది గనుకనున్ను—రేఫ శకటరేఫలలో రేఫయనే వర్ణమే రవర్ణోచ్చారణగల అన్ని పలుకులకున్ను చిహ్నమైయుండ తగియున్నది గనుకనున్ను - ఈ పుస్తకములో అటువంటి పలుకులన్నీ రేఫతోనే వ్రాయబడుచున్నవి. వాక్య గ్రంథములయందు కొందరు సంధి యశ్రుతి మొదలైన వాటి నియమములను అనుసరించి వ్రాయుచున్నారు; కాని, ఆంధ్రదేశమందు ఆంధ్రభాషను బహుశః సంధి మొదలైన వాటి నియమములేకుండగానే భాషించడమున్ను, వాక్యగ్రంథములయందు వ్రాయడమున్ను వాడికమై యున్నది.౧ యీ పద్ధతి సులభముగానున్ను రమ్యముగానున్ను భాషను రచించడమునకు సదుపాయమై యున్నట్టు నాకు తోచుచున్నది. గ్రామ్యోక్తి ఆంధ్ర భాష తాలూక్ అంశములలో నొకటిగా లక్షణగ్రంథములయందు చెప్పబడియున్నది. ఈ పదములు ఛందోబద్ధమైన గ్రంథములయందు చేర్చడము అరుదై యున్నదిగాని, వాక్యగ్రంథములయందున్ను వీటివాడిక తరుచై యున్నది. యిందువల్ల భాషా రచన మిక్కిలి ధారాళముగా నుండుచున్నది; గనుక సాధారణమైన భాషయందు వాడికలో నున్న గ్రామ్యపదములు చాలా మట్టుకు సరసమైన వాక్యరచనలో నంగీకరించ తగినవిగా నేను ఎంచుకుంటున్నాను."

(౧ ఇక్కడ చిన్నయసూరి వేదం వేంకటరాయశాస్త్రిగారల భాషను గిడుగు వేంకటరామమూర్తిగారు 'అరవ తెలుగ' ని అధిక్షేపించడాన్ని అనుసంధించుకోవచ్చు. పై వాక్యంలోని 'ఆంధ్రదేశ' శబ్దాన్నిబట్టి ఈ భావం బలపడుతున్నది. చూ. ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము : అరవ తెలుగు, పే 161 — 163; "వాస్తవముగా శాస్త్రిలవారివంటి అరవ తెలుగు పండితులవల్లనే మన తెలుగు భాషకు ఇప్పటి దురవస్థ సంభవించినది. చెన్నపట్టణములో తెలుగు గ్రంథములు అచ్చుపడడము, అక్కడున్న అరవ తెలుగు పండితులు గ్రంథములు పరిష్కరించడము, ఆంధ్ర గ్రంథాలు పాడుకావడమునకు ముఖ్యకారణము. ఎందునా పొందని నేటి అధ్వాన్నపు తెలుగు పరవస్తు చిన్నయసూరిగారి మూలముగా వ్యాపించినది. ఆయన కాలములో

వచనాలు వాడుకభాషలోనే అందరూ వ్రాసేవారు. ఆయన మాత్రము వింత తెలుగు వ్రాసేవారు....", పే. 161).

ఎలకూచి బాలసరస్వతి ఆంధ్రశబ్ద చింతామణి టీక:

"సంతసింపుచున్నాడు మొదలయినవి సంస్కృతభవశబ్దములమీద పుట్టినవి అని తెలుసుకునేది a....ఇంచుగాగమము చుపణాకము అనుబంధము దుజ్జు మొదలగునవి అన్నీవస్తే 1 ఉపసర్గ పూర్వక మయితే ...."

—(గద్య చింతామణి, a.... పే. 187, b.... పే.189)

తాళ్ళపాక తిరువేంగళనాథుడి అమరవ్యాఖ్య:

"ప్రారబ్ధమైన గ్రంథానకు విఘ్నము రాకుండా ముగిశేకొరకు గ్రంథకర్త యిష్ట దేవతా నమస్కారము స్తుతి రూపాన జేస్తున్నాడు...."

—(గద్య చింతామణి, పే. 196).

భారతం లక్ష్మీపతి పండితుడి కూలంకష వ్యాఖ్య (ఉద్యోగ పర్వానికి):

"నెయ్యము కాకుండా మఱిపక వాక్యము వింటివా (౧) అనికి నెమ్మెయి వల్కెదు యుద్ధానకు యేల జడియుచున్నావు (౨) మాకు యుద్ధము లేకుండా బ్రతుకుట కార్యముగాదా (౩) పోరులేని కార్యము వెఱ్ఱివాండైనా ఒల్లడా...."

—(గద్య చింతామణి, పే. 205)

సంస్కృత శబ్దార్థ కల్పతరువు (1872):

"అర్ధోరుకం- వేశ్యలు సగము తొడలదాక తొడుగుకొనే చల్లాడము
అభీక్ష్ణం-మరిన్ని, మాటిమాటికిన్ని"

—గద్య చింతామణి, పే. 204)

జూలూరి అప్పయ్య పంతులు మనుచరిత్ర వ్యాఖ్య (1851):

"....ఉప్పతిలన్ = పుట్టుతూనుండగా......జనించు = పుట్టుతున్నటువంటి.... గుహావళినొప్ప = కొంత గవులచేత ప్రకాశిస్తూ...."

—(గద్యచింతామణి, పే. 213)

చిత్రకవి అనంతుని హరిశ్చంద్ర నళోపాఖ్యాన ప్రకాశిక:

"అశేషాధ్వగు లనేటి అధ్వగులను శ్రోపర్లను మనఃప్రసూనుండై విద్వత్కుమారుండై శుకలీల యనేటి శుకునియొక్క లీల చాతను...."

—(గద్యచింతామణి, పే. 221)

పాకనాటి అప్పకవి అప్పకవీయము (గిడుగు వేంకటరామమూర్తిగారి పీఠికతో వావిళ్ళ వారి ప్రచురణ, 1924):

"మొదలి ప్రకృతియందు లోప మయ్యేటి దకారము....అది తత్సమము చేసేను సంద్రమైనది....రెండవ ప్రకృతినె అయితే...."

—(గద్యచింతామణి. పే. 232)

కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ఛందము (వావిళ్ళ ప్రతి, 1922):

"అని పదియతులున్ను....మరిన్ని....చెప్ప వున్నవి.... చెవి కింపుగానుండే అక్షరము ప్రాసస్థానమందుంచితే అది సుకరప్రాసము."

—(గద్యచింతామణి, పే. 233)

పుదూరి సీతారామశాస్త్రి ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము (1834) :

వాంటి మొదనున్న హల్లులకు.... వాంటిలో ద్విత్వముగల వాంటికిన్ని ద్విత్వములేని వాంటికిన్ని యేమి విశేషకార్యంబు .... వాంటికి నుదహరణంబు లేలాగు ...."

—(గద్యచింతామణి, పే. 234)

రావిపాటి గురుమూర్తిశాస్త్రి గురుమూర్తి వ్యాకరణము (1836) :

" ...తటము అని కొత్తగా పేరుపెట్టంబడ్డ తృతీయాది విభక్తులకు పూర్వము నందలి రూపమున్ను ...కూడా - గురించి - కై - కోసము - కోసరము - పట్టి - పట్టంచి - చేసి - నుండి - నుంచి - యొక్క - యొక - నిమిత్తము - విషయము - ఈ విభక్తులున్ను"

(—గద్యచింతామణి, పే. 237)

ఉదయగిరి శేషయ్య వ్యాకరణము (1857):

"సంధి అనగా పూర్వశబ్దముయొక్క చివరను ఉండే అచ్చు లోపించి ఆ స్థానమందు పరశబ్దముయొక్క మొదట వుండే అచ్చు రావడము...."

—(గద్య చింతామణి, పే. 239)

Railways and the Steam Engines (1856):

"ఇ పటము చూస్తే-పొగయంత్రముచేత అనేకమైన బండ్లుకమ్మి తోవ మీద లాగబడుతూ వున్నవి."

—(గద్యచింతామణి, పే. 248)

పరవస్తు శ్రీనివాసాచార్యులంగారి సర్వశబ్ద సంబోధిని (1875):

"వాండ్లు, మూడేండ్లదాకా, పల్ల, కొడ్డి, పద్ద, వాటి, చేసేటందుకు, దగ్గ తగలకుండా, యిదిన్ని...."

— (గద్యచింతామణి, పే. 348)

వైయాకరణము రామానుజాచార్యులవారి ఆదిపర్వ వచనము (1817):

(దీన్ని వరవస్తు చిన్నయసూరిగారు సరిచూశారు–చూ. నిడుదవోలు వేంక రావుగారు, ఆంధ్రవచన వాఙ్మయము, పే. 78. దీన్నే 'భారత వచన' మనే పేర వ్యాఖ్యానమని గిడుగు వేంకటరామమూర్తిగారు వ్యవహరించారు–చూ. వ్యాసావ పే. 23)

"ఆ యయాతి ఆ సత్పురుషుల సాంగత్యమువలన తానున్ను ఆ మనుమలున్ను పూర్వ లోకమునకు పోయిరి."

ఇలాటి ప్రయోగాలు వేలసంఖ్యలో దొరుకుతున్నాయి. వాటినన్నిటినీ ఉదా రించినా ప్రయోజనాధిక్యం లేదు కాబట్టి ఇవి చాలు.

## మాండలిక పదాలు

§ 3.4 ఇక మాండలిక పదాల సంగతి. కావ్యవ్యవహారంలో మాండ ఉండవని, మాండలికాలు కావ్యవ్యవహారంలో ఉండవని, ఉండరాదని, ఈ నా సంప్రదాయ పండితులు విశ్వసిస్తూనే ఉన్నారు. అయినా ఒకనాటి మాండలికాలే కాలంలోనో తరవాతి కాలంలోనో కావ్యభాషలో ప్రవేశిస్తాయనేది సత్యం. పూ ప్రకరణంలో కొన్ని మాండలిక రూపాలు నన్నయనాటి భాషలోగూడా ఉన్నవి యని శాసనాధారాలనుబట్టి నిరూపించాను. ఇప్పుడు మాండలికరూపాలు నన్న కవితలోనే గాక ఇతర కవుల రచనల్లో కూడా ప్రవేశించినట్లు మరికొన్ని ప్ర ణాలు చూపుతాను.[5] ఇంతకుముందు అన్యదేశ్యాలకు కొన్ని ఉదాహరణలిస్తూ మా ఉపయోగించిన వర్గమాండలికాలను నిర్దేశించాను. మాండలికాలను గురించిన ఒకటి రెండు కొండగుర్తు లిక్కడ సూచించి వాటి స్వభావాది చర్చలను ప్ర ణాంతరంలో ప్రస్తావిస్తాను. భాషలోని రూపాంతర, పర్యాయపదాలకు మాండలి ఉచ్చారణ, వ్యవహార (లేదా పర్యాయోపయోగ) భేదాలే మూలకారణం. అ వల్ల భాష విస్తరిస్తుందేగాని అప్రతిష్ఠపాలు గాదు. మాండలిక సాహిత్య భాష రెంటికీ వ్యవహర్త ఒక్కడే. అంటే పైసందిన వ్యవహారంలో తన మాండలిక (అది ప్రాంతీయమైనా వర్గమాండలికమైన పలితమొక్కటే) ప్రసంగించే సాహితీసృష్టి సమయంలో భిన్నమాండలికమైన కావ్యభాషాభేదాన్ని ఉపయోగిస్తే అత్యంత పరిచయంవల్లగాని, అర్థస్ఫురణ తనకుసంతృప్తికరంగా ఉండే

ప్రయత్నించటంవల్లగాని. కావ్యభాషాపదంకన్నా తన వ్యవహారంలో ఉన్న పదం (మాండలికపదం) శక్తిమంతమని భావించటంవల్లగాని. పర్యాయోపయోగంలో ఉన్న పదమే కాబట్టి ప్రయోగించి దానికి ప్రాముఖ్యం సంపాదిద్దామన్న 'స్వస్థాన భాషాభిమానం' వల్లగాని, ఇతర కారణాలవల్లగాని తన మండలంలోనో తన వర్గంలోనో వాడుకలో ఉన్నమాటకు కావ్యభాషలో స్థాన మివ్వవచ్చు. తమ ప్రాంతీయమాండలికంలోనే రాసిన మహాకవులు దాంతేనుంచి టాగూర్ వరకు అనేకులున్నారు, ప్రపంచ సాహిత్యంలో. విస్తృత పరిశీలనగాని పరిశోధనగాని జరగని కారణంవల్ల తెలుగు విషయంలో-భాషాసాహిత్యాల విషయంలో-ఇప్పటికీ తెలియనివి అనేకం రహస్యాలుగానే మిగిలిపోయాయి. కేవలం భాషైకదృష్టితో (భాషాధ్యయన దృష్టితో) చూసినప్పుడు మహాకవి వాక్యాలకిచ్చినంత గౌరవాన్నైనా మాండలికాలకు ఇవ్వటం సబబు; భాషాసమష్టిలో కావ్య వ్యవహారానికి ఉన్నంత స్థానం పైనందిన వ్యవహారంలో ఉన్న మాండలికాలకు కూడా ఉన్నది కాబట్టి.

"Dialects which have never produced any literature at all, the jargons of the savage tribes, the chicks of Hottentots, and the vocal modulations of the Indo- Chinese are as important, nay, for the solution of some of our problems, more important than the poetry of Homer and the prose of Cicero"—Max Muller, Science of Language Vol. I. Lecture I.

మన నిఘంటువుల్లో కనిపించే అనేక పర్యాయ పదాలు భిన్నకాలాల్లో భిన్న మాండలికాలు భాషా సమష్టికి అందిచ్చిన శబ్దరూపక - అలంకారాలు (చూ. గిడుగు వేంకట రామమూర్తిగారు, బాలకవి శరణ్యము (ప్రయోగదీపిక), పే. 201,227). కావ్యభాషలో స్పష్టార్థ ప్రతిపత్తితోగాని, ప్రాంతీయ పరిమితి విశేషంతోగాని కనిపించని అనేక పదాలకు మాండలికాలే నిరూపకాలు (చూ. భద్రిరాజు కృష్ణమూర్తి గారు, మాండలికవృత్తి పదకోశం, భా. 1, వ్యవసాయ పదాలు, పే. 30-32). కావ్యభాషలో కనిపించని ప్రాచీన తమ రూపాలను సంతరించటమేగాక మాండలికాలు కొన్ని సమయాల్లో కావ్యాధ్యయనానికి భిన్నమార్గాలను కూడా చూపుతాయి (చూ. బూదరాజు రాధాకృష్ణ, మాండలిక వృత్తి పదకోశం. భా. 4. వాస్తు పదజాలం, పే. 13-14). ఈమాండలికాలు కావ్యభాషలో స్థానం సంపాదించాయనటానికి కొన్ని ఉదాహరణలు మాత్రం ఇస్తున్నాను.

§ 3.41 నన్నయభాషను శ్రద్ధగా పరిశీలిస్తే 'దారుణం' అనేమాట బహు ప్రచురంగా కనిపిస్తుంది. ఈనాటికీ ఈమాట గోదావరి మండలంలో పర్యాప్తంగా విని

పిస్తుంది. 'తదర్థం' అనే వర్గమాండలిక పదం 'సితవర్థం' అనే 'తప్పు' సమాస రూపంతో నన్నయ భాషలో కనిపిస్తుంది. ఉదా.

నీ తదర్థంబులై నిఖిల వేదంబులు వర్తిల్లు (2-1-258)
నా తదర్థ మాచరింపుము బ్రహ్మచర్య వ్రతంబు (3-1-275)

'ఈ రోజు మాయింట్లో తద్దినం' అని చెప్పే బ్రాహ్మణ భాషలాంటిది ఇది అంటే జ్ఞాపకానికి వస్తుంది. నన్నయ పదిపద్యాల్లో మూడుసార్లు భిన్నార్థద్యోతకంగా 'బ్రాహ్మణార్థ' శబ్దాన్ని ఉపయోగించాడు.[6] ఉదా.

పవనతనయు బ్రాహ్మణార్థంబుగాఁ దన సమర్పించుటయున్ (1-6-280)
ఇట్టి భీము బ్రాహ్మణార్థంబుగా నసురవాతఁ ద్రోతువే? (1-6-281)
బలముగ్గ్రి కవంగె నప్పుడు బ్రాహ్మణార్థము వేయఁగాన్ (1-6-2[illegible])

భీముడు చివరిసారి చేసింది మరొక సరైన బ్రాహ్మణార్థం – కంఠదఘ్న భోజనం ; సంస్కృత నిఘంటువుల్లో, కావ్య ప్రయోగాల్లో, కనిపించే అర్థాలకు భిన్నంగా ఆయా పదాలను ఉపయోగించటంకూడా మాండలిక ప్రయోగం వంటిదే. ఉదా.

పరోక్షంబున (భార. 1-4-218)
పుట్టమునకు (భార. 1-4-83)
అనుమానము (భార. 4-1-260, 2-102, 268)
అనుమానించు (భార. 4. 2-34)

'....చల్లా యంబలిఁ ద్రావితిన్' (వీధి నాటకము, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పీఠిక, పే. 57) అనేచోటి శ్రీనాథ ప్రయోగం మాండలికమే. కొన్ని ప్రాంతాల్లో 'చల్ల' వాడుక మాట; ఇతర ప్రాంతాల్లో 'మజ్జిగ' వాడుకలో ఉంది. మధ్య కాలపు కవుల్లో మాండలికాలను ఉపయోగించినవారు చాలామంది ఉన్నారు. ఉదా.

i) నామ వాచకాలు :
దినము ఫలహారమున (కంకంటి, ఉ. రా. 4-198)
గివె (శుకసప్తతి, 1-247)
పిడక కుంపటులు (ఉత్తర రామాయణము, 1-254)
ఎల్లుండి (శుకసప్తతి, 2-183)
అలివేణుల నోరికి తాపి చేసి (అదే. 4-54)
వెడపు మొగంబున (చంద్ర రేఖా విలాపము, 1-90)

ఊసు పోవక (అదే. 3-9)
కుతి దీర్చక దుమ్ము దులుపు కొంచుం జనియెన్ (అనర్ఘ రాఘవము, 2-28)
ఈ వేల్పు వెలంది మంది (= మనది) — (ఉత్తర రామాయణము, 4-60)
పోరి (= చిన్నపిల్ల: గంగాపుర మాహాత్మ్యము, 2.220)
అఘాత్యము (చంపూ రామాయణము, 2-85)

(ii) సర్వనామాలు :

ఏంది (రఘునాథనాయకుడి రామాయణము. 2-145)
ఏవది (అదే. 2-174)
ఈనచే (= ఈయనచే: రాఘవాభ్యుదయము. 5-94)
మునలాపె (శుకసప్తతి. 3-48)
మఱినెంచ సీడర మహిమ వెట్టిదియొ (విష్ణుమాయావిలాసము, 2-42)

(iii) అవ్యయాలు :

తరువాత సీతయుఁ దమ్ముఁడు (కట్టా వరదరాజు రామాయణము, 2-పే. 34)
తరవాయ వచ్చె (ఉషాపరిణయము, 2-87)
అషే, ఎపులో (అహల్యా సంక్రందనము. 1-95)
ప్రొద్దుగూఁకుదాఁక (షట్చక్రవర్తి చరిత్ర, 3-125)
అతల (= అవతల; అదే. 7-45)
ఒకపారి (ఉత్తరరామాయణము. 3-54)
ఈలాగు పల్కె (విజయరాఘవుడి రఘునాథాభ్యుదయము. పే. 43)
వేవ్వేగనసైన బుద్ధి దిగసన వచ్చు (సింహాద్రి నారసింహశతకము, 19)
ఆనిక (చంపూ రామాయణము, 3-86; సత్యభామా సాంత్వనము, 4-100)
కనిక (ఉషాపరిణయము, 2-21)
చాలా (సత్యభామా సాంత్వనము. 1-126)
అవునషే (శుకసప్తతి, 2-459)
కావషే (అదే. 2-477)

(iv) క్రియా పదాలు :

ఎంగిలయ్యావి (అహల్యా సంక్రందనము, 3-104)

తెల్పునా (సత్యభామా సాంత్వనము, 3-90)
పరికేని (రాధికా సాంత్వనము, 91)
వెదపడాము (ఉషాపరిణయము, 3-107)
చూతాముగా (షట్చక్రవర్తి చరిత్ర, 5-107)
అడుక్కొని (హంస వింశతి, 3-142)
మిసమిస మెఱుచు (రఘునాథ రామాయణము, 11-02)
మొక్కేను (భవిష్యదర్ధకం; మన్నారు దాసవిలాసము, 4-12)
పెట్టేము, ఇచ్చేము (షట్చక్రవర్తి చరిత్ర, 2-98)
నూసేవు (అదే. 2-59)

పైవి గాక ప్రశస్తకవు లుపయోగించిన మాండలిక పదాలు కొన్ని ఉదాహరిస్తాను (వివరాలకు: గిడుగువారి బాలకవి శరణ్యము, పే. 271-74)
ఊసువోక (నిర్వచనోత్తర రామాయణము, 9-26)
దొంకఁ గొంను (అదే. 3-72)
సఖ్ఖ (= సఖలు; అదే. 9-46)
బెజ్జము (కాశీఖండము. 5-105)
కమ్మని కంపు (అదే 2-44); పొగప్పఁ గంప్రులు (అదే. 6-185)
పొగడ పూవంటి కంప్రుల మదాంబువులు (మనుచరిత్ర, 5-98)
చాఁయు చేసె నల్లవారు గాఁచి (హంసవిలాసము. 2-121)
కూఁకలువేయు (శకుంతలా పరిణయము, 3-52)
చదికిలఁబడు (పాండురంగ మాహాత్మ్యము, 3-92)
అంటిపండ్లు (అదే. 1.118); కూఁకలువెట్టు (అదే. 2-208)
మాద్రి (= మావిరి; అదే. 1-3)
చిమురు (ప్రభావతీ ప్రద్యుమ్నము, 1-133)
దారబందములు (ఉత్తర హరివంశము, 1-53)
మంది (ఉత్తర రామాయణము, పే. 107)
వలము (= లావు; వరాహ పురాణము 10-111)
బెరుకు (ప్రభావతీ ప్రద్యుమ్నము, 5-109)
పాసెము (భీమ ఖండము, 2.67)
పాఁతు (= లోఁతు; వరాహ పురాణము, 3-10)

శాస్త్రి (వైజయంతీ విలాసము. 4-127)

§ 3.5 పూర్వప్రకరణంలో ఇచ్చిన శాసనప్రయోగాలూ, ఈ ప్రకరణంలో ఇచ్చిన కావ్యప్రయోగాలూ, ఇరవయ్యో శతాబ్దిదాకా పరిణామక్రమంలో వ్యావహారిక భాషావికాసం అవిచ్ఛిన్నంగా సాగుతున్నట్లు నిరూపిస్తాయి. కేవల వచన రచనలు వచ్చిన తరవాత వాఙ్మయ భాష ఒక రచనా సంప్రదాయాన్ని సిద్ధం చేస్తున్నట్లు తెలుస్తుంది. ఎటొచ్చీ పద్యగ్రంథ రచనలోనే పురాణకాలంనాటి కృత్రిమ (వ్యవహార దూరం కాబట్టి కృత్రిమం) భాషా భేదాన్ని సింహ పీఠం ఎక్కించటం జరిగింది. ముద్దు నరసింహనాయుడిగారి మాటలనుబట్టి ఈ నూతన సంప్రదాయం పూర్వలాక్షణిక ధిక్కారానికి దారితీస్తున్నట్లు గ్రహించవచ్చు. దీని పర్యవసానం తరవాతి ప్రకరణంలో తెలుస్తుంది.

ఇరవయ్యో శతాబ్ది వ్యావహారిక భాషా వికాసం గ్రాంథిక వ్యావహారికోద్యమాలతో అవినాభావ సంబంధం ఏర్పరుచుకొంది కాబట్టి దాని విషయం తరవాతి ప్రకరణాల్లో చర్చకు వస్తుంది.

# 4. వ్యావహారిక భాషా వాదం: పూర్వ రంగం

§ 4.0 భాషావిషయకంగా తెలుగు కవుల, రచయితల దృష్టిలో కాలక్రమాన ఇంతో అంతో మార్పువస్తూ ఉన్నట్లు పూర్వ ప్రకరణాల్లో ఇచ్చిన ప్రయోగాలు నిరూపిస్తున్నాయి. భాషావికాస క్రమంలో వచ్చిన మార్పులన్నీ అందరు రచయితల గ్రంథాల్లోనూ సమప్రాధాన్యంతోగాని సంపూర్ణంగాగాని ప్రతిఫలించని మాట నిజమే. కాని సంప్రదాయమనేది ఒక్కసారిగా మారటం జరగదు. ప్రాచీనతా గౌరవం నూలిన మర్యాదలను ఎక్కరానీదు. ఇది లోకసహజం. అయితే కవుల దృక్పథాల్లో వచ్చినంత మార్పయినా లాక్షణిక దృష్టిలో వచ్చినట్లు లేదు. క్రీ. శ. పద్నాలుగో శతాబ్దినుంచీ తెలుగు కావ్యాల్లో అన్యదేశ్యపదాలు చేరుతూ వచ్చినా (చూ. '.... త్రాసులం బోని చిత్తంబుల తోడుత....'-భార. శాంతి 2.374; 'ధనము కలిమియు లేమియు త్రాసునందు నిలిపి'— అదే. 4.33 మొదలైనవి), వాటి రూప నిష్పత్తిని గురించిగాని, అర్థపరిణామంగురించిగాని, అప్పటికీ ఇప్పటికీ మన వ్యాకరణాలు మౌనం వహిస్తూనే ఉన్నాయి. కె. గోపాలకృష్ణారావుగారు పదిహేడో శతాబ్దం నుంచీ లాక్షణికులు కొందరు 'నిశిత పరిశీలన' చేశా రంటారు:

"పదునాల్గవ శతాబ్దినుండి తెలుగు కావ్యములలో ప్రయోగములు కన్పట్టుచున్నను నవి వ్యాకర్తలను విశేషముగ నాకర్షించినట్లు తోచదు. అప్పకవివంటి ఒకరిద్దఱు వైయాకరణులు అన్యదేశ్యములగూర్చి తమ లక్షణ గ్రంథములందు నిశిత పరిశీలన మొనర్చిరి.

జలశయన యాంధ్ర దేశ్యం
బులు రెండు తెలుంగులయ్యె ఘని శుద్ధాంధ్రం
బులు నన్యదేశజాంధ్రం
బులనా ...."—అప్పకవీయము, 1.165

—తెలుగుపై ఉర్దూ పారసీకముల ప్రభావము, పే. 12.

ఇది ఏపాటి 'నిశితపరిశీలన'మో తెలుస్తూనేవుంది. 'వ్యవహారహాని' కలగరాదని వాటిని ప్రయోగించటం అంగీకరించారేగాని, ఉపయోగించే రూపాల 'సాధుత్వాసాధుత్వా'లను చర్చించినవారూ లేరు; రూపనిష్పత్తి చేసిన వారూలేరు. 'సుల్తాన్' శబ్దం 'సులతాని, సురధాని, సురధాణ' వంటి భిన్నభిన్న రూపాల్లో ప్రయుక్తమయింది. వీటి మంచి చెడలు ఎవరినీ వేధించలేదు. 'తత్సమ' శబ్దాల విషయంలో

మన వ్యాకరణాలు చేసినంత విపులచర్చ (చివరకు అందులోని ప్రాకృతసమాల విషయం కూడా సంగ్రహంగానే ఉంది) ఈ నూతన శబ్దాలవిషయంలో ఇప్పటికీ జరగలేదు. అంతే ఎరువుగా వచ్చిన మాటలతోబాటు అవి తెచ్చిన భావ పరివర్తన ఏమో మన పండితులు గ్రహించలేదు. స్వతంత్ర కవులుతప్ప సామాన్యులు లక్ష్యైక దృష్టితోనే రాసుండేవారు.

§ 4.1 విద్య కొద్దిమందికే పరిమితమై ఉండేది; అందులో చాలా కొద్దిమందికి మాత్రమే 'రచన' పరిమితంగా ఉంటుంది. కవులనూ కావ్యాలనూ పోషించిన రాజుల జమీందారుల సంఖ్య వారి మొత్తం సంఖ్యలో అల్పాల్పమే. ఆ పోషకుల అభిరుచులను గమనించి ఆశ్రితులైన కవి పండితులు రచన చేయవలసి వచ్చినప్పుడు పరమ శృంగార రచనలూ, శ్లేష చిత్రకవితలూ మొదలైన క్షుద్రసాహిత్యం అపారంగా వెలువడింది. ముఖ్యంగా పదిహేను పద్దెనిమిది శతాబ్దాల్లో, ఈ గ్రంథాలయినా అక్షరాస్యులందరికీ అందుబాటులో ఉండేవి కావు. భగ్నపృష్ఠకటిగ్రీవులై స్తబ్ధదృష్టులై అధోముఖులై కష్టపడి తాళపత్రాలమీద గ్రంథాలు రాసుకోగలవారి సంఖ్య అల్పాల్పంగానే ఉండేది. ఈ రాసుకోవటంలో తెలియని శబ్దాలు మార్చటం, తమకున్న లక్షణగ్రంథ పరిచయాన్ని బట్టి కవి భాషను 'సంస్కరించటం', కొత్తలప్పులు చేర్చి, పాతవాటిని పరిహరించటం వంటి అనేక కుసంస్కారాలు జరిగేవి. ఇవన్నీ అయిన తరవాత ఆ గ్రంథాలు పండిత వ్రతులకు వారసత్వరీత్యా సంక్రమించగానే ప్రయత్న పూర్వకంగా వాటిని "పరిపాలించే" వారు. అంటే వ్యాస పీఠాల్లోనో దేవతార్చనా మందిరాల్లోనో నిక్షేపించి పూజాపురస్కారాలు చేసేవారు. అందువల్ల మూడు నాలుగు వందల సంవత్సరాలకు మించిన వయస్సుగల తాటాకు పుస్తకాలు లభించటం దుర్లభమై పోయింది.

§ 4.2 సంస్కృతమే రాజభాషగా పండితాభిమానం సంపాదించటంవల్ల తెలుగును చిన్నచూపు చూడటం సర్వసాధారణజాడ్యంగా ఉండేది. రేనాటిచోళుల నాడుగాని, చాళుక్యులనాడుగాని, తెలుగు 'రాజభాష'గా ఉందని చెప్పటానికి సరైన ఆధారాలు లేవు. చాళుక్యులు 'నిలిపిన' తెలుగు నిత్యవ్యవహారంలోనూ సామాన్యరాజకీయ వ్యవహారంలోనూ ఉండేదనవచ్చు; లేదా కవితాభాషగా ఉండేదనీ చెప్పవచ్చు. 'రాజభాష' గానే తెలుగు ఉండివుంటే నందమపూడి శాసనం సంస్కృతంలో ఉండవలసిన పనిలేదు. ఇప్పుడు ఇంగ్లీషు అధికార భాషగా ఉన్నా, తెలుగులో కొన్ని కొన్ని ప్రకటనలూ నోటీసులూ వస్తున్నట్లే అప్పటి పరిస్థితిలోనూ అలాగే ఉండేదని చెప్పవచ్చు. నన్నయ తిక్కనలు శ్రీకారంచుట్టి కవిత వెలయించేటప్పుడు సంస్కృత శ్లోకంతోనే ఆరంభించిన సంగతి మరువరానిది. నన్నెచోడుడి విచారావేశాలకు తెలుగు

కున్న అప్పటి స్థితే కారణమని కూడా గ్రహించాలి. ఎందరో పెద్ద పెద్ద తెలుగు కవులూ పండితులూ సంస్కృతం వచ్చిన వారికి తెలుగు ఒక లెక్కలోదా అనే అభిప్రాయంలోనే ఉండేవారనటానికి ఎన్నో నిదర్శనాలు చూపవచ్చు. తాపీ ధర్మారావుగారి 'కొత్తపాళీ' అనేక విషయాలు ఇలాంటివి చెబుతుంది. సంస్కృత భాషలోకి తమ పేర్లనుగూడా మార్చుకున్నారని, గ్రామనామాల పేర్లను సంస్కృతీకరిస్తుండే వారని, మన కవిపండితులను గురించి ఏ కొంత తెలిసిన వారైనా గ్రహించి వుంటారు. నిన్నమొన్నటి గుప్తార్థ ప్రకాశికాకారులు 'సంస్కృత పండితుని దృష్టి తెనుంగునం దంత ఘనంబుగాఁ బోవనేర'దంటూనే తెలుగుకు పండిత దృష్టిలో ఉన్న గౌరవ మర్యాదలను సూచించారు. సంస్కృతం మీద ఉన్న ఈ విపరీతాభిమానమే ప్రజావినోదార్థం రాసిన యక్షగానాల్లో వచన వాఙ్మయంలోను సుదీర్ఘ సంస్కృతసమాసాలు వాడేటట్లు చేసింది. రాయవాచకంనాటి సరళ వ్యావహారికం కూడా తంజావూరి సీమలోని కృతకాంధ్ర వచన గ్రంథ రచనకు లొంగిపోయింది. ఇన్ని జరిగినా జీవద్భాషా పరిణామక్రమంలో, శిష్టవ్యవహారంలో మార్పులు వచ్చి ముఖ్యంగా వచన రచనలో వ్యావహారికతకు దారితీసిందని, దాని ప్రభావం పద్య కావ్య భాషమీద కూడా ప్రసరించి అవ్యాకృత 'గ్రామ్య' రూపాల సంఖ్య పెంచిందని, పూర్వ ప్రకరణాల్లోని ఉదాహరణలు స్థాలీపులాక న్యాయంగానైనా రుజువు చేస్తున్నాయి.

§ 4.3 ఆంగ్లేయులు వలస రాజ్యాధిపతులుగా స్థిరపడేకొద్దీ సంఘజీవితంలో, రాజకీయవ్యవస్థలో, కనీ వినీ ఎరుగని మార్పులు వచ్చిపడ్డాయి. వాళ్ళ మతప్రచార దృక్పథం తెలుగుకు ప్రాముఖ్య మివ్వక తప్పలేదు. జైనులూ బౌద్ధులూ పాళీ ప్రాకృతాలను చేపట్టినట్లు, పాల్కురికి సోమనాథాదులు ప్రయత్నపూర్వకంగా వీరశైవ మతప్రచారానికి దేశీయమైన తెలుగును సాధనంగా ఉపయోగించినట్లు, క్రైస్తవ మత ప్రచారకులు తెలుగును చేపట్టారు. అయితే వీళ్ళనాటికి దేశకాలాల్లో అభిరుచుల్లో 'సాధనాలలో' వచ్చిన మార్పులు పూర్వకాలపు వాటికన్నా ఎన్నో రెట్లు బలవంతమైనవి. వాటిలో 'ముద్రణ యంత్రం' మహోత్కృష్టమైనది. దాని ప్రభావంవల్ల గ్రంథాలు అందరికీ స్వల్పవ్యయంతో అందుబాటులోకి వచ్చాయి. దీనివల్ల జరిగినట్లు విజ్ఞాన వికేంద్రీకరణ మరి ఏ సాధనాంతరంవల్లా జరగలేదు: 'ముద్రాక్షరశాల: గ్రామ్యభాషాభివృద్ధి' అనే వ్యాసంలో కుందూరి ఈశ్వరదత్తుగారు ఒక ఆంగ్ల గ్రంథంనుంచి ఉద్ధరించిన ఈ మాటలు అక్షరాలా నిజమైనవి (చూ. వ్యాససంగ్రహం. పే. 342-3):

"The Printing Press began the decentralization of scholarship by impairing the powers of the Universities.

....The intellectual exclus'veness was destroyed once for all, the humblest man who could read became a citizen of the new Republic of Letters and a tremendous impulse was thus given to the spread of the lay spirit."

—Hudson's "Story of Renaissance", pp. 32 35

క్రీ. శ. 1720 నుంచి క్రైస్తవ వాఙ్మయం వ్యవహారభాషలో రావటం మొదలయింది (చూ. నిడుదవోలు వేంకటరావు, ఆంధ్ర వచన వాఙ్మయము, పే. 68). బెంజమిన్ షూల్జి ధర్మము అని తెలుగు పుస్తకాలు అచ్చుకావటం క్రీ. శ. 1746లో ఆరంభమయింది (అదే. పే. 69). 1806 లో మద్రాసులో తెలుగు ముద్రణాలయం నెలకొన్నప్పటినుంచీ తెలుగు పుస్తకాల ప్రచురణ మూడు పూలు ఆరుకాయలుగా వర్ధిల్లింది (చూ. కె వి. రమణారెడ్డిగారు, మహోదయం, పే. 23).

§ 4.31 భారత ప్రభుత్వపు సర్వేయర్ జనరల్‌గా ఉన్న కల్నల్ కాలిన్ మెకంజీ (1753_1821) కావలి వెంకట బొర్రయ్యగారు (1776_1803) అనే విద్వాంసుడితో 1796లో ఏర్పరచుకున్న స్నేహసంబంధాల ఫలితంగా (చూ. కొత్తపల్లి వీరభద్రరావుగారు, తెలుగుపై ఇంగ్లీషు ప్రభావము, పే. 116) బహు వ్యయ ప్రయాసలతో సేకరించిన 'కైఫీయతులు' మనవాళ్ళకు చారిత్రకదృష్టిప్రదానాన్ని ప్రసాదించడం ఆరంభించాయి. వీటన్నిటినీ పునారచింపజేసి చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ అరవైరెండు సంపుటాల 'స్థానిక చరిత్ర'లను (Local Records) తెలుగువారికి ప్రసాదించాడు. ఇవి ఆనాటి శిష్ట వ్యవహారానికి ప్రతిబింబాలయిన రచనలు. 1802 నుంచి ప్రభుత్వ ప్రకటనలు (notifications) అన్నీ వ్యావహారికంలోనే ఉండేవి (చూ. గిడుగు వేంకట రామమూర్తిగారు, వ్యాసావళి, పే. 13).

§ 4.32 క్రీ. శ. 1813 లో బ్రిటీష్ పార్లమెంటు 'చర్చి మిషనరీ సొసైటీ'ని స్థాపించాలని, దేశభాషల్లో విద్యాబోధన జరపాలనీ, ఈ రెండు ఉద్దేశాలనూ నెరవేర్చటానికి తగిన ప్రచారం మొదలుపెట్టాలనీ, సంకల్పించి 'చార్టర్ ఆక్ట్'ను పాస్ చేసింది (చూ. మహోదయం, పే. 21). తత్ఫలితంగా మద్రాస్‌లోని సెంట్ జార్జి కోటలో ఒక కళాశాలను ఆ యేడే ప్రారంభించారు. రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు (1770_1837), ఉదయగిరి వెంకటనారాయణయ్యగారు అధ్యాపకులుగాను, పట్టాభిరామశాస్త్రిగారు సంస్కృతాంధ్ర శాఖలకు ప్రధానులుగాను నియమితులైనారు (అదే. పే.). మామిడి వెంకయ్య గారి 'ఆంధ్రదీపిక' (ఇది 1816 కే రచితమైనా 1848 వరకూ అచ్చుపడలేదు—చూ. తెలుగుపై ఇంగ్లీషు ప్రభావము, పే. 131). ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్రా చరిత్ర'

(1838), గురుమూర్తిశాస్త్రిగారి 'విక్రమార్కుని కథలు' (1819), పంచతంత్ర కథలు (1834) మొదలైనవి పాఠ్యగ్రంథాలుగా ఉండేవి (చూ. మహోదయం, పే. 21). 1817 లోనే బ్రౌణ్య నిఘంటువు వెలువడ్డదని కొత్తపల్లి వీరభద్రరావుగారంటారు. 1820 లో 'ఉపయుక్త గ్రంథకరణ దేశభాషాసభ' ఏర్పడింది (చూ. ఆంధ్ర వచన వాఙ్మయము, పే. 96). 1817 లో విలియం బ్రౌన్ రాసిన తెలుగు వ్యాకరణం ప్రచురితమయింది (చూ. A Minute of Dissent etc. P. 24). కేంబెల్ రాసిన తెలుగు వ్యాకరణం 1816 లో ప్రథమంగా ముద్రితమై (చూ. మహోదయం, పే. 21) 1820 నాటికి ద్వితీయ ముద్రణ పొందింది. 1827 లో సి. పి. బ్రౌన్ (1798 1885) రాసిన బైబిలు అనువాదం, 1829 లో వేమన పద్యాలకు ఇంగ్లీషు అనువాదం, 1833 లో తెలుగు సాహిత్యాన్ని గురించిన వ్యాసం, 1840 లో తెలుగు వచనంలో తెలుగు వ్యాకరణం, 1852 లో తెలుగు - ఇంగ్లీషు, ఇంగ్లీషు-తెలుగుల్లో సంకలించిన రెండు నిఘంటువులు, 1854 లో బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటువు వెలుగు చూశాయి. కేంబెల్ తెలుగు వ్యాకరణం 1849 నాటికి మూడో ముద్రణ పొందింది (చూ. నవ్యాంధ్ర సాహిత్యవీథులు, 1.22; తెలుగుపై ఇంగ్లీషు ప్రభావము, పే. 131). రాబర్ట్ బిషప్ కాల్డ్వెల్ రాసిన ద్రవిడ భాషా తులనాత్మక వ్యాకరణం 1855-56 లకు వెలుగు చూసింది. 1836 లో కేంబెల్‌కు అంకితంగా రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు రాసిన 'గురుమూర్తి వ్యాకరణము' ప్రచురితమయింది (చూ. తెలుగుపై ఇంగ్లీషు ప్రభావము, పే. 131-). 1839లో మదరాసు మచిలీపట్టణాల్లో ఇంగ్లీషు బోధనమాధ్యంగా పాఠశాలలు, 1841 లో మద్రాసు విశ్వవిద్యాలయోన్నత పాఠశాల, 1855 లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల నెలకొన్న తరువాత 1857 లో సర్వలక్షణ సంపన్నంగా మద్రాసు విశ్వవిద్యాలయం స్థాపితమయింది (చూ. మహోదయం, పే. 22) 'దేశభాషా గ్రంథకరణసభ' వారు ప్రచురించిన పాఠ్యగ్రంథాలు 1848 నాటి 'గణిత శాస్త్రము', 1849 నాటి 'భూగోళ పరిచయము' (Outlines of Geography) 1852 నాటి జార్జిడీన్ రాసిన 'ప్రపంచ భూగోళము', 1855 నాటి 'జంతు స్వభావదీపిక' మొదలైన పాఠ్య గ్రంథాలన్నీ వ్యావహారికంలోనే ఉండేవి. హిందూ విద్యా సభలో సంస్కృత పండితులుగా ఉన్న పి. సీతారామశాస్త్రిగారు కాలోగారి కోరిక మీద 1834 లో రాసిన తెలుగు వ్యాకరణం లోనూ వ్యావహారిక రూపాలుండేవి (See Minute of Dessent, etc , pp. 109-110). 1848కి ముందు ప్రచురించినపాఠ్యగ్రంథాలన్నీ వ్యావహారికంలోనే ఉండేవి (చూ. మహోదయం, పే. 24) ఆ సంవత్సరమే ఉపయుక్త గ్రంథకరణ దేశభాషా

సభకు పరవస్తు చిన్నయసూరిగారు (1806-69) అధ్యక్షులయిన తరవాత 1852 లో 'నీతిచంద్రిక'ను, 1855 లో 'బాలవ్యాకరణాన్ని' (చూ. ఆంధ్ర వచన వాఙ్మయము, పే. 86) రచించి రాజధాని కళాశాలలో ప్రధానాంధ్రాధ్యాపకు లయిన తరవాత పరిస్థితులు తల్లకిందులుగా మారిపోయాయి. మొదటి తెలుగు పత్రిక 'వర్తమాన తరంగిణి' లోను, రెండోది 'సుజనరంజని'లోను (చూ. మహోదయం, పే. 55; 'సుజన రంజని' 1855 లో వెలువడ్డది. దానికి చిన్నయసూరిగారే సంపాదకులు. ఆ యేడే ఆయన 'హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము' ప్రచురితమై ఆంగ్లేయులను ఆకట్టుకొంది) మొదట మొదట 'వ్యావహారిక భాషా సంప్రదాయ'మే అనుసృతమయి తరవాత గ్రాంథిక మర్యాదకు మారిపోయాయి. (చూ. ఆంధ్ర వచన వాఙ్మయము, పే. 118). బహుజనపల్లి సీతారామాచార్యుల వారి (1828-91) 'ప్రౌఢ వ్యాకరణము', 'శబ్ద రత్నాకర' నిఘంటువూ 1886 లో వెలువడ్డాయి.

పై 'మతలబు' లన్నిటినీ ప్రయోజనాపేక్షతోనే ఉదాహరించాను. క్రీ. శ. 16-18 శతాబ్దాల మధ్య, సాంఘిక రాజకీయార్థిక స్థితిగతుల్లోనూ భాషాసాహిత్య దృక్పథాల్లోనూ శరవేగంతో వచ్చిన మార్పులకు పై విశేషాలు మూలకారణాలు. ఇవి అన్యోన్యాశ్రయా లయినప్పటికీ, ఒక్కొక్కటిగానే సమాజస్వరూపాన్ని సాంఘికవ్యవస్థనూ ఎంతో మార్చగల శక్తి గలవి. వీటిని ఒక్కొక్కదాన్నే పరిశీలించటం మంచిది.

§ 4.4 సంఘంలో మొదటినుంచీ చదువుకున్నవారి సంఖ్య స్వల్పమే. విద్యాధికులకు ఎప్పుడూ గౌరవ మర్యాదలకు లోపంలేదు. కానీ పూర్వం చదువు ఏ ఒకటి రెండు కులాలకో ఏ కొద్దిమందికో పరిమితమై ఉండేది. అది రాజపూజకే గాని ఉదర పోషణకు అంతగా పనికివచ్చేదికాదు. మొదట మొదట కంపెనీవారి దగ్గర గుమాస్తాలుగాను, తరవాత చిన్న చిన్న ప్రభుత్వోద్యోగులుగాను 'జీవన వసతి' కల్పించిన చదువు 1813నుంచీ కులమతప్రమేయం లేకుండా ఎవరికయినా లభ్యపడటం ఆరంభమయింది. క్రైస్తవమత ప్రచారానికి లొంగిన ఏ కులంవారికయినా, ఆ ప్రచారాన్ని తీవ్రంగా నిరసించని తిరుగుబాటుచెయ్యని ఎవరికైనా విద్యాసౌకర్యాలు క్రమక్రమంగా పెద్ద మొత్తున లభించటంతో సంఘంలో విద్యావంతుల సంఖ్య పెరగటం మొదలయింది. సంపాదనపరుల సంఖ్య పెరిగింది. కొత్త ధనవంతుల రాకతో పూర్వసంఘ ధర్మాల్లో శిథిలత్వమూ నూతన ధర్మాల పుట్టుకా మొదలయినాయి.

§ 4.41 భూస్వాముల, చిన్న చిన్న జమీందారుల ప్రాబల్యాధికారాలు సన్న

గిల్లి చరిత్రలో అధునాతనంగా వచ్చిన సామ్రాజ్యవాద యుగలక్షణాలు సరికొత్త శక్తితో రాజకీయాధికారం సంపాదించటంతో కొత్త రాజుల అలవాట్లు, ఆచారాలు, అభిరుచులు ఆదర్శాలుగా పరిణమించటం మొదలయింది. సామ్రాజ్యవాదుల్లో, గుక్తిలో మెల్లగా ఇంగ్లీషువాళ్ళు సరసులూ సంస్కారులూ కావటంవల్ల మహమ్మదీయయుగంనాటి మాంద్యం తగ్గి విశాల తరమైన రాజకీయ చైతన్యం ప్రజాసామాన్యంలో ప్రవేశం సంపాదించసాగింది. పారిశ్రామికవిప్లవారంభసమయంలో యూరప్‌దేశాల్లో వచ్చిన చైతన్యంలాంటిది ఆంగ్లవిద్యద్వారా మనవాళ్ళకుకూడా సంక్రమించటం పట్టుబడటం మొదలయింది. కొత్త దొరలను కొత్త పద్ధతులద్వారా సంతోషపెట్టవలసిన అవసర మేర్పడింది. విద్యాసంస్థలు, ముద్రణ యంత్రాలు ఈ నూతన వ్యాసంగానికి ఆలంబనోద్దీపనాలను సంతరించాయి. చెప్పినమాట, చేసినపని బ్రహ్మాండమైన ప్రచారం సంపాదించి విద్యాగంధం లేనివాళ్ళకుకూడా తెలుస్తుండేవి. పూర్వం ఏ పండిత సభలోనే పదిమందిని మెప్పించిగాని ప్రచురణార్హత సంపాదించుకోలేని విద్యాప్రదర్శనలు ముద్రణసౌకర్యాలవల్ల రాతనేర్చిన ప్రతివాడికీ అందుబాటులోకి వచ్చాయి. సమాజంలో ఎక్కువమందికి విద్యరాగానే ఈ ప్రచురణలు మరింత బలం పుంజుకో సాగేయి. ఆంగ్ల విద్య వల్ల అంతవరకూ కనీ, వినీ, ఊహించీ ఎరగని సరికొత్త భావాలు మొలకెత్తి భావపరివర్తనకు నాంది పలికేయి భాషా సాహిత్యాల విషయంలో అనూచానంగా వస్తున్న నమ్మకాలు, అభినివేశాలు, ఆదర్శాలు పైనపేర్కొన్న మహా గ్రంథాలు కారణంగా మారటం మొదలుపెట్టేయి. వాటి ఫలితమే ఇరవయ్యోశతాబ్దం నాటి వ్యావహారికమహోద్యమం.

§ 4.42 మొదట సాహిత్యవిషయం పరిశీలిద్దాం. ప్రబంధప్రక్రియకు నాయక రాజ్యంలోని కవులు చాలామంది నివాపాంజలి ఘటించారు. ఇందుకు చేమకూరి విజయవిలాసంవంటివి అపవాదాలు మాత్రమే. వచనరచనలూ గేయరచనలూ సంఖ్యాధికమైనాయి. మహాకావ్య నిర్మాణదృష్టి తగ్గి ద్వ్యర్థి త్ర్యర్థి రచనలవంటి సాముగరిడీలను పండిత కవులనేవాళ్ళు చేస్తుంటే, సాంఘిక రాజకీయ సంక్షోభాలను చూసి వేమనలాంటి వాళ్ళు గోగులపాటి కూర్మనాథుడివంటి వాళ్ళు కొంతమంది విచారోద్వేగంతో, కొంతమంది అశక్తకోపంతో, కొంతమంది నిరుత్సాహంతో మొరపెడుతూ ప్రచార ప్రబోధాలు సాగించేవారు. యక్షగానాలకూ హరికథలకూ సామాన్యప్రజల్లో గౌరవం పెరిగేకొద్దీ, కవులలో మహాకావ్యరచనమీదా ప్రబంధబంధనాలమీదా గౌరవం తగ్గుతుండేవి. రాజకీయ-అస్థిరత్వ సంక్షోభాలు ఉత్తమకవితామార్గంవైపు ఎవరినీ మళ్ళించ

లేము. (కవితా రచనకూ కవి జీవించే సమాజస్థితికీ సంబంధం లేదని. దేశకాలావ్యవచ్ఛిన్నమైన ఏదో మహాశక్తి (మహా) కావ్య నిర్మాణం చేయిస్తుందని కొందరు పెద్ద లంటారు. కానీ ఒక దృష్టితో చూస్తే అది అపవాదమేమో ననిపిస్తుంది. ఏదో ఒక మహాలక్ష్యం ఎదురుగా ఉన్నప్పుడు చక్కని చిక్కని రచనలు వచ్చి ఆ లక్ష్యం లేని కాలంలో నిర్లక్ష్యమో నిరుత్సాహమో మరేదో కారణంగా మంచి రచనలు రావటానికి ప్రబల నిదర్శనం లేకపోలేదు. ఆంధ్రోద్యమ స్వాతంత్ర్యోద్యమాల నాటి కవితోత్సాహాన్ని నేటి నీరవత్వంతో పోల్చి చూస్తే ఈ విషయం నిజమని పిస్తుంది). శతకాలు, శతవధానాలు, చిత్రకవితలు, చాటుపద్యాలు వందల సంఖ్యలో వచ్చినా రచనాపద్ధతిలో కొత్తదనంగాని, రకరకాల సాహితీప్రక్రియలుగాని, మన సంప్రదాయంలో లేవన్న వాస్తవికతను ఆంగ్ల విద్య అనుక్షణం జ్ఞాపకం చేస్తుండేది. వచనరచనలు మంచివిలేవు; నాటకాలు లేవు; శాస్త్రగ్రంథాలు చెప్పుకోదగినన్ని లేవు. ఉన్న రచనల్లో వైవిధ్యంలేదు. ఇవి లేవు; అవి లేవు. ఇంగ్లండులో మెట్రిక్యులేషన్ చదివే విద్యార్థికి ఎన్నిరకాల సాహిత్యప్రక్రియలతో పరిచయముందో ఇక్కడా అలాగే ఉండాలన్న ఆంగ్లేయుల అభినివేశం గట్టి చిక్కే తెచ్చిపెట్టింది; నూతన ప్రక్రియాకల్పనకు ప్రోత్సహించింది కూడా. అవసరం అవకాశాన్ని కల్పించగా, అవకాశం సంప్రదాయమూరతకు దారి తీసింది. ఆంగ్లభాషద్వారా ఆంగ్లసారస్వతాన్నే గాక విశ్వసాహిత్యాన్నే తన విజ్ఞాన పరిధిలోకి తెచ్చుకుంటున్న ఆంధ్రసామాజికులు నూతనకళాదృష్టిని, విమర్శనదృష్టిని, చారిత్రకదృక్పథాన్ని, తులనాత్మకపరిశీలనను పరికల్పించుకోవటం కారణంగా గతానుగతికమైన సంప్రదాయదాస్యంనుంచి క్రమంగా విముక్తిమార్గం వెతుక్కోవటం ఆరంభమయింది. కవిజీవితాలు, చరిత్రలు, నవలలు, నాటకాలు, ప్రహసనాలు, విమర్శలు, స్వీయచరిత్రలు, శాస్త్రగ్రంథాలు— ఒకటేమిటి విశ్వసారస్వతంలో కనిపించే వినిపించే సమస్తనూతనప్రక్రియాభేదాలూ తెలుగులో అవతరించటం మొదలయింది. జ్ఞానతృష్ణ, విద్యావ్యసనం, బలీయమై వేళ్ళూన్నాయి. ఈ శతాబ్దారంభకాలంనాటి నూతన సాహితీ ప్రక్రియలకు ఇవే, ఈ దృష్టే, ప్రధాన కారణాలు.

§ 4.43 ఆంధ్రలాక్షణికులకు కవిపండితులమీద ఉన్న అధికారప్రాభవాలు భాషా వ్యాకరణాలను గురించి వాళ్ళలో కొన్ని మూఢవిశ్వాసాలను పాదుకొల్పాయి. పాణిని పతంజలుల తరవాత భారతదేశంలో సవిమర్శక వ్యాకరణ సిద్ధాంత ప్రయోగం కాలం చేసింది. సిద్ధాంతమూలమో వ్యతిరేకమో అయిన ఆదరణవల్లనే యీ ముప్ప

లిరాలు సంక్రమించాయి. ఆంగ్లేయులు మన దేశానికివచ్చి, మన పండితుల నాదరించి ఆశ్రయించి వాళ్ళ దగ్గర భాషాసాహిత్యాలు నేర్చి నిర్మించిన నిఘంటువులూ వ్యాకరణాలూ విలక్షణమైన పద్ధతిలో ఉండి విమర్శాత్మకదృష్టితో వుండి మనవారి మనసులు మార్చటం మొదలుపెట్టేయి. నిఘంటువులు అకారాదిక్రమంలో ఉంటే ఉన్న సౌలభ్యమేమో కేంబెల్ నిరూపించాడు. కవిప్రయోగాలివ్వని పద్యకోశాలకన్నా కావ్య వ్యవహార, లోక వ్యవహారాలనుంచి ప్రయోగాలెత్తి చూపిన నిఘంటువు ఎంత ప్రయోజనకరమో ప్రామాణికమో బ్రౌన్ నిరూపించాడు. వీరూ వీరిలాంటి మరికొందరూ మన వ్యాకరణ గ్రంథాల లోపాలను ఎత్తి చూపేరు. ఇవి చూడండి:

"Hindu grammarians, like those of China, neglect the colloquial dialect, which they suppose is already known to the student, and teach only the poetical peculiarities."

—C.P. Brown, A Grammar of the Telugu Language, Preface, p. II.

"Each of the southern languages has a poetical and a vernacular dialect which vary as widely as Saxon varies from English."

—C. P. Brown. Preface to his Telugu-English Dictionary, p.iv.

"It is a remarkable peculiarity of the Indian Languages that, as soon as they begin to be cultivated, the literary style evinces a tendency to become a literary dialect distinct from the dialect of common life with a grammar and vocabulary of its own."

—Caldwell, as quoted in 'Minute of Dissent'.... etc., p.54.

ముఖ్యంగా కాల్డ్వెల్ సిద్ధాంతం పరంపరాగతంగా వస్తున్న 'జనని సంస్కృతంబు సకల భాషలకును' అనే విశ్వాసాన్ని పెకలించింది. ప్రపంచంలో అనేకభాషలున్నాయని, వ్యాకరణ లక్షణాలనుబట్టి వాటిని భిన్న కుటుంబాలుగా విభజించవచ్చునని, భాషలోని పదజాలంకన్న దాని నిర్మాణక్రమమే జన్యజనకసంబంధనిర్ణయానికి ప్రధాన హేతువని, తెలుగుమొదలైనవి ద్రవిడ భాషాకుటుంబానికి చెందిన

భాషలేనాని సంస్కృత ప్రాకృతజన్యాలు కావని. నూతన సిద్ధాంతాలు అనేకం కాల్డ్వెల్ ద్వారానూ అవి వెలుగులోకి వచ్చాయి. యూరపులో పదిహేనో శతాబ్దంలో బయలుదేరిన భాషాశాస్త్రమనే నూతనశాస్త్రసిద్ధాంతాలు ఆంగ్లభాష ద్వారా తెలుగువారికి తెలియవచ్చాయి. పాశ్చాత్య పద్ధతులలోని భేదాలతోపాటు వ్యాకరణానికీ వాఙ్మయానికీ కావ్యవ్యవహారాలకూ గల పరస్పరసంబంధాలు తెలియటంతో భాషాధ్యయనంలో [illegible] వచ్చింది; లక్షణగ్రంథాల అధికారం మీద మనవారి దృష్టిలో మార్పు వచ్చింది: కవిప్రయోగాల మీద లక్షణకర్తల మీదకన్నా ఎక్కువ గౌరవం కలిగింది. శిష్టవ్యవహారగతమైన శబ్దజాలాన్ని గ్రహించి వ్యాకరించిన (గురుమూర్తిశాస్త్రివంటి) వారిమీద గౌరవం పెరిగింది. భాషాశాస్త్ర ప్రభావం తెలుగుపండితలోకంలో మంచి మార్పులు తెచ్చిందనటానికి ప్రథమ నిదర్శనాలు గిడుగు వేంకట రామమూర్తిగారు సవరభాషకు రచించిన నిఘంటు వ్యాకరణాలు (1892). ఆమేదే తాతిపెల్లి మిరాసీదార్ శేషగిరిశాస్త్రిగారి 'అర్థానుస్వార తత్త్వము' కొంతకుకొంత భాషాశాస్త్రధోరణిలో వెలువడ్డది. 1915 నాటికి భాషాశాస్త్ర ప్రయోజనాన్ని వేదం వేంకటరాయశాస్త్రిగారి వంటి సనాతనపండితాగ్రేసరులు కూడా గుర్తించటం ఆరంభించారు. తమ 'ఆంధ్రభాషాసర్వస్వనియమకలాపము'లలో వారు చెప్పిన యీ మాటలిందుకు నిదర్శనం:

"షష్టీపల మహాప్రాజ్ఞులు పాశ్చాత్యవిద్వాంసులు కల్పించిన ఫైలాలజీ (Philology) పేరి సర్వభాషార్థ వ్యుత్పత్తి సంబంధాది విమర్శనశాస్త్రము చేత, దివ్యదృష్టి చేతనుంబలె, అపూర్వవిషయము లనేకములు గోచరములైనవి(పే.18):

"...కావున, ఈ నూతన శాస్త్రమును నిష్ఠాతత్త్వము వ్యుత్పత్తిసిద్ధికి మహోపకారకము; ఈ శాస్త్రము శబ్దవ్యుత్పత్తులకు నికషోపల స్థానీయము" (పే. 19).

ప్రత్యక్ష పద్ధతి (direct method) ద్వారా విద్యాబోధన చేస్తే అత్యంత ప్రయోజనకరంగా ఉంటుందనే సిద్ధాంతం ఆంగ్లప్రపంచంలోనే ఆనాటికి నవీన సిద్ధాంతంగా ఉండేది. గిడుగువారు ఆ సిద్ధాంతాన్ని అమలుపరచటం అప్పుడే ఆరంభించారు.

§ 4.44 ఈ మార్పుల్లో ఒక్కొక్కదాని పరిణామ మెట్టమొదటిదాకులో నిరూపించటం అన్ని సందర్భాల్లోనూ సాధ్యం కాకపోయినా, ఆనాటి పండితలోకంలో కొందరికయినా నూతనభావోదయం కలిగిందని చెప్పవచ్చు. హితసూచనీకారులోని ముద్దు నరసింహనాయుడుగారి వాక్యాలే వ్యావహారికోద్యమానికి నాందీవాక్యాలని చెప్పాలి. ఆనాడు సనాతనాధునాతన భావాలుగల పండితుల మధ్య ఏ విధంగా వాదో

వాదాలు జరిగేయో, అవి ఏ ధోరణుల్లో నడిచేయో చెప్పటానికి ప్రత్యక్ష నిదర్శనలు దొరకలేదు. కాని, కావ్యభాషకు—అదీ కవిత్రయభాషకు—చాలావరకు సరిపోయే మన పూర్వ వ్యాకరణాలు సమకాలంలోని తెలుగు వచనరచనలకు సరిపోవని -లేదా సరికావని చాలా మంది పండితులు గమనించినట్లు మాత్రం చెప్పవచ్చు. సంఘ సంస్కరణతోపాటు కొంతకుకొంత భాషాసాహిత్యసంస్కారం కూడా తలపెట్టిన కందుకూరి వీరేశలింగంగారు (1848 - 1919) వివిధ సాహిత్య ప్రక్రియలను 1880 నుంచి 'సరళ గ్రాంథిక' భాషారూపంలో వెలువరించటం ఆరంభించారు. సంఘ సంస్కారదృష్టితోపాటు భాషాసంస్కారదృష్టిని కూడా ప్రకటించే గురజాడ అప్పారావుగారి (1861 -1916) మహానాటకం 'కన్యాశుల్కం' 1897 లో ప్రథమ ముద్రణం అయింది. 1862-97 మధ్య గల ముప్ఫైఅయిదేళ్ళ కాలంలో భాషా విషయకంగా ఎన్ని చర్చలు జరిగేయో ఏవిధంగా జరిగేయో నిరూపించటానికి పూర్తి ఆధారాలు దొరకటం లేదు. 1862 నాటికి బీజప్రాయంగా ఉన్న వ్యావహారిక భాషాసిద్ధాంతం 1897 నాటికి ఒక రూపానికి వచ్చిందని మాత్రం చెప్పగలం. చిన్నయసూరి 1848 లో ప్రెసిడెన్సీకళాశాలలో అధిపత్యం సంపాదించినప్పటి నుంచి వచనరచన గ్రాంథికంవైపు మొగ్గుచూపినా, వీరేశలింగంగారి నాటికి (1380) అది 'సరళగ్రాంథిక' రూపం ధరించి వేదం వెంకటరాయశాస్త్రిగారి (1853-1929) 'నాగానంద' మనే తెలుగు నాటకం (1896) నాటికి 'పాత్రోచిత భాష' అనే పేరు సంపాదించి తొలిసారిగా నీచపాత్రల వ్యావహారికంగా ప్రయుక్తమయింది. సంస్కృత నాటకాలను అనువదించటం మొదలు కాగానే నీచపాత్రలకు ప్రాకృత [illegible]. ఉత్తమ పాత్రలకు సంస్కృతం ఉపయోగించటమనే పద్ధతిని అనుకరించాలన్న బుద్ధి కొందరిలో పుట్టివుంటుంది. సంస్కృతప్రాకృతాలు భిన్నభాషలనే విషయాన్ని మరిచిపోయి తెలుగునాటకాల్లో (లేదా ఆంధ్రీకృత నాటకాల్లో) అదే పద్ధతిని రెండు భాషలనుగాని భాషాభేదాలనుగాని ఉపయోగించటం మంచిదన్న అభిప్రాయం పొడ చూపింది. కొందరినాటకాల్లో, ప్రాచీనవ్యాకరణ లక్షణాలకు అనుగుణంగా ఉన్న శబ్ద రూపాలు ఉత్తమ పాత్రల భాషలలోను లాక్షణికులు'గ్రామ్య'మని ఆక్షేపించిన శబ్ద రూపాలు నీచపాత్రల భాషలోను ప్రవేశంసంపాదించాయి. దాంతో సనాతనవాదులకూ సంస్కరణ వాదులకూ జగడం ప్రారంభమయింది. 1898 డిసెంబరులో మద్రాసులో సమావేశమైన పండితపరిషత్తు ఈ విషయంలో తీవ్రవాదోపవాదాలు జరిపింది. వడ్డాది సుబ్బారాయుడుగారు (రాజమండ్రి), ధర్మవరం కృష్ణమాచార్యులుగారు (బళ్ళారి), నాగభూషి కుప్పుసామయ్యగారు (చిత్తూరు) నాటక రచనలో 'గ్రామ్య' పదాలను వాడకూడదని విమర్శిస్తూ ఆసభలో 'గ్రామ్యభాష'లోనే ప్రసంగించారు. (చూ. వాసా

సూర్యనారాయణశాస్త్రిగారు, గ్రామ్యాపవాదనిరసనము, వ్యాససంగ్రహము, పే.236). 1899 నాటి 'అముద్రితగ్రంథచింతామణి' పత్రికలో ఈ విషయమై వాద ప్రతివాదాలు జరిగేయి. ఎరగుడిపాటి వేంకటాచలముగారు (20-2-1899) రసప్రధానాలైన నాటకాలలో రసపోషణకోసం పాత్రోచితభాష అవశ్యంగా ప్రయోగించవలెనని వాదించారు (చూ. నాటకాదులయందు గ్రామ్యభాష యుపయోగింపఁ దగునా? తగదా?, సారస్వతవ్యాసములు, రెండవ సంపుటము, పే. 38-47). వేదం వారి నాగానందానికి పూర్వం ఈ వాదమే లేదని (అదే. పే.39), అప్పటికి కందుకూరి వీరేశలింగం, కోలాచలం శ్రీనివాసరావు, వేదం వేంకటరాయశాస్త్రిగారల నాటకాలు పదకొండుకు పైగా పాత్రోచితభాషలో వెలువడ్డాయని (అదే. పే. 41) వేంకటాచలంగారి వాదం. ఈ వాదాన్ని పత్రికాధిపతులూ విద్వద్విమర్శకులూ ఐన పూండ్ల రామకృష్ణయ్యగారు సమర్థించారు (చూ. వ్యాస సంగ్రహం, పే. 235). అయితే 1897 లో గురజాడ వారి కన్యాశుల్కం పూర్తిగా 'గ్రామ్య' భాషలోనే వెలువడిందని గుర్తించాలి. అప్పటికి పాత్రోచితభాషమీద వ్యతిరేక భావం సన్నగిల్లింది. గ్రాంథికవాదానికి గండి పడింది. ఇక రెండో అంశం. కందుకూరి వీరేశలింగంగారు అపండితులని నిందించిన మహామహోపాధ్యాయులు కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు (1840-1915) రాసిన 'ప్రసన్నరాఘవ' నాటకం గ్రామ్యభాషాయుక్తమని 1898 లో వేదం వేంకటరాయశాస్త్రిగారు తాము రచించిన 'ప్రసన్నరాఘవ విమర్శనము' లో దూషించారు. వేదంవారికికూడా గ్రాంథికభాష సరిగా రాదని గిడుగు వేంకట రామమూర్తిగారు (1863-1940) తొలిసారిగా 1899 లో తాము ప్రకటించిన 'ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజం' అనే ఖండనగ్రంథంలో సప్రమాణంగా నిరూపించారు. సరిగా ఆ కారణంవల్లనే శిష్టవ్యావహారికాన్ని గ్రంథరచనలో ఉపయోగించాలని గిడుగువారన్నారు. దాంతో సంకుచితవిద్యాస్పర్థ ఒక మహోద్యమానికి దారితీసింది. అంతవరకూ చర్చారూపంలో వాదప్రతివాదదశలో ఉన్న భేదాభిప్రాయాలు ఉద్యమదశకు రావటానికి గిడుగువారే మూలకారకులు. స్వామినేని వారి కాలంలో (1848 లో) బీజప్రాయంగా ఉన్న భావాలు 1909-10 నాటి గిడుగువారి రాకతో ఉద్యమస్థితికి రాగానే, అంతవరకూ అన్యోన్య స్పర్ధలతో కొట్టుమిట్టాడుతున్న సనాతనవాదులూ సంస్కరణవాదులూ తమ వైరుధ్యం విస్మరించి ఒక్కటై గిడుగువారి మీద మోహరించారు. అప్పటికి సరళగ్రాంథిక పాత్రోచితభాషా సిద్ధాంతాలు సమరస భావంతో ఉండబట్టి 1909 లో వేదంవారి 'ప్రతాపరుద్రీయనాటకం' మీద పెద్ద దుమారమేమీ రేగలేదు.

# 5. వ్యావహారికోద్యమ చరిత్ర

§ 5.0 గిడుగు వేంకట రామమూర్తిగారి ప్రవేశంతోనే వ్యావహారిక భాషా వాదం ఉద్యమస్వరూపం ధరించింది. ఇది 1910 లో ఆరంభమయింది. ఆయేడే గురజాడ అప్పారావుగారి 'ముత్యాల సరాలు', 'నీలగిరి పాటలు' వ్యావహారికంలో ప్రకటితమైనాయి. ఆటో యెస్పర్సన్ (Otto Jespersen) అనే భాషా శాస్త్రజ్ఞుడు ఇంగ్లీషులో రాసిన 'A Shorter English Grammar'ను గిడుగువారు వ్యావహారికంలోకి అనువదించారు. సనాతనపండితులు ఆయన వ్యావహారికవాదాన్ని 'గ్రామ్య భాషావాద' మని ఆక్షేపింపసాగేరు. 'ప్రత్యక్షపద్ధతి' (direct method) ద్వారా విద్యాబోధనచేస్తే పఠనపాఠనాలు సుకరంగా త్వరగా సాధ్యమవుతాయని నిరూపించి గిడుగువారు డేనియల్ జోన్స్‌వంటి జగద్విఖ్యాతభాషావేత్తల మెప్పు సంపాదించారు. సహజంగా సనాతనదృక్పథంతో బోధించే ఉపాధ్యాయులకు ఈ నూతన పద్ధతి వివరించటానికి విశాఖపట్టణంలో ఉపాధ్యాయసమావేశ మొకటి మే నెలలో ఏర్పాటయింది. అందులో ప్రసంగించిన గిడుగువారు తాము ప్రతిపాదించే నూతన విధానానికి సహాయసహకారాలు అర్థిస్తూ పనిలో పనిగా వ్యావహారిక రచనలను ప్రోత్సహించమని, పాఠ్యగ్రంథాలుగా వాటిని నిర్ణయించమని ఉద్బోధించారు. వ్యావహారిక మంటే గ్రామ్యం కాదని, అవి రెండూ వేరువేరని ఆయన వివరించారు. ఆయన వాదానికి వివరణ రూపంలో నవంబరు 24 న 'గ్రామ్యశబ్ద విచారణ' మనే వ్యాసాన్ని గురజాడవారు ప్రచురించారు. గిడుగువారి ఉద్యమ ధోరణికి ఇది ఎంతో సహాయకారి అయింది.

గిడుగువారి వాదంలో సిద్ధాంతరీత్యా ముఖ్యమైన విశేషాలు నాలుగు: (1) విద్యావసతులు ఇప్పుడు మునపటిలాగా ఏ కొందరికో పరిమితంకావు కాబట్టి సామూహిక విద్యాసౌకర్యాలకు కావ్యభాష ఉపయోగించదు. ఆధునిక శాస్త్రీయ విషయబోధకు ఆధునిక భాషారూపమేగాని ప్రాచీన కవితైకభాష పనికిరాదు. అందువల్ల బోధనమాధ్యమంగా రచనామాధ్యమంగా శిష్టవ్యవహారమే ఉండాలి. (2) ప్రత్యక్ష పద్ధతి లాంటి ఆధునిక విద్యాబోధన పద్ధతులను అవలంబిస్తే పఠన పాఠనాల్లో సౌలభ్యం కలుగుతుంది. (3) 'గ్రాంథిక భాష' అనేది కొక్కొండ వేంకటరత్నము పంతులు, కందుకూరి వీరేశలింగము, వేదం వేంకటరాయశాస్త్రి గార్లవంటి మహామహులకే

పంటబట్టలేవని వారిలో వారు అన్యోన్యం నిందించుకుంటున్నప్పుడు సామాన్యులకది కొరుకుడు పడేదికాదు. ఒకనాటి భాషావిశేషం ఈనాటి వ్యవహారానికి దూరమయింది కాబట్టి సౌలభ్యదృష్టితో ప్రయోజనదృష్టితో వ్యావహారికమే ఉపాదేయం. (4) పరంపరాగతంగా చూసినా వ్యావహారికరచనాసంప్రదాయం ముఖ్యంగా వచనవాఙ్మయంలో కనిపిస్తుండగా, చిన్నయసూరి కారణంగా పూర్వ గ్రంథాలను 'పరిష్కరణ, సంస్కరణ'ల పేరిట గ్రాంథికీకరించి వికృతీకరించటం జరిగింది. ఇది మనపూర్వులకు మనమే చేసిన అపచారం. చారిత్రకంగా భాషలో మార్పురావటం సహజపరిణామం. కాబట్టి వెయ్యేళ్ళనాటి 'కావ్యభాష' నేటి శాస్త్ర బోధనకుగాని వచనరచనలకుగాని పనికిరాదు. ఈ నాలుగు సిద్ధాంతాలనూ సమర్థిస్తూ దేశ విదేశానుభవాలను గ్రహించ సారస్వతపరిస్థితులను భాషాశాస్త్రపరిశీలనలను క్రోడీకరించి ఆయన విశదీకరించేవారు. గిడుగు గురజాడలు సమకాలవిశ్వసారస్వత స్థితిగతులను పరిశీలించిన వాళ్ళు. ఆధునిక సామాజిక పరిస్థితులను సిద్ధాంతాలను పరీక్షించి గోపాలకృష్ణ గోఖలే వంటి మహనీయుల సాంఘిక బౌద్ధిక దృక్పథాలను అలవరచుకున్నవాళ్ళు. వారి ప్రతిపక్షులకు ఈ విధమైన విశాలదృక్పథంగాని ఇరుగు పొరుగుల అనుభవాలను గమనించటంగాని అలవాటులో లేదు. ఇదే తీవ్ర వాదోపవాదాలకు దారితీసింది. దృష్టి భేదాలు అనుభవ భేదాలూ ఘర్షణకు దిగేయి. మద్రాసు విశ్వవిద్యాలయం సెనేటులో తమకున్న సభ్యత్వం పురస్కరించుకొని గిడుగు గురజాడలు 'ఆధునిక వచనరచనలు' మాత్రమే పాఠ్యగ్రంథాలుగా ఉండాలనీ విద్యార్థులు సమాధాన పత్రాలను ఆధునిక శైలిలోనే రాయాలనీ ప్రతిపాదించారు. ఈ సిద్ధాంతాన్ని అంగీకరించిన మొదటితరం కవిపండితుల్లో బుర్రా శేషగిరిరావుగారు, సెట్టి లక్ష్మీనరసింహంగారు తమ శక్తిమించిన ఉత్సాహశక్తి గలవాళ్ళు. వీరిలో రెండోవారు 'గ్రీకుపురాణకథ' లనే పుస్తకాన్ని అర్ధగ్రాంథికంలో కృత్రిమ వ్యావహారికంలో రాసి వ్యావహారికోద్యమానికి అకారణసహాయంచేసి ఇబ్బందులు తెచ్చిపెట్టేరు. ఈ గ్రంథాన్ని ప్రభుత్వం స్కూల్ఫైనల్ పరీక్షకు ఉపవాచకంగా (Nondetailed Text) నియమించింది. దాంతో పండిత లోకంలో పెద్ద సంచలనం బయలుదేరింది.

§ 6.1 విశాఖపట్టణం కళాశాలకు ప్రిన్సిపాలుగా వున్న పి. టి. శ్రీనివాస అయ్యంగారు పాఠ్యగ్రంథంగా ఉండటానికి 'Indian Practial Arithmetic' అనే పుస్తకాన్ని 1911 లో వ్యావహారికంలో రాసి ప్రచురించారు. అదే సంవత్సరం ఈ గ్రంథకర్త పీఠికతోనే వేదం వేంకటాచలమయ్యగారి 'విధి లేక వైద్యుడు.' అనే పుస్తకం వ్యావహారికంలో వచ్చింది. వీటినీ, ముఖ్యంగా బుర్రాశేషగిరిరావుగా

ఉపన్యాసాలనూ, అధిక్షేపిస్తూ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు)గారు 'ఆధునిక వచన రచనా విమర్శనము' అనే పుస్తకం రాసి అందులో వ్యావహారికమంటే గ్రామ్యమేనని వ్యాకరణ శాస్త్ర రీత్యా నిరూపించటానికి ప్రయత్నించారు. ఆయేడు అచ్చయిన పుస్తకాల్లో వ్యావహారిక వాదాన్ని సమర్థిస్తూ, గ్రాంథిక వాదాన్ని తీవ్రంగా నిరసిస్తూ, సనాతన పండితులను పూర్తిగా రెచ్చగొడుతూ ఆంగ్లంలో వెలువడ్డ కరపత్రం పి. టి. శ్రీనివాసయ్యంగారి "Life or Death - A Plea for Vernaculars" అనేది. వర్తమానాంధ్ర భాషలోనే విద్యాబోధన జరగాలని వాదించటమే ఈ గ్రంథరచనకు పరమోద్దేశం. ఈ సిద్ధాంతాలను సమర్థిస్తూ ప్రచారం చేయటానికి 'ఆంధ్ర సారస్వత సంఘ' మనే పండితమండలిని విజయనగరంలో స్థాపించటం జరిగింది. విజయనగర కళాశాలాధ్యక్షులు కిడాంబి రామానుజాచార్యుల వారు దీనికి అధ్యక్షులుగాను, బుర్రా శేషగిరిరావుగారు కార్యదర్శిగాను ఎన్నికైనారు. కొన్ని సంవత్సరాలుగా వాడుకలో ఉన్నరీతిలోనే గ్రంథ రచన సాగాలని, శిష్ట వ్యవహారంలో ఉన్న భాషే ఈనాటి ప్రామాణికభాష కాబట్టి అందులోనే పఠన పాఠనాలు జరగాలని ఈ సంఘంవారు తీర్మానించారు.

పై సిద్ధాంతాలవల్ల భాషా సాహిత్యాలు అవ్యవస్థలో పడిపోతాయని, వ్యావహారిక మనేది గ్రామ్యమేనని, ఈ నూతన వాదంవల్ల ప్రాచీన సాహిత్యానికి అగౌరవ ప్రమాదాలు జరక్కుండా నిరోధించాలని ఉద్దేశపడిన పండితులు కొందరు జయంతి రామయ్య పంతులుగారి అధ్యక్షతన కాకినాడలో 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' (Telugu Academy) స్థాపించారు. వేదం వేంకటరాయశాస్త్రిగారు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, వావిలికొలను సుబ్బారావుగారు మొదలైన విద్వాంసులీ సంఘంలో సభ్యులు. తమ ఆశయ ప్రచారానికీ పూర్వసాహిత్య సేవకూ పనికి వస్తుందని అప్పుడే 'ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక' అనే పత్రికను గూడా సంఘం పేరిట ఆరంభించారు. ఈ సంఘంవారు ఆయేడు మద్రాసు పచ్చయప్ప కళాశాలలో రెండు రోజులపాటు ప్రథమసాంవత్సరికసభ నిర్వహించారు. అందులో కాళహస్తి వాస్తవ్యులు శతఘంటము వేంకటరంగశాస్త్రిగారు గ్రామ్యాన్ని ఖండిస్తూ ప్రసంగించగా, గిడుగు వేంకటరామమూర్తిగారు 'ఆంధ్ర భాషా చరిత్ర' అనే వ్యాసాన్ని పఠించి శిష్టవ్యావహారికమే ఉపాదేయమని వాదించారు. గ్రాంథిక వ్యావహారిక వివాదంమీద అనేక విద్వాంసులను ఆహ్వానించి గోష్ఠి ఏర్పాటు చెయ్యాలనే నిర్ణయం అప్పుడు తీసుకున్నారు. గిడుగు, గురజాడల వ్యాసాలమీద చర్చలు కూడా జరిగేయి. ఆ తరువాత (1911) నవంబరు 24 న కందుకూరి వీరేశలింగంగారి అధ్యక్షతన సాహిత్య పరిషత్తువారు 'గ్రామ్యాదేశ నిరసన సభ'ను జరిపేరు. అధ్యక్షులవారు

భాష 'నాగరభాష', 'గ్రామ్యం' అని రెండు విధాలుగా ఉంటుందని. 'నాగరభాష' సంస్కృతంలాగా పరిష్కృతమయింది కాబట్టి కావ్య రచనకు పూర్తిగా పనికి వస్తుందని, 'గ్రామ్య' మనేది 'హాస్యవినోదార్థము' గ్రంథాల్లో అక్కడక్కడ 'పాత్రోచిత భాష'గా మాత్రమే వాడదగిందని సెలవిచ్చారు. పూర్వకాలపు తెలుగు వ్యాకరణాలు పద్యకావ్యాలకోసం ముఖ్యంగా ఉద్దేశింప బడ్డవని. గద్యానికి చిన్నయసూరి బాలవ్యాకరణ మొక్కటే వ్యాకరణమని ఆయన అభిప్రాయపడ్డారు. వ్యావహారిక రచనలకు అనుమతిస్తే 'మాండలిక' పదజాలం కావ్యభాషలో చేరి భాషా 'పరిశుభ్రత'ను చెరుస్తుందని వారు వాదించారు (చూ.ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, 1-2, పే.151-58). జయంతి రామయ్యగారు ఉపన్యసిస్తూ వ్యావహారిక రచనల్లో 'సుబద్ధత' ఉంటుందని చెప్పటం నిజంకాదని. తెలుగు భాష నన్నయనాటికే స్థిరపడ్డదని. అందువల్ల షేక్స్పియర్ కాలంనుంచీ మారుతూ వచ్చి ఆ మహాకవి ప్రయత్న ఫలితంగా స్థిరపడ్డ ఆంగ్లభాషతో మనభాషకు పరిణామక్రమంలో పోలికేలేదని, 'గ్రామ్య' గ్రంథాలు పాఠ్యగ్రంథాలుగా పనికిరావని, వ్యావహారిక కవితను అంగీకరిస్తే మాండలికమయమైన 'విశృంఖలత' మాత్రమే బయలుదేరి కాలక్రమాన ప్రాచీన సాహిత్యం మరోప్రపమై పోతుందని వివరించారు (చూ.అదే.పే. 152-53). వేమూరి విశ్వనాథ శర్మగారు వ్యావహారిక విషయంలో తమకు మూడు విభిన్నాభిప్రాయా లున్నాయని విశదీకరించారు. సగానికి సగం అన్యదేశ్యాలతో నిండిన వ్యావహారికం సుబోధకం కాదని, ఆ పదజాలమైనా ఉద్గ్రంథ రచనకు చాలదని, వ్యావహారికం వ్యాకరణ విరుద్ధం కాబట్టి గ్రాంథిక భాషగా పనికిరాదని ఆయన మొదటి అభిప్రాయం. విసంధి పాటించడంగాని, అర్థానుస్వార శకటరేఫలను పరిహరించడంగాని అంగీకార్యం కాదనేది రెండో అభిప్రాయం. భాషాంతర పదాలను (సంస్కృతం భాషాంతరం కాదని వారి విశ్వాసం) గ్రంథ రచనలో ప్రయోగించటం సమ్మతం కాదనేది మూడో అభిప్రాయం (అదే. పే. 154). గ్రామ్య గ్రాంథిక వివాదాన్ని గురించి తమ అభిప్రాయాలు తెలుపుతూ వ్యావహారిక రచనలు పాఠ్యగ్రంథాలుగా పనికిరావని నిషేధించమని కోరుతూ ప్రభుత్వానికి ఒక వినతిపత్రం సమర్పించాలని కూడా ఆ సభలో నిర్ణయించారు. ఆ వినతి పత్రంలోని ప్రధానాంశాలివి :

(1) క్రీ. శ. 12వ శతాబ్దినాటి (? ) నన్నయనుంచి నేటి వీరేశలింగంగారి వరకూ గ్రాంథికభాష మారనేలేదు.

(2) పూర్వకవులందరూ యత్కించిద్భేదంలేని ఒకే భాషలో రాశారు. అందువల్ల గ్రాంథికభాషకు ఏకరూపత (uniformity), ప్రామాణికత ఉన్నాయి.

(3) ఆధునికాంధ్రమనే వ్యావహారిక భాషలో ప్రత్యేకసాహిత్యంలేదు.

(4) ఆధునికభాషకు వ్యాకరణంలేదు (=వ్యాకరణ సూత్రాలు లేవు).

(5) కాలక్రమాన ఈ ఆధునిక భాషకూడా రాబొయ్యే తరాల వారికి దుర్గ్రాహ్య మవుతుంది.

§ 5.2 ఈ విధంగా ఆంధ్రదేశంలోని భిన్నప్రాంతాల్లో ఉన్న కవిపండిత మేధావులందరినీ పై రెండు సంఘాలవారూ ముగ్గులోకి దింపేరు. ఈ చర్చల వేడి క్రమక్రమంగా పెరుగుతూ వచ్చింది. ఆంధ్రసాహిత్యపరిషత్తువారి ఆధ్వర్యంలో 1912 మే 15, 16 తేదీలలో చెన్నపట్టణంలో మరో సభ జరిగింది. దానికి కొమర్రాజు లక్ష్మణరావుగారు అధ్యక్షత వహించారు. పేరి కాశీనాథశాస్త్రిగారు లౌకిక వైదిక సంస్కృతాల మధ్య ఉన్నట్లే గ్రాంథిక వ్యావహారికాంధ్రాల మధ్య 'వ్యాకరణ సిద్ధ' మైన భేద ముందనీ, అధునాతన శిష్ట వ్యవహారాన్ని అంగీకరించాలనీ వాదించారు. వాద ప్రతివాదాల తరవాత పిల్లల పుస్తకాల్లో మాత్రం విసంధి అంగీకార్యమని, గ్రాంథికమే శరణ్యమని సభవారు తీర్మానించారు. అయితే ఉపయుక్తగ్రంథకరణదేశ భాషాసభవారు వి. శఠగోపాచార్యులవారిచేత, తదితరులచేత పరిష్కరింపజేసి పునర్ముద్రించిన 1856 నాటి భూగోళంలోనే విసంధి పాటింపబడింది. అందువల్ల ఈ సభవారు ఆమోదించిన నూతన సంస్కారమేమీ లేనట్లే లెక్క (చూ. గురజాడ అప్పారావుగారు, A Minute of Dissent, etc. p. 78, esp. 70). ఆ యేడు జూన్‌లో దివాన్ బహద్దర్ ఎం. ఆదినారాయణయ్యర్‌గారి పీఠికతో వేదం వేంకటరాయశాస్త్రిగారు ప్రచురించిన 'గ్రామ్యాదేశనిరసన'మనే పుస్తకం పైవాదానికి మంచి సమర్థనగ్రంథంగా వెలువడ్డది. స్కూల్ ఫైనల్ పరీక్షకు కూర్చునే విద్యార్థి ప్రాచీన నవీన పాఠ్యగ్రంథాల్లో వేటినయినా చదవవచ్చునని అంగీకరించాలని కోరుతూ, గ్రామ్య గ్రాంథిక వివాదంలో తమ విశ్వాసాలేమో వివరిస్తూ ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు అప్పటి మద్రాసు గవర్నర్ సర్ మరే హేమిక్ (Sir Murray Hammick) గారికి ఆగస్టు 7న వినతిపత్రం సమర్పించారు (చూ. ఆం. సా. ప. ప., 2.1. అనుబంధం 1). తత్ఫలితంగా స్కూల్‌ఫైనల్ బోర్డు కార్యదర్శి సెప్టెంబరు 20 తేదీన (G.O. No. 3098) విద్యార్థులు సనాతనాధునాతన పాఠ్యగ్రంథాల్లో వేటిలోనైనా పరీక్ష తీసుకొనే అవకాశం అనుగ్రహిస్తూ ఉత్తరు విచ్చారు. అప్పటి నవీన పాఠ్యగ్రంథాలు మూడు: ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రా చరిత్ర, ఆర్డెన్ తెలుగు వ్యాకరణం, సి. పి. బ్రౌన్ పాఠపుస్తకం. ఆ తరవాత సంప్రదాయ వాదుల ఒత్తిడికి లోనై విద్యార్థులు వైయక్తికంగా ఈ అవకాశం వినియోగించు

కోటానికి వీలులేదని, ఒక్కొక్క పాఠశాల ఈ రెండు రకాల పుస్తకాల్లో దేనిని చదవాలని నిర్ణయిస్తుందో అది మొత్తానికి అవే పాఠ్యగ్రంథాలుగా ఉండాలని, మొదటి ఉత్తరువు సవరిస్తూ సెప్టెంబరు 29న (G.O. 3479) మరో ఉత్తరువు జారీ అయింది. ఇది గ్రాంథిక వాదానికి మహావిజయం. దీంతో మరింత పట్టుగొని వ్యావహారిక వాదాన్ని అవహేళనచేస్తూ ఆ యేడే పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు 'గ్రామ్యవాదుల భాషావాద'మనే పుస్తకం ప్రచురించారు.

ఇది ఇలా ఉండగా, ఆంగ్లభాషాజ్ఞానమేగాని ఆంధ్రభాషాపరిచయంలేనివారంతా వ్యావహారిక వాదం సమర్థిస్తున్నారన్న అపప్రథ పోగొట్టుకోటానికి గిడుగువారు 'ప్రాసెనుసంగమ్మ' అనే అచ్చ తెలుగు ఉత్తరాన్ని వృత్తగంధి వచనంలోరాసి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలోనే ప్రచురించారు. గ్రాంథికాంధ్రం—అందునా అచ్చ తెలుగు—ఎంత దుర్గ్రాహ్యమో దురవబోధమో నిరూపించటమే ఆ రేఖా రచనలో ఉద్దేశం. ఆనాటి వైయాకరణుల్లో సర్వోత్తము లనిపించుకొన్న మహామహోపాధ్యాయులు తాతా సుబ్బరాయశాస్త్రిగారు 'ఆంధ్రభాషా సంస్కరణ'మనే వ్యాసంలో (చూ. పై రెంటికీ ఆం. సా. ప. ప., 2.3, క్రమంగా పే. 256-74, 275-85) ఈ వివాద విషయంలో తమ అభిప్రాయా లేమిటో విశదీకరించారు. ఏ భాషనైనా పూర్తిగా సంస్కరించటమనేది మానవాసాధ్యమని, సంస్కృతానికి పాణినీయుల వ్యాకరణం కూడా పూర్తిగా చాలదని, మన పూర్వులు ఆయాకాలాల్లో శిష్టప్రయోగానుసారంగా వ్యాకరణ సంస్కరణలు చేస్తూ వచ్చారని, ఆధునిక శిష్టప్రయోగాలను బట్టి తెలుగు వ్యాకరణాన్ని సంస్కరించాలని, అన్యదేశ్య పదాలను స్వీకరించకపోతే వ్యవహారహాని సంభవిస్తుందని, శకటరేఫార్ధానుస్వారాలను అక్షర సమామ్నాయం నుంచి తొలగించాలని, శాస్త్ర నిదర్శనలను ఉదాహరిస్తూ వాదించారు. వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు తమ 'ఆంధ్రభాష' (చూ. ఆం. సా. ప. ప., 2 4. 386-391) అనే వ్యాసంలో తెలుగు భాషకున్న పూర్వవ్యాకరణాలన్నీ అసంపూర్ణాలేనని, వాటి నిర్ణయాలను ఆధునికకాలంలో సవరించక పోవటం అసమంజసమని, మన పూర్వవ్యాకరణసూత్రాలే వేదవాక్యాలని భావిస్తే కావ్యప్రపంచమంతా గ్రామ్యతాదూషిత మవుతుందని, ఒకనాటి గ్రామ్యం ఈనాడు యోగ్యమవుతుందని వాదించారు.

1912 డిసెంబరు 11, 12 తేదీలలో మద్రాసు, రాజధాని కళాశాలలో వావిలికొలను సుబ్బారావుగారి అధ్యక్షత కింద 'ఆంధ్ర భాషాభివర్ధినీ సమాజం' వారు ద్వారా శేషగిరిరావుగారి ఉపన్యాసాలు ఏర్పాటు చేశారు. మొదటి రోజున ఆంగ్లం

లోను మరునాడు తెలుగులోను ఉపన్యాసాలు జరిగేయి. అనంతరం సభాధ్యక్షుడు ఖండనోపన్యాసం చేస్తూ (ఇది వారి 'ఆధునికవచనరచనావిమర్శన'మనే గ్రంథానికి సంగ్రహం) అక్షర సంఖ్యనుబట్టి చూచినా తెలుగు ఇంగ్లీషుకన్నా ఎన్నో రెట్లు అభివృద్ధి పొందిన భాష అని తెలుస్తుందని, సంధి పాటించటం అవసరమని, గ్రాంథిక భాషలో అన్యదేశ్యాలు అల్పసంఖ్యాకంగాను మాండలికాలు నిరస్యంగాను ఉన్నాయని, వ్యావహారికమనే భాషకు ప్రత్యేకించి ఒక వ్యాకరణంగాని, నిఘంటువుగాని లేనందున ప్రమాణనిర్ణయాసాధ్యమైన ఆ 'భాష' రచనకు పనికిరాదని ఆక్షేపించారు. 'గ్రామ్యవాదులు' తరచుగావాడే 'internal sandhi', 'liaision' అనే మాటలకు వారు చెప్పిన అర్థం, ఇచ్చిన ఉదాహరణలు, చేసిన విపుల విమర్శ చదివి ఆనందించదగ్గవేగాని ఒకరు చెప్పగలవి కావు.

§ 5.3 గ్రాంథిక వాదుల్లో చాలామంది జయంతి రామయ్యగారి లాగానే ఉన్నత రాజకీయోద్యోగాల్లో ఉన్నవాళ్ళే. వాళ్ళ ఒత్తిడి ఎక్కువైనందున మద్రాసు ప్రభుత్వం వ్యావహారికోపయోగాన్ని మరింత సంకుచిత పరుస్తూ 1913 జనవరి 10 న (G.O. No. 20) మరో ఉత్తరువు విడుదల చేసింది. ఒక పాఠశాలలోని అధిక సంఖ్యాకవిద్యార్థులు గ్రాంథిక వ్యావహారికాల్లో దేనివైపు మొగ్గు చూపుతారో ఆ శైలినే ఆ పాఠశాల మొత్తం అంగీకరించినట్లుగా భావించి సమాధాన పత్రాలమీద ఆ విధంగా సద్దురాయాలని పై ఉత్తరువు నిర్దేశించింది. ఇందువల్ల వ్యావహారికంలో సమాధానాలు రాయటం రాయకపోవటం అనేవి ప్రధానోపాధ్యాయుల అభిమతమీద ఆధారపడవలసి వచ్చింది. సంస్కరణ నేతి బీరకాయగా పరిణమించింది. గ్రాంథిక వాదం అధికార బలంమీద ఆధారపడి మరో విజయం సాధించింది. ఈ ప్రభుత్వాదేశానికి ప్రత్యుత్తరంగా గిడుగు వెంకట రామమూర్తిగారు ఆంగ్లభాషలో ప్రచురించిన 'A Memorandum on Modern Telugu' అనే కరపత్రం ఆటో జెస్పర్సన్ వంటి ఖండాంతరభాషాశాస్త్రజ్ఞుల ప్రశంసను కూడా సంపాదించింది. దీనికి ప్రతిగా జయంతి రామయ్యగారు ఇంగ్లీషు భాషలో 'A Defence of Literary Telugu' అనే కరపత్రం ప్రకటించారు. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి 'గ్రామ్యవాద విమర్శనము', పురాణపండా మల్లయ్యశాస్త్రిగారి 'ఆంధ్ర భాషా సంస్కరణ విమర్శనము' (ఇది తాతా సుబ్బరాయశాస్త్రిగారి వ్యాసానికి సమాధానం), మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి 'గ్రామ్యమా? గ్రాంథికమా?', పి. సూరిశాస్త్రిగారు సంకలనం చేసిన 'The Gramya controversy' అనే వ్యాసపరంపర ఈ కోవకు చెందినవే. గిడుగు వేంకట సీతాపతిగారి 'సొద్దు', గురజాడ అప్పారావుగారు మద్రాసు

విశ్వవిద్యాలయానికిచ్చిన 'ఆధునికాంధ్ర వచన రచన' అనే నివేదిక పై వారికి ప్రత్యుత్తరాలు. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు తృతీయ వార్షికోత్సవం జరుపుకున్నారు ఆ సందర్భంలో 'గ్రామ్య గ్రాంథిక వివాదం' విషయంలో పరిషన్నిర్ణయం తెల్పుకోవలసివుంది. పరిషదభిప్రాయాన్ని నిరూపించటానికి గత సంవత్సరం నియమించిన ఉపసంఘంవారి నివేదిక అప్పటికింకా పూర్తికాలేదు. నివేదిక అందే వరకూ నిర్ణయం వాయిదా వేయాలని గిడుగు గురజాడలు వాదించారుగాని ప్రయోజనం లేకపోయింది. 1912 మేనెల నాటి మద్రాసు పండితగోష్ఠి అభిప్రాయమే పరిషదభిప్రాయమనే తీర్మానం నెగ్గింది. కొంతమంది గ్రాంథికవాదుల్లోనయినా కొంత వాదశిథిలత రావటం ఈ యేడే ఆరంభమయిందనటానికి కొన్ని ఆధారాలు లభిస్తున్నాయి. సంపూరి మూర్తిరాజుగారు 'గ్రామ్యవాద విమర్శన'మనే వ్యాసంలో (చూ. ఆం. సా. ప. ప., 3.4. 137-157) వ్యావహారికవాదులు చెప్పే 'ధ్వని శాస్త్రమూ' గ్రాంథికవాదుల 'వ్యాకరణమూ' భిన్నమైనవనీ ఉభయపక్షాలవారూ రాజీపడి నవీన వ్యాకరణం రాయటం మంచిదనీ ఉద్బోధించారు. 'ఆంధ్రభాషాసంస్కారం' మనే వ్యాసంలో (చూ. ఆం. సా. ప. ప., 3.5. 183-) పప్పు మల్లికార్జునుడుగారు 'కొందరు' పద్యానికి గ్రాంథికమూ, గద్యానికి వ్యావహారికమూ మంచిదంటున్నారని, తమ వాదాన్ని సమర్థించుకోటానికి గిడుగువారు చూపిన కావ్యప్రయోగాలు కొన్నిటికి పాఠాంతరాలున్నాయని అటూ ఇటూ గాకంగా వాదించారు. కాని శిథిలత వచ్చినా తీవ్రత తగ్గలేదనటానికి 1914 సంఘటనలే తార్కాణ.

§ 5.4 1914 నాటి వాదోపవాదాలు మూడు రకాలుగా జరిగేయి : వాటిలో మొదటివి మద్రాసు విశ్వవిద్యాలయంలో దానికి సంబంధించిన సంఘాల్లో జరిగిన వాదోపవాదాలు; రెండోవి బహిరంగసభల్లో జరిగిన ఉపన్యాసాలు; మూడోవి ఆంధ్రాంగ్లభాషల్లో పత్రికల్లో జరిగిన పోరాటాలు. ఆ యేడు జరిగినంత తీవ్రంగా ముమ్మరంగా అంతకు ముందుగాని ఆ తరవాతగాని ఖండనమండనాలు జరగలేదు. మద్రాసు విశ్వవిద్యాలయంవారు ఆ సంవత్సరం 'Composition Committee' అనే సంఘం నియమించారు. అందులో మొట్టమొదట గ్రాంథికవ్యావహారికవాదులకు సమప్రాతినిధ్యముండేది. తటస్థులు కొందరు ఉండేవారు. ఇంటర్మీడియట్ పాఠ్యగ్రంథాలుగా ఉండదగిన పుస్తకాల పట్టికను జి. వెంకటరంగారావుగారు విశ్వవిద్యాలయానికి సమర్పించారు. ఆయా గ్రంథాల్లోని పదజాలాన్ని ప్రాచీనార్వాచీనాలుగా విభజించి, అర్వాచీనపదజాలాన్నే ఉపయోగించాలన్న అభిప్రాయం అందరికీ ఆమోదయోగ్యమయింది. అయితే ఆ శబ్దాల విభజన నిర్వచనల దగ్గర పేచీ

వచ్చింది. ఇంతలో ప్రాంతీయ ప్రాతినిధ్యం సరిగాలేదని ఆందోళనచేసి తరువాత మరియిద్దరు గ్రాంథికవాదులు సభ్యులయ్యేట్లు సాధించుకోగలగటంతో, సంఘాల ప్రాతినిధికమైన గ్రాంథికానికే అనుకూలనిర్ణయం జరిగింది. ఈ చర్చలు తీర్మానాలూ ఆగస్టు 2, సెప్టెంబరు 6 తేదీల్లో జరిగేయి. అధికారతీర్మానానికి వ్యతిరేకంగా వాదించిన గురజాడవారు తమ ప్రతిరేకతను సుదీర్ఘవ్యాసంలో చర్చించగా మరి ముగ్గురు ఆమోదిస్తూ సంతకాలు చేశారు. 'The Minute of Dissent to the Report of the Telugu Composition Sub-Committee' అనే ఆ ఆంగ్లవ్యాసాన్ని వావిళ్ళవారు ఆ యేడే ప్రచురించారు. ఈ రచనకు ప్రధాన హేతువు కొమర్రాజు లక్ష్మణరావుగారు రాసిన 'A Memorandum on Telugu Prose' అనే వ్యాసం. వ్యావహారిక వచన రచనా సంప్రదాయం మనకు కొన్ని శతాబ్దాలుగా ఉన్నదని రుజువుచేస్తూ గిడుగు వేంకట రామమూర్తిగారు 'నిజమయిన సంప్రదాయ' మనే చిన్న పుస్తకం రాశారు. కిడాంబి రామానుజాచార్యులుగారు కూడా మరో చిన్నపుస్తకం ఇటువంటిదే రాశారు. ఈ వ్యావహారికవాదాన్ని ప్రతిఘటించటానికి కాకినాడలో జూలై 1 తేదీన 'ఆంధ్రభాషాసంరక్షక సమాజ' మనే సంఘమొకటి ఏర్పడింది. పురాణపండా మల్లయ్యశాస్త్రులుగారు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు మొదలైన పెద్ద లిందులో సభ్యులు. వీరు గ్రాంథికభాషోద్ధరణదృష్టితో 'Modern Telugu', 'క్రొత్త తెలుఁగు—మంచి తెలుఁగు', 'పులుల దండులు—పూలదండలు' అనే కరపత్రాలు ప్రకటించారు. కూచి నరసింహంగారు 'గ్రాంథిక భాష - గ్రామ్యభాష' అనే వ్యాసాన్ని, ఉండవల్లి నాగభూషణంగారు 'వ్యావహారిక భాషాసంప్రదాయవిమర్శనము' అనే వ్యాసాన్ని ప్రచురించి ఉదతాభక్తిగా ఆంధ్ర భాషామతల్లికి సేవచేశారు.

రెండోదైన సభారంగం ఈ వివాద విషయంలోకి సామాన్యప్రజలనూ అనిశ్చితంగా ఉన్న పండితులనూ ఆకర్షించటం మొదలుపెట్టింది. వ్యావహారిక వాదులు ఎలమంచిలిలో జరిపిన విద్వత్సభలో శిష్టవ్యావహారికం గ్రామ్యం కాదనే పెముల చిన సీతారామస్వామిశాస్త్రిగారి తీర్మానం నెగ్గింది. అగస్టు 3 న పర్లాకిమిడి కళాశాలలో బి. మల్లయ్యశాస్త్రిగారి అధ్యక్షతన సమావేశమైన విద్వాంసులూ, అగస్టు 27 న ఆంధ్ర సారస్వత పరిషదధ్యక్షంలో జై. నారాయణమూర్తిగారి అధ్యక్షతన విజయనగరంలో జరిగిన వార్షికోత్సవంలో పాల్గొన్న పండితులూ పై వాదం సమర్థించారు. చారిత్రకదృక్పథంతో భాషాధ్యయనం చేయటం అవసరమని, పాఠ్యక్రమబోధనాధ్యయనాలు ఆధునిక భాషారూపంలోనే జరగాలని నారాయణమూర్తిగారు ఉపన్యసించారు. ఈ సభకు పోటీగా 28-6-1914 న కాకినాడలో

మొదలుపెట్టి, 23-8-1914 లో అన్నవరం సమావేశంతో ముగించిన గ్రాంథికవాది సభా కార్యకలాపాలు ఆ మధ్యకాలంలో 24 బహిరంగ సభలు జరిపి తమ వాద బలం నిరూపించాయి. గ్రాంథికవాదాన్ని సమర్థిస్తూ చాలామంది న్యాయవాదులూ రాజకీయోద్యోగులూ కొందరు రచయితలూ ప్రసంగించారు. ఈ సమావేశాల విషయంలో గమనార్హమైన విశేషాలు మూడు కనిపిస్తాయి : (1) సంస్కృత భాషా పాండిత్యం ఎక్కువగా ఉన్నవాళ్ళు వ్యావహారికాన్నే సమర్థించారు. (2) గంజాం పర్లాకిమిడి జిల్లాల్లో వ్యావహారిక వాదానికి బలం చేకూరగా, కృష్ణా గోదావరీ మండలాల్లో గ్రాంథిక వాదానికి మద్దతు లభించింది. (3) గ్రాంథిక వాదానికి అండగా నిలిచిన వారిలో అత్యధిక సంఖ్యాకులు 'పలుకుబడి' కలవారేగాని తెలిసినవారు కారు.

---

ఈ మహా యుద్ధానికి మూడో రంగం పత్రికలు. పత్రికలవారు స్వయంగా ఏమీ కల్పించుకోలేదు గాని ప్రజాకర్షణ గమనించి రెండు పక్షాలవారూ చేసిన విమర్శన ప్రతివిమర్శనలను, జరిపిన సభావేశాలను ప్రచురించారు. ఉభయ పక్షాల వారిలోనూ ఏ కొందరోతప్ప చాలాభాగం మారుపేర్లతో వ్యాసాలు రాశారు (చూ. హిందూ, జులై 3, 9, 10, 13, 15, 17, 20, 23, 29, 30 తేదీలు; ఆగస్టు 3, 4, 10, 12, 13 తేదీలు; ఆంధ్ర పత్రిక, జులై 13, 24, 29; ఆగస్టు 12 17 తేదీలు). ఈ వాదాలమీద లోకానికి కలిగిన సదభిమాన దురభిమానాలను రొక్కరూపంలో సంపాదించుకోదలచిన 'స్కేప్ అండ్ కంపెనీ' (కాకినాడ) వారు ఆయాసమావేశవిశేషాలు, వాదప్రతివాదాలు క్రోడీకరించి గ్రంథస్థంచేసి "Arguments for and against Modern Telugu" అనే పేర ప్రచురించారు. పత్రికాముఖాన వెలువడ్డ ఆనాటి వాదప్రవాదాల్లో ముఖ్యమైనవి 'ఒక తెలుగు హెడ్‌మాస్టరు' గారు, 'ఒక తెలుగు మెడలిస్టు' గారు, గ్రాంథికాన్ని సమర్థిస్తూ రాసినవి; ఒక 'మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్' గారిచ్చిన సమాధానాలు (చూ. హెడ్ మాస్టరుగారి చర్చలు-హిందూ, 21-7-1914, 1-9-1914, 18/19-6-14; మెడలిస్టుగారి చర్చలు - 20-7-1914; మాస్టర్ ఆఫ్ ఆర్ట్సుగారి సమాధానాలు 9-7-1914) వాద విషయం ఎలావున్నా వాదతీవ్రత విషయంలో గ్రాంథికవాదులదే పైచెయ్యి. వారి వాదంలోని ప్రధానాంశాలివి : (1) వ్యావహారిక మనేది నింద్య గ్రామ్యం. అందులో కుల, మత, వృత్తి, ప్రాంత భేదాలవల్ల ఏకరూపత లేదు. ఈ మాండలికాలవల్ల అది సులభంగా అర్థంకాదు. (2) గత వెయ్యేళ్ళుగా గ్రాంథికం మారలేదు. (3) వ్యావహారికం వ్యాకరణవిరుద్ధం కాబట్టి ప్రామాణికం కాదు. (4) వ్యావహారికంవల్ల ప్రాంతీయభేదా లేర్పడి ఆంధ్రోద్యమం దెబ్బతింటుంది

కాబట్టి అది అసంగీకార్యం. (5) ఆధునికభాషకు ప్రత్యేకంగా తనదని చెప్పుకోగల వ్యాకరణంగాని, సాహిత్యంగాని నిఘంటువుగాని లేవు. కాబట్టి అది రచనకూ పఠన పాఠనాలకూ పనికిరాదు. (6) ఆంగ్లభాషలాగా తెలుగుభాష మారుతూ ఉండేదికాదు. తెలుగులో లిఖిత వాగ్రూపాలకున్న భేదాలు ఇంగ్లీషులో వాటికున్న భేదాలకన్నా చాలా తక్కువ. (7) వెయ్యేళ్ళ క్రితమే 'స్థిరపడ్డ' తెలుగును 'కోయ, సవర, చచ్చుట' భాషల్లాంటి కేవలవ్యవహారదశకూ అటవికస్థితికీ దించరాదు. (8) గ్రాంథికాన్ని నీచస్థితికి దించేకన్నా వ్యావహారికాన్ని ఉచ్చస్థితికి తేవటం మంచిది. (9) వ్యావహారికాన్ని అంగీకరిస్తే కాలక్రమాన ప్రాచీన సాహిత్యం అర్థంకాకుండా పోవటమేగాక నశించికూడా పోతుంది. (10) ఆధునిక భాషలో ఉన్న ఒకటి రెండు పుస్తకాలకన్నా నన్నయభాషే సులభంగా అర్థమవుతుంది. కాబట్టి గ్రాంథికమే ఉపాదేయం. 'మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్' గారు వీటన్నిటికీ క్లుప్తమయిన సమాధానాలు ఇచ్చారు. మన పూర్వ వచనరచనా సంప్రదాయం వ్యావహారికమే నని, భాష కెప్పుడూ వ్యాకరణ ముంటుందని, 'శిష్టానా ముక్తౌ సూత్రాణా మభావే అనుశాసన కారిణ ఏవ వందనీయా' అన్న దండి వాక్యాన్ని స్మరించమని, భాష మారదనటం మారలేదనటం అనూహ్యమని, రాజకీయోద్యమాలకూ శాస్త్రచర్చలకూ సంబంధం లేదని — ఇలా ఎన్నో మొరపెట్టినా వినిపించుకున్న వారు లేరు — విమర్శించిన వారేగాని. ఇంత దూకుడుగా ఉద్ధృతంగా వచ్చిన గ్రాంథికవాద మహాప్రవాహం గ్రాంథిక పాఠ్యగ్రంథాలు రాగానే ఒక్క సారిగా ఎండిపోయింది। కథ కంచికి పోయిందనుకొన్నారేమో।

§ 5.5 వేదం వేంకటరాయశాస్త్రిగారి 'ఆంధ్రభాషాసర్వస్వాన్నియమ రీతి పదములు' 1915 లో వెలుగు చూశాయి. గ్రామనామాలు, మాండలికాలు, కొన్ని గ్రామ్యాలు, అస్ఫుటగ్రామ్యత్వా లయిన పదాలు, ప్రయోగవ్యవహారదూర సంపాదించిన అన్యదేశ్యాలు నిఘంటువుల కెక్కాలని, భాషాశాస్త్రం పరమపఠనీయ శాస్త్రమని, దానివల్ల శబ్దవ్యుత్పత్తులు పరిస్ఫుటంగా తెలుస్తాయని వారు అభిప్రాయపడ్డారు. 'పాశ్చాత్య కళాసంకేతాంధ్రపదాలను' అనుబంధంగా ఇవ్వాలని, తెలుగుకు నూతనాక్షర గ్రహణం పనికిరాకపోయినా అన్యదేశ్యశబ్దానువాదంలో మాత్రం భాషాంతరాపూర్వవర్ణగ్రహణం ఉపాదేయమేనని వారు విశ్వసించారు. అంటే ఆయన దృష్టిలో పెద్ద మార్పులు రావటం మొదలైనట్లు. అయితే 1915 లో గతసంవత్సర యుద్ధ చిహ్నాలు సమసిపోయాయి. 1916 నవంబరు 19 న కొవ్వూరులో జరిగిన సారస్వత మహాసభలో వర్తమాన మహాకవులు దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు,

కందుకూరి వీరేశలింగంగారు, చిలుకూరి వీరభద్రరావుగారు మొదలైన విద్వాంసులు పాల్గొన్నారు. అప్పటికి వీరేశలింగంగారి దృక్పథంలో కూడా చాలా పెద్ద మార్పు వచ్చింది. ఆ సభవారు నూరేళ్ళుగా పెద్దల వాడుకలో ఉన్న మాటలన్నీ శిష్టాలని, పూర్వ(కవి)ప్రయోగాలు లేకపోయినా దేశవ్యాప్తంగా ఉన్న రూపాలు సాధువులేనని తీర్మానించారు. 'గ్రంథాలయ సర్వస్వము'లో (సం. 2., సం. 1) 'ఆంధ్రభాష'ను గురించి వ్రాస్తూ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు ఆంధ్ర వ్యాకరణ పునారచన ఆవశ్యకమని సూచించారు. గ్రాంథికవాదానికి కంచుకోటలైన వేదం కందుకూరుల దృష్టిలో వచ్చిన మార్పు దాన్ని విఫలీకరించింది.

§ 5.6 గిడుగువారు 1919లో 'తెలుగు' పత్రికను స్థాపించి తమ ఉద్యమాన్ని యథావిధిగా సాగిస్తునే వచ్చారు. ఆ యేడు ఫిబ్రవరి 28 వ తేదీన, అంతవరకూ గ్రాంథిక వాదానికి మూల విరాట్టుగా ఉన్న వీరేశలింగంగారు వ్యావహారిక భాషా వాదాన్ని అంగీకరించి 'వర్తమానవ్యావహారికాంధ్రభాషాప్రవర్తకసమాజము' స్థాపించి తామే అధ్యక్షులై వ్యావహారికానికి వ్యాకరణగ్రంథం రాస్తామన్నారు. గ్రాంథిక వాదానికిది గొడ్డలిపెట్టయింది. ఈ సమాజానికి జయంతి గంగన్నగారు కార్యదర్శులైనారు. ఈ నూతనపరిణామాన్ని భరించలేక వేదం వేంకటరాయశాస్త్రిగారివంటి విద్వాంసులు కూడా పేరెత్తకుండా వ్యక్తి దూషణలోకి దిగవలసి వచ్చింది (చూ. ఆంధ్ర సాహిత్యపరిషద్దశమ సమావేశం, జూన్ 7, నెల్లూరు; ఆం. సా. ప. ప.). ఇది చివరి ప్రయత్నమేగాని ఫలవంతం కాలేదు; గ్రాంథికవాదం తిరుగు ముఖం పట్టింది. 1924 నుంచీ వెలువడుతున్న సాహిత్యపత్రిక 'భారతి' ఉభయపక్షాల రచనలకు సమప్రాధాన్యం ఇస్తుండేది. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు కూడా కొంత దిగి 1924 అక్టోబర్ 13వ తేదీన తమ వ్యావహారిక భాషా బహిష్కారాన్ని రద్దు చేశారు. గిడుగు పిడుగు అప్పటికీ విశ్రమించలేదు. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు సూత్రధారులుగా 1933 మార్చి 10 – 12 తేదీల్లో జరిగిన 'అభినవాంధ్ర కవిపండితసభ' చిలుకూరి నారాయణరావుగారి అధ్యక్షతన సమావేశమై ఆధునిక వ్యావహారికమే 'బోధనభాష'గా ఉండాలని తీర్మానించింది (చూ. సవ్యాంధ్ర సాహిత్య వీథులు, 3. 553 – 55). ఆ యేడు డిసెంబరులో గిడుగువారు ప్రకటించిన 'గద్య చింతామణి మొదటి భాగం' వెలువడింది. తెలుగువారి వచనరచనా సంప్రదాయం 16 – 20 శతాబ్దాల మధ్య ఏ విధంగా వికసించిందో ససాక్షికంగా నిరూపించి వ్యావహారికవాదానికి ఇతోధికప్రచారగౌరవాలను కల్పించి ఆ మహాసంకలన

గ్రంథం సనాతన పండిత మండలికి గండికొట్టింది. 1936లో 'నవ్యసాహిత్యపరిషత్తు' వెలిసింది. అభినవాంధ్రకవిపండితుల్లో వ్యావహారికవాదులందరూ ఇందులో చేరేరు. పరిషత్తు 'ప్రతిభ' అనే సాహితీ పత్రికను నడపటం మొదలుపెట్టింది. వ్యావహారిక రచనలు పుంఖానుపుంఖంగా రావటం మొదలయింది. 1937లో 'జనవాణి' అనే దినపత్రికకు సంపాదకత్వం వహించి తాపీ ధర్మారావుగారు మొటమొదటిసారిగా వ్యావహారికాన్ని పత్రికాభాష చేశారు. ఈ రచనా విధానానికి ఈ భాషావాదానికీ ప్రజామోదం లభించింది. తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారివంటి ఆధునికవిద్వత్కవులు శిష్టవ్యవహారమంటే సభాసాధుభాష అని, గద్య గేయ రచనలకు ఇది వినా మరో మార్గం లేదని, మాండలిక రూపాలు అపరిహార్యాలని వాదించారు (చూ. న. సా. పీ., 3. 553-55). గ్రాంథికం 'సరళ గ్రాంథిక, సులభ గ్రాంథికాది' అవతారాలెత్తుతూ గతానుగతికమైన అప్రతిభ రచనల్లో మిగిలిపోయింది. వ్యావహారిక భానూదయం భరించలేని దివాంధాలు విశ్వవిద్యాలయసంరక్షణలో పాఠ్యగ్రంథాల్లో తలదాచుకోవలసిన పరిస్థితి వచ్చింది. పరిణామ శీలమైన కాలం తన శక్తి నిరూపించింది. 1940 లో 'తుది విన్నపము' చేస్తూ గిడుగు వేంకట రామమూర్తిగారు ఆశించిన ప్రయోజనాలన్నీ ఇప్పటికీ పూర్తిగా నెరవేరకపోయినా ఆధునిక సాహిత్యంలో ఆధునికభాషా రూపాలకు సింహాసనం లభించితీరింది.

§ 5.7 గ్రాంథికభాషావాదులు చాలాకాలం నిశ్శబ్దంగా ఉండి 1958 – 60 లలో ఒకసారి, తిరిగి 1965 – 70లలో ఒకతూరి, అప్పుడప్పుడు, అక్కడక్కడ అనుకూల వాతావరణాల్లో తల ఎత్తుతూ దించుతూ దోబూచులాడటం ఆరంభించారు. శాస్త్రవిచారణవల్ల సాధించలేని విజయాలను, సాహితీ సృష్టివల్ల సమకూర్చుకోలేని శక్తిని, రాజకీయసాంఘికసమస్య లేవైనా అనుకూలపడినప్పుడు పునస్సంపాదించుకోదలిచినట్లు కనిపిస్తుంది. 'జయంతి' పత్రికను స్థాపించిన తొలి రోజుల్లో ఈలాటి ప్రయత్నమొకటి జరిగింది. సంపాదకులు ఒకవంక శిష్ట వ్యావహారికానికి 'ప్రజామోదం' లభించిందని చెబుతూనే రెండోవైపు దుష్టప్రయోగాలతో నిండిన ఈ సారస్వతానికి ఒక 'వ్యవస్థ' కల్పించటమే తమ లక్ష్యమని ప్రకటించారు (చూ. జయంతి, 1958 నవంబరు, సంపాదకీయము). 1959–60 సంవత్సరాల 'జయంతి' సంచికల్లో ముఖ్యంగా జువ్వాడి గౌతమరావుగారు (59 మే: వ్యవహారభాష – వ్యాకరణము; 60 ఫిబ్రవరి: పత్రికారచన – సాహిత్యము) కులప్రాతిపదికను, ప్రాంతప్రాతిపదికను తెచ్చిపెట్టి సరికొత్త పాతవాదాల ద్వారా వ్యావహారికాన్ని ధ్వంసం చేయాలని ప్రయత్నించారు. వ్యావహారికమనేది 'కృష్ణాజిల్లా బ్రాహ్మణభాష'[8] అని, తమ ప్రాంతీయభాష తమకుండగా దాన్ని విసర్జించి తాము ఈ మండలాంతర

మరాంతర భాషారూపానికి దాస్యం చేయవలసివచ్చిందని (ఎవరు నిర్బంధించారో చెప్పలేదు). తమ తమ మాండలికాల్లో రాయటానికి ఇతర జిల్లాలవారు 'జంకుతా' రని. కావ్యభాషకు వ్యాకరణం రాయటమే అసాధ్యమైనప్పుడు 'దానీ తెన్నూ లేని' వ్యావహారిక విషయం చెప్పనక్కరలేదని. వ్యావహారికం అంతా గ్రాంథికమే కాబట్టి తామేదో కొత్త భాషను వాడుతున్నామని వ్యావహారికవాదులు ఆత్మవంచన చేసుకుంటున్నారని. ఇప్పుడు శిష్టులనేవారే లేరని వాపోయారు. వారి రెండో వ్యాసంలో 'కొత్తపాత' శబ్దాలూ, 'సర్వపనుల' వంటి సలక్షణ సమాసాలూ, ప్రమాణముగా నేల గైకొనవలయును' వంటి సుసంధులు, 'భాషలోనుంచి' వంటి సాధువిభక్తులూ ఎక్కడ చూసినా కనిపిస్తాయి. నేటి వ్యావహారిక రచనలన్నీ 'విజాతీయ' రచనలని. నగర వాస్తవ్యుల రచనలేగాని పల్లెటూరి నుడికారాలున్నవి లేకపోతున్నవని. పత్రికలది (తమది తప్పు) 'బాధ్యతారహితమైన ప్రవర్తన' అని. 'సంస్కృతమును విడిచిన తెలుగుభాషలే'వని. పదబాహుళ్యము ఇంగ్లీషులో కన్న సంస్కృతములో నధిక'మని. వ్యావహారికవాదంవల్ల ప్రాచీనకావ్యాల మీద గౌరవం నశిస్తున్నదని, 'భాషావ్యవస్థ' చెడిపోతున్నదని ఆక్రోశించారు. ఈ సూత్రాలన్నిటికీ కొండముది శ్రీరామచంద్రమూర్తిగారు, జలాంతశ్చంద్రచపలగారు సవివరంగా సమాధానా లిచ్చారు (చూ. జయంతి: చర్చావేదిక, ఆగస్టు 1959). 'ఆంధ్రభాష —అవ్యవస్థ' అనే వ్యాసంలో (చూ. జయంతి. 1960 ఏప్రిల్. పే. 33 – 36) 'గాండీవి'గారు ఆయన అందని పోకడ పొందని భావాలు వెలిబుచ్చారు. పరస్పర విరుద్ధవాదాల సంగతి అటుంచి వారు కనుగొన్న చారిత్రక సత్యాలివి: శిష్ట వ్యావహారికం ప్రాచీనకవిసమ్మతం కాదు; దానికి వ్యాకరణగ్రంథం రాయనక్కర లేదు; గ్రాంథికానికే ఒక వ్యవస్థలేదు; ముద్రణం ముందు 'సుపరిష్కృతం' కావాలి; ....'ఏవో కొన్ని సామాన్యసూత్రముల నామోదించి యెల్లరు నొకేరీతి వ్యావహారికము వ్రాయునట్లు కృషిచేసిన బాగుండునేమో' (పే. 36). 'ఏవో కొన్ని సూత్రాల' కోసమే ఆరాటమైతే రావిపాటి గురుమూర్తిగారు, పారనంది రామస్వామిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి వంటి పూర్వులవీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి వంటి అర్వాచీనులవీ వ్యాకరణ గ్రంథా లున్నవని తెలియదో, అవి పనికిరావో వ్యాసకర్తలే చెప్పాలి. కాని ఈ చర్చలు ఏ కొద్దిమందినో ఆకర్షించినందువల్ల పెద్ద కోలాహలమేమీ జరగలేదు.

1965 నుంచి వచ్చిన వాదోపవాదాలు పాఠ్యపుస్తకాల 'శైలి' విషయంలో వచ్చాయి. అంతవరకూ పాఠ్యగ్రంథాలన్నీ సరళగ్రాంథికంలోనో అర్ధగ్రాంథికం

లోనో ఉంటుందేవి. ఆంధ్రప్రదేశావతరణ వల్ల తెలుగు నేర్చుకోవలసినవారు రెండు రకాలవారైనారు: తెలుగు మాతృభాషగా కలవారు, లేనివారు. ఆంధ్రేతరులు తెలుగు నేర్చుకోవటం నిత్యవ్యవహారంలో ఇబ్బంది లేకుండటానికే కాబట్టి వాళ్ళకోసం రాసిన పాఠ్యగ్రంథాల్లో వ్యావహారికమే వుండాలని భద్రిరాజు కృష్ణమూర్తిగారు వాదించి గ్రాంథిక పుస్తకం తమ చేతిమీదుగా అచ్చుకాదని అభ్యంతరం లేవదీశారు. ప్రభుత్వం ఈ విషయంలో ఏకాభిప్రాయం సాధించాలన్న సంకల్పంతో అన్ని రంగాల్లోని విద్వాంసుల కవుల ప్రతినిధులతో తిరుపతిలో ఒక సభ జరిపింది. అనేక తర్జన భర్జనలయిన తరవాత పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతన ఆ సమావేశంవారు ఒక రాజీకి వచ్చారు. మొదటి భాషగా తెలుగు నేర్చుకునే వాళ్ళ తెలుగు వాచకాల్లో సరళగ్రాంథికం ఉండాలని. రెండో భాషగా నేర్చే వాళ్లుగాని శాస్త్రవిషయాలను తెలుగులో నేర్చే తెలుగు విద్యార్థులుగాని చదివే పాఠ్యగ్రంథాల్లో శిష్ట వ్యావహారికమే వుండాలని సూత్రప్రాయంగా నిర్ణయించారు. ఈ నిర్ణయాన్ని ప్రభుత్వంవారు ఆమోదించి ఆయా శైలీ భేదాలను వివరణాత్మకంగా నిరూపించటానికి ఆ లక్ష్మీకాంతంగారినే అధ్యక్షులుచేసి ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఆ సంఘంవారు 1966 నాటికి తమపని నెరవేర్చారు. గ్రాంథికవ్యావహారికాలను శైలీభేదాలుగా గుర్తించి వీటిని వివరించే సంఘాన్ని శైలీ సంఘం (Style Committee) అని ప్రభుత్వం వ్యవహరించింది. తెలుగును రాజభాష చేయదలిచిన ప్రభుత్వానికి ఈ నిర్ణయాలు చాలా అవసరం. తెలుగును అధికార భాషగా గుర్తిస్తూ 1966లో ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం (తొమ్మిదో చట్టం) శాసించింది. ఇలా చేయటంలోని కష్టసుఖాలను పరిశీలించి సలహా యివ్వమని ప్రభుత్వంవారు అప్పటి విద్యాశాఖ కార్యదర్శి జె. పి. యల్ గ్విన్ అధ్యక్షతన మరో సంఘం నియమించింది (G. O No 3051, 1966 డిసెంబరు 28). గ్విన్ సంఘంవారు ముఖ్యంగా ఆంధ్రేతరులకు తెలుగు నేర్పటానికి, ఆ భాషను ఆధునీకరించటానికి, విశ్వవిద్యాలయాల్లో తెలుగును బోధనభాషగా చేయటానికి, పరిపాలనవ్యవహారాలకు కావలసిన సాంకేతికసహాయం అందివ్వటానికి ఒక స్వతంత్రసంస్థను నెలకొల్ప వలసిందని సూచించారు. వారే భద్రిరాజు కృష్ణమూర్తిగారి సూచనలమేరకు (పాఠ్యగ్రంథాలతో సహా) ఆ సంస్థ ప్రచురణ లన్నింటిలోనూ లక్ష్మీకాంతం సంఘంవారు నిర్దేశించిన ఆధునిక ప్రమాణ భాషనే (శిష్ట వ్యావహారికాన్నే) ఉపయోగించాలని నిర్దేశించారు (చూ. గ్విన్ కమిటీ నివేదిక, § 5.27, పే. 19). రాష్ట్రప్రభుత్వంవారు ఈ సూచనలను ఆమోదించి వాటిని అమలుపరచటానికి 'తెలుగు అకాడమి' అనే సంస్థను 1968 ఆగస్టు 6న స్థాపించారు. ఆ సంస్థవారు ఇంటర్మీడియట్ పాఠ్య

గ్రంథాలను తెలుగులో రాయిస్తున్నప్పుడు మళ్ళీ గ్రాంథికభాషావివాదం తల ఎత్తింది. సంఘాలు ఉపసంఘాలు చర్చోపచర్చలు చేసిన తరవాత శిష్ట వ్యావహారికాన్నే కొన్ని మార్పులతో వాడుకచెయ్యాలని అంగీకరించి అమలు జరిపేరు. ఆ సమయంలో ఈ వివాదం పత్రికల కెక్కినా, గ్రాంథికాన్ని పునఃప్రతిష్ఠాపించాలనే ప్రయత్నాలు ఏకముఖంగా జరుగుతున్నా, అవి నెరవేరవనే విశ్వాసం ఆశాభావం ఉన్నా. శాస్త్రీయ చర్చలవల్లగాక ఇతర మార్గాల్లో తమ వాదాన్ని నిలుపుకోవలసిన పరిస్థితి వచ్చినందుకు గ్రాంథికవాదులను చూసి జాలిపడాలి. ఈనాడు రేడియోల్లో, పత్రికల్లో, సాహిత్య రచనల్లో, సినిమాల్లో అనుక్షణం వాడుకలో వుండి ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉన్న వ్యావహారికవాదాన్ని ఏ శక్తీ ఎక్కువకాలం బహిష్కరించలేదు.

పరంపరగా సనాతనత్వానికి కంచుకోటలుగా ఉన్న విశ్వవిద్యాలయాల్లో (ముఖ్యంగా అందులోని తెలుగుశాఖల్లో) కూడా వ్యావహారిక రచనలే చేస్తున్నవారు అధికసంఖ్యలో ఉన్నారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖ Ph.D. పట్టానికి రాసే పరిశోధనవ్యాసాల్లో కూడా 1969 లో శిష్టవ్యావహారికం అంగీకరించింది. 1971 లో పురిపండా అప్పలస్వామిగారు చేసిన ప్రయత్నాల ఫలితంగా ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు అన్నిస్థాయుల్లో వ్యావహారికం ప్రవేశపెట్టే విషయం పరిశీలించటానికి ఎం. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన ఒక సంఘం నియమించారు. మెట్రిక్యులేషన్ నుంచి ఎం. ఏ. వరకు క్రమంగా ఈ వ్యావహారికం ప్రవేశపెట్టే విధానం సూచిస్తూ 1973 జూలైలో ఆ సంఘంవారు నివేదిక సమర్పించారు. 1974 నవంబరులో ఆనివేదికను ఆమోదించి ఆ తీర్మానాలు అమలు జరపటానికి మరో స్థాయీ సంఘం నియమించారు గాని అది 1975 ఏప్రిల్‌లో మొదటి సమావేశం జరిపిన తరవాత మరి సమావేశంకాలేదు. 1973 లో ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖవారు తెలుగును ద్వితీయభాషగా బోధించేటప్పుడు వ్యావహారికమే వాడాలని ఆదేశించారు (G. O. Ms. No. 384 of 27.4. 1973). తీర్మానాల దారి తీర్మానాలదే గాని ఆచరణ నత్తనడకలు నడుస్తున్నది- అసలు నడుస్తుంటే. విద్యార్థులు మాత్రం అర్థ గ్రాంథికంలో రాస్తున్నారు. కాలక్రమాన విశ్వవిద్యాలయాలు ఆమోదించినా, మానినా వ్యావహారికం చోటుచేసుకుంటుంది. ఒకటి నిజం. వ్యావహారికానికి వ్యతిరేకత తగ్గుతున్నది. గ్రాంథికానికి అనుకూలత సన్నగిల్లుతున్నది. కాలప్రవాహం ఆగనట్లే భాషా ప్రవాహమూ ఆగదు. ఆపలేరు. ఇది చరిత్ర. చరిత్ర నేర్పే పాఠం.

# 6. సిద్ధాంత చర్చ : వాదోపవాదాలు

§ 6.0 గ్రాంథికవ్యావహారికవాదాల్లోనేగాక మన భాషావిషయక, వ్యాకరణ విషయక చర్చ లన్నింటిలోనూ అనేక-అపోహలకు తావు కల్పించి అనర్థకఘర్షణ లను తెచ్చి పెట్టింది మనదేశంలో పాతుకుపోయిన సిద్ధాంతానభిజ్ఞత. వేదకాలం నుంచీ భాషా స్వరూపస్వభావాలను బహుకోణాలనుంచి పరీక్షించి సిద్ధాంతీకరించి పశ్చిమదేశ పండితులకు అంతో ఇంతో శాస్త్రదృష్టిని ప్రసాదించిన భారతదేశంలోనే సిద్ధాంతంతో ప్రమేయంలేని ఆచరణపద్ధతులు బయలుదేరేయి. భట్టీపద్ధతిలో నేర్చిన వ్యాకరణ సూత్రాలేగాని ఏ కొందరో చదివే-చదివినా అవిమర్శకంగా ఒప్ప చెప్పే-మంజూషా వాక్యపదీయాల్లోని సిద్ధాంతచర్చలు తలపుకైనా రాని స్థితిలో ఉంది మన పండితలోకం. గడిచిన రెండుమూడు వందల సంవత్సరాలుగా భాషావిషయక శాస్త్రం ఇతరదేశాల్లో ఖండాల్లో ఎన్నెన్ని క్రొత్త విషయాలను కనుక్కుందో ఎంత అభివృద్ధి సాధించిందో ఏయే శాస్త్రీయవిధానాలు అనుసరిస్తుందో ఏ ఒకరిద్దరో తప్ప పట్టించుకున్నవాళ్ళు లేరు. మాతృభాష, నాలుగు ముక్కలు సంస్కృతం (అందులో ఎక్కువభాగం అక్కిరాజు ఉమాకాంతంగారు అధిక్షేపించిన 'దూదపేద'సంస్కృతం) తప్ప ఇతర మెరగని పాండిత్యమే ఈ అనర్థాలకు మూలకారణం. ఆధునిక భాషా శాస్త్రం ఏయే మార్గాలుతొక్కి ఇప్పటి మహత్తరస్థితికి వచ్చిందో, అది రూపొం దించిన శాస్త్రీయసిద్ధాంతాలూ భాషాధ్యయనవిధానాలూ ఏవో ఇక్కడ వివరించటం సాధ్యంకాదు. కాని ప్రస్తుతచర్చకు కావలసినంతవరకు ఆధునిక భాషాశాస్త్రదృష్టి ఏమిటో స్థూలంగా వివరిస్తాను. ఇందువల్ల గ్రాంథిక వ్యావహారికవివాదాల్లో ఏది ఎందువల్ల సమంజసమో నిరూపించటం సాధ్యపడుతుంది. ఇతరభాషల పరిణామ విషయంలో కనిపించే భాషా సాధారణలక్షణాలను గూడా సందర్భానుగుణంగా క్లుప్తంగా వివరించిన తరవాత ఈ వివాద సందర్భంలో ప్రధానంగా చర్చనీయమైన అంశాలు పరిశీలిస్తాను.

## భాషాశాస్త్ర సిద్ధాంత సమన్వయం

§ 6.1 భాష దైవదత్తమైనా మనుష్యనిర్మితమైనా అది ఒక సాంఘికలక్షణం. పరస్పరం అభిప్రాయాలు తెలియజేసుకోటానికి మనుష్యజాతి ఉపయోగించే ధ్వనుల సమూహమే భాష. ఈ భాష భౌగోళిక, సాంఘిక, రాజకీయ, జాతి సంబంధి, వృత్తి సంబంధి కారణాలవల్ల అనేక విధాలుగా ఉంటుంది. పరస్పరావగాహనం, ప్రత్యేకధ్వని సంఘటన, పదస్వరూప, వాక్యనిర్మాణ విలక్షణత-మొదలైన కారణాలవల్ల భాషలు

అనేకవిధాలుగా ఉంటాయి. ఒక్కొక్క వ్యక్తి మాట్లాడేదీ భాషే; ఒక జాతి మొత్తం మాట్లాడేదీ భాషే. ఈ భాషకు ప్రధానస్వరూపం నిత్యవ్యవహారంలో ఉండే ధ్వన్యాంల సమాహారం. ఆయా ధ్వనులకు ఆ యా భాషలవారు రేఖాత్మకంగా ఏర్పరచు కొన్ని సంకేతాలను లిపి అంటారు. లిపి ద్వారా తమతమ అభిప్రాయాలకు బహుకాల జీవితాన్నీ శాశ్వతత్వాన్నీ ప్రసాదించేది సాహిత్యం. ఈ సాహిత్య స్వరూపం తనకు ప్రాణాధారమైన వాగ్రూపభాషనుబట్టి మారుతుంటుంది. అయితే లిఖితభాషలో మార్పులు రావటానికి సుదీర్ఘకాలం పడుతుంది. వాగ్రూపంలో వచ్చిన మార్పులను లిఖితరూపంలో ప్రతిబింబించని భాష కాలక్రమాన వ్యవహారదూరమవుతుంది. అయితే ప్రతిభాషకూ లిఖిత రూపంగాని సాహిత్యదశగాని ఉండకపోవచ్చు. అందుకు సాంఘిక రాజకీయాది పరిస్థితులే మూలకారణాలు. సాంఘిక రాజకీయావసరాలు మారటంతో సాహిత్యభాషలు మారనూవచ్చు; అంతరించనూ వచ్చు; లేదా కొత్తగా ఉద్భవించనూ వచ్చు. అదేవిధంగా వాగ్రూపంలో మాత్రమే ఉన్న భాషలు లిఖితరూపం పొందవచ్చు; సాహిత్యదశకు చేరవచ్చు; లేదా అంతరించిపోనూ వచ్చు. ఒక భాష వయస్సుకన్నా దాని లిఖితరూపం వయస్సు చాలా తక్కువ. ఒక భాష వాక్స్థితినుంచి లిఖితస్థితికిగాని మరో మెట్టు పైకెక్కి సాహిత్య దశకు గాని వచ్చేలోపల అనేక దశాభేదాలు పొందుతుంది; ఆ మెట్టు ఎక్కిన తరవాతకూడా మారుతూనే ఉంటుంది. అసలు 'భాష' అనేది అత్యంత విస్తృతార్థంలోనూ అతిసంకుచితార్థంలోనూ వాడుకలో ఉన్న శబ్దం. అది ఎలా ఏర్పడ్డా, మొదట 'ధాతు' దశలో ఉండి, పదదశకు వచ్చి చివరికి వాక్యదశకు పరిణమించిందనుకోవటం అపోహ. మనకు తెలిసినప్పటినుంచీ ప్రపంచంలోని ఏ భాష అయినా అనేకవాక్యాల సమాహారంగానే ఉందిగాని దానికి కేవలధాతుదశ ఏనాడూ లేదు. భాషాస్వరూపస్వభావాలనుగురించి మానవ విజ్ఞానం పెరిగిన తరవాత అర్థస్ఫురణలో ధ్వని సంఘటనలో ఉన్న సామీప్యసాదృశ్యాలనుబట్టి వ్యాకర్తలు కొన్ని మాటల సమూహం ఏదో ఒక కల్పితమైన ధాతువునుంచి ఏర్పడిందని లాఘవం కోసం నిర్ణయించుకొన్నారు. మంజూషలోని 'ప్రకృతి ప్రత్యయ విభాగో కేవలం కాల్పనికో' అన్న వాక్యానికి ఇదే అర్థం. ఇది గమనించని పండితులు ప్రాక్పశ్చిమ దేశాల్లో ఎక్కడ చూసినా ఉండేవారు; ఇప్పటికీ కొందరున్నారు. చిలుకూరి నారాయణరావుగారు తమ 'ఆంధ్రభాషా చరిత్ర'లో 'ఛింద్.కృ'అనే రెండు(సంస్కృత) ధాతువులు చేరినందున 'చెక్కు' అనే తెలుగు ధాతువు ఏర్పడిందని, అలాగే 'ఛింద్-కృ'-ల నుంచి 'చీకు' ఏర్పడిందని. ఇలా తెలుగు మాటలన్నీ సంస్కృతప్రస్త

ధాతువుల రకరకాల కలయికలవల్ల ఏర్పడ్డవని వివరించారు. ఇంగ్లీషు పదముల వారిలో కాకపోయినా 'జనని సంస్కృతంబు సకల భాషలకును' అని. తెలుగు సంస్కృతపుత్రిక అని భావించే విశ్వసించే సంప్రదాయ పండితులు అందరూ పై వారా నికి ఉపక్రమకులు పలుకుతున్నారు గాని మంజూషావాక్యాన్ని స్మరించి కేవలం కాల్ప నికమైన రెండు ధాతువులనుంచి తెలుగు మాటలు ఎలా ఏర్పడ్డాయని గ్రహించు కోలేము. ఇదే రకమైన అభిప్రాయం 18, 19 శతాబ్దాల పాశ్చాత్య భాషా వేత్తల్లో కూడా కొందరికి ఉంటుండేది. వ్యాకరణపద్ధతులనూ ప్రయోజనాన్ని గుర్తించని కొందరు ఇప్పటికీ ధాతువులు ఒకనాటి స్వతంత్రపదాలన్న దుర్భ్రమ లోనే ఉన్నారు:

"Early Students of language, who confused description with the entirely different and much harder problem of ascertaining historical origins, somehow got the notion that roots possessed mysterious qualities, especially in the way of age. Now and then one still hears the claim that roots we set up must once up on a time have been spoken as independent words. The reader need scarcely be told that this is utterly unjustified; the roots like all bound forms, are merely units of partial resemblance between words. Our analysis guarantees nothing about earlier stages of the language which we are analyzing"

— L. Bloomfield, Language, 1955, § 14 8., f. n.l.

§ 6.2 ఏ ఒక్క కులానికో వృత్తికో వర్గానికో జాతికో ప్రాంతానికో దేశానికో చెందిన వ్యక్తి తన అభిప్రాయాలను తనవారికి తెలియజెప్పుకోటానికి చేసే కొన్ని ధ్వనులనూ భాష అంటున్నాము; అలాంటి వ్యక్తులే అనేకులు ఒక ప్రాంతంలో మాట్లాడే ధ్వనులనూ భాష అంటున్నాము. భిన్న వ్యక్తుల భిన్న వర్గాల వచఃపద్ధతులను పరిశీలించినప్పుడు ఒకే వ్యక్తి ఏకసమయంలో ప్రదర్శించే భిన్నధ్వని సమాహారాన్ని వైయక్తికభాష (ideolect) అంటాం. అదే వ్యక్తి భిన్నభిన్నసమయాల్లో భిన్నసందర్భాల్లో భిన్నమానసిక సామాజికపరిస్థితుల్లో భిన్నవిషయాలను గురించి భిన్నశైలుల్లో మాట్లాడతారు. వీటన్నిటి సమాహారమే వైయక్తిక భాష. అలాంటి అనేక వైయక్తిక భాషారూపాల సమస్తరూపమే మాండలికం (dialect). ఈ మాండలికం భౌగోళిక, వర్గ భేదాలతో ప్రధానంగా రెండు రకాలు.

ఒకే వృత్తికో కులానికో చెందిన వ్యక్తుల భాషలో కొన్ని ప్రత్యేకలక్షణాలూ కొంత విలక్షణ పదజాలమూ ఉంటాయి. ఈ రకం మాండలికాన్ని వర్గ మాండలికం (class dialect) అంటారు. భౌగోళికంగా దూర ప్రాంతాల్లోనో, రాజకీయసామాజికపరిస్థితులవల్ల ఇతరప్రాంతాలవారికి కొంత దూరంగానో, ఉండే వ్యక్తుల భాషలో ఉండే విలక్షణతల మొత్తాన్ని ప్రాంతీయ మాండలికం (regional dialect) అంటారు. కొన్ని ప్రత్యేకసాంస్కృతికప్రయోజనాల కోసంగాని ప్రత్యేకావసరాల కోసంగాని ప్రయత్నపూర్వకంగా సాధారణభాషాసమష్టికి విరుద్ధంగా ఉండే కొన్ని లక్షణాలుగల భాషాభేదాన్ని విశిష్టమాండలికం (specialised dialect) అంటారు. సాహిత్యకభాష ఈ జాతికి చెందింది. జనసాంద్రతనుబట్టి, ఆచారవ్యవహారాలను బట్టి, స్థానికపరిస్థితులనుబట్టి, రాజకీయసాంఘికప్రయోజనాలనుబట్టి, విద్యాసంస్కృతులనుబట్టి, వ్యక్తిగతసాంఘికభేదాలనుబట్టి 'భాష' లో ఎన్నో రకాల వైవిధ్యాలు ఉంటూనే ఉంటాయి. ఇన్ని భేదాలున్నా సమష్టిసాధారణ లక్షణాలుకూడా ఉంటాయి. అలాటి ధ్వని సమూహాన్నే 'భాష' అంటారు.[9] ఈ సమష్టి సాధారణలక్షణాలే ఆయా భాషల్లోని ప్రామాణికరూపాలను నిరూపిస్తాయి.

§ 6.21 ప్రామాణికభాష ప్రధానంగా మూడురకాలు. రచనల్లో లిఖిత రూపంలో ఉండే భాషాభేదం సాహిత్యక ప్రామాణికం (literary standard). దైనికవాగ్వ్యవహారంలో విద్యావంతులు వాడే భాషాభేదం వ్యావహారిక ప్రామాణికం (colloquial standard). ఒక భాష వ్యవహృతమవుతున్న దేశం మొత్తంలోని ఏదో ఒక ప్రాంతంలోని విద్యావంతులు మాట్లాడే భాషాభేదం ప్రాంతీయ ప్రామాణికం (regional standard). పై మూడు రకాలకూ చెందని భాషాభేదాలనుగాని, స్థానికంగా పెద్ద మార్పులులేని సామాన్య ప్రజల భాషాభేదాన్నిగాని అప్రామాణికమని (sub-standard) వ్యవహరిస్తారు. ఇంటింటికీ గ్రామగ్రామానికీ చాలా మార్పులు పొందుతుండే తక్కువ తరగతులవారి భాషాభేదాన్ని స్థానిక మాండలికం (local standard) అనిగాని గ్రామ్యమనిగాని వ్యవహరిస్తారు. వీటన్నిటిలోనూ వైవిధ్యగతమైన భేదాలు ఉండనే ఉన్నాయి. మాండలికాల్లోని ఈ విభేదాలన్నిటినీ విస్మరించి వాటివాటి ప్రత్యేకతలను గమనించకుండా అన్నిటినీ ఏక మాండలిక మనుకొనే భ్రమవల్లనే వ్యావహారికభాష మాండలికాలతో నిండి మలినపోతుందనే దురభిప్రాయం తలెత్తింది. ఈ భేదాలు కాక ప్రతి భాషకూ వర్గావస్థలు ఉన్నాయి. వీటి పరిణామ క్రమంలోనే ప్రామాణికభాష ఏర్పడుతుంది. భిన్న ప్రాంతాల వాగ్వ్యవహారంలో ఉన్న ఒకానొక ప్రాంతీయమాండలికంనుండిగాని,

నగరాల్లో నివసించే పెద్ద తరగతుల విద్యావంతుల భాషనుంచిగాని, అనుకూల సాంఘికరాజకీయపరిస్థితుల్లో ప్రామాణికభాష ఏర్పడుతుంది. ఇన్ని విధాల భాషా భేదాల సమష్టి సాధారణ భాష. నాగరికతాసంస్కృతుల అభివృద్ధితో బాటు ఈ ప్రామాణికభాషే మాండలికదశనుంచి సాహిత్యస్థితికి అభివృద్ధమవుతుంది. కొన్ని దేశాల్లో సాహిత్యమాండలికం కాలక్రమాన సమకాలశిష్టవ్యవహారభాషకు దూరమై పోయినందువల్ల సంస్కరణయోగ్యమవుతుంది. అటువంటి సంస్కరణకు ఏ కారణం వల్లనయినా అవకాశం కలగనప్పుడు సాహిత్యక, వ్యావహారిక ప్రామాణికాలు భిన్నభాషలుగా విడివడిపోవటమైనా జరుగుతుంది; లేదా సాహిత్యకప్రామాణికం పురాతనభాషగా మృతభాషగా నిత్యోపయోగదూరమై పోవటమైనా జరుగుతుంది. (See Otto Jespersen-Language, its Nature, Origin and Development, p. 206). [10]

§ 6.22 మాండలికాలు ఏర్పడే విధానాన్ని స్థూలంగా ఊహించవచ్చు. ఒకే సాంఘికవ్యవస్థకు చెందిన వ్యక్తుల సమూహం ఒకేచోట స్థానికంగా ఉండి ఇంచు మించు ఒకే తీరున ఒకే భాషను మాట్లాడుతుండగా వారిలో ఏ ఒకరి ఉచ్చారణలోనో పద సంఘటనలోనో వచ్చిన విశేషద్భేదంతో సాన్నిహిత్యాన్నిబట్టిగాని పునరుక్తి వల్లగాని ఆ వ్యక్తితో ఎక్కువ పరిచయంగల కొందరు అనుకరించి పాటిస్తూ, మరి కొందరు పూర్వ పద్ధతిలోనే వ్యవహరిస్తూ ఉంటే స్థానిక మాండలికం ఒకటి ఏర్ప డుతున్న దన్నమాట. ఇలాటి మార్పులే ఒక ప్రాంతంలో వచ్చి మరో ప్రాంతంలో రాకపోతే కొత్తగా మార్పులు వచ్చిన ప్రదేశంలోని భాషాభేదం అప్రామాణికంగా ఉండిపోతుంది; పాత పద్ధతి ప్రామాణికంగా చెలామణీ అవు తుంటుంది. ఈ మార్పులు వచ్చింది విద్యావంతుల, పెద్ద తరగతులవారి భాషా పద్ధతిలో నయితే అది ప్రాంతీయ ప్రామాణికభాషగా పరిణమిస్తుంది. భిన్నప్రాంతాల విద్యాధికుల, అధికారుల భాషలో ఇంచుమించు ఒకే తీరు మార్పులే వస్తే వారి భాష వ్యావహారిక ప్రామాణికం అవుతుంది. సాంఘికమైన అంతస్తుల్లోని భేదాలే వ్యవహార స్థాయులను నిరూపిస్తాయి. ఈ వ్యావహారిక భాషకు లేఖాత్మకమైన ప్రతికల్పనమే లిఖితభాష. లిఖితభాషలో కూడా మాండలిక భేదాలు కనిపిస్తూనే ఉంటాయి.

§ 6.23 పద్దెనిమిదో శతాబ్దినాటి పాశ్చాత్య పండితులు సాహిత్యభాషగాని లిఖితప్రామాణికంగాని ఇతర భాషా భేదాలకన్నా పురాతనమైనవని విశ్వసించారు. అవి తార్కికంగా సలక్షణమైనవని, అజ్ఞానంవల్లనో నిర్లక్ష్యంవల్లనో సామాన్యప్రజలు

సరిగా ఉచ్చరించలేక ప్రామాణికరూపాలను భ్రష్టంచేస్తారని వారు మొదట్లో ఊహించారు. ఇదే భావం 'అపభ్రంశ భాష'లనే పేరు రావటానికీ కారణం. ఇప్పటికీ మన సనాతన పండితులు భాష చెడిపోయి కుళ్ళిపోయి ధ్వంసమై పోతున్నదని వాపోతూనే ఉన్నారు. సంఘధర్మాల్లో మార్పులు వచ్చినప్పుడల్లా ఇలాటి మాటలు వింటూనే ఉంటాము—వయసులో పెద్దవాళ్ళు చిన్నవాళ్ళు చెడిపోతున్నారని భావిస్తున్నట్లు (మన బాల్యం మనం మరిచాం కాబట్టి). భాషావేత్తలు కాలక్రమాన ప్రపంచ భాషలను తులనాత్మకంగా చరిత్రాత్మకంగా అధ్యయనం చేస్తున్నప్పుడు మాండలికాలు ప్రామాణికభాషలు భ్రష్టమైనందువల్ల ఏర్పడలేదని, ప్రామాణికభాషా భేదంలోనుంచి రాలిపోయిన అతిప్రాచీనరూపాలనేకం మాండలికాల్లో నిక్షిప్తమై వ్యవహారంలో సజీవంగా ఉన్నాయని గ్రహించారు. తత్ఫలితంగా ఆ శతాబ్ది చివరికే 'మాండలిక నిఘంటువులు' అనేకం బయలుదేరాయి. స్థానిక మాండలికాలనుంచి ప్రత్యేకచారిత్రికకారణాలవల్ల కాలక్రమాన ప్రామాణికభాషలు ఏర్పడ్డవనే రహస్యం చరిత్రాత్మకభాషాధ్యయనంవల్ల బయటపడ్డది. ఉదాహరణకు, ఇప్పటి ప్రామాణికాంగ్లభాష లండన్ నగర ప్రాంతపు స్థానికమాండలికంనుంచి ఏర్పడ్డదేగాని పూర్వకాలపు ఆంగ్లభాష చారిత్రకపరిణామంలో చెడిపోయినందువల్ల ఏర్పడలేదు. ఆధునిక ప్రామాణిక ఫ్రెంచి భాష పారిస్ నగర స్థానికమాండలికంనుంచి ఏర్పడింది. ఆధునిక ప్రామాణిక జర్మన్ భాష తూర్పు సరిహద్దు రాష్ట్రాల్లోని అధికారవాణిజ్యభాషాభేదంనుంచి ఏర్పడింది. ఇప్పటి ప్రామాణిక లిథువేనియన్ భాష అనేకస్థానికమాండలికాల్లోని సమానలక్షణాలను స్వీకరించి ఏర్పాటయింది. ఫ్లారెంటైన్ ప్రాంతంలోని వాడుక భాష ప్రాతిపదికగా నేటి ప్రామాణిక ఇటాలియన్ ఏర్పడింది. పోల్టావా-కీవ్ మాండలికాలనుంచి నేటి యుక్రేనియన్ భాష ఏర్పడింది. మాస్కో-ప్రాంతపు వాడుక భాష ప్రాతిపదికగా పాత స్లావ్ భాషా-అంశాలనూ అన్యదేశ్యాలనూ జీర్ణించుకొని నేటి ప్రామాణిక రష్యన్ భాష ఏర్పడ్డది. అదే విధంగా నేటి ఖడీబోలీహిందీ ఢిల్లీ ప్రాంత భాషా భేదంనుంచి, నేటి ప్రామాణిక వంగ భాష (చలిత్ భాష) కలకత్తా మాండలికంనుంచి, ప్రామాణికాంధ్ర భాష కోస్తామాండలికం నుంచీ ఏర్పడ్డాయి. ఇవన్నీ సాహిత్యకప్రామాణికాలు కూడాను.

§ 6.24 మాండలికవిభేదాలుగాని భాషలో సమానత్వం (levelling) గాని రావటానికి ప్రధాన కారణం జనసాంద్రత ఉత్పత్తిరేటులు, దుర్గమారణ్యాలు, మహానదులు, రాజకీయమైన సరిహద్దులు, మతజాతి విభేదాలు. వ్యక్తినుంచి వ్యక్తి

గాని, కొందరు వ్యక్తుల సమూహంనుంచి ఇతర వ్యక్తిసముదాయాన్నిగాని వేరుచేస్తాయి. రాకపోకలు, ప్రయాణసౌకర్యాలు, రాజకీయసాంస్కృతికసాంఘిక సంబంధాలూ జనసమూహాలను కలుపుతుంటాయి. భాషావిషయకంగా ఆదానప్రదానాలున్నప్పుడు అనుకోకుండా సమానత్వం వస్తుంది; లేకపోతే లేదు. బహుళంగా ఏక భాషాభాషులు నివసించేచోట స్థానికవిభేదాలు తక్కువగాను, సరిహద్దు ప్రదేశాల్లో ఎక్కువగాను ఉంటాయి (Bloomfield, Language, p. 47). ఈ మార్పులు క్రమంగా వస్తాయేగాని అకస్మాత్తుగా వచ్చేవి కావు. ప్రతివ్యక్తి తన భాషాపద్ధతిని ఇతరులనుబట్టి అనుక్షణం మార్చుకుంటూనే ఉంటాడు. తనకన్నా సాంఘికంగా పెద్ద అంతస్తులో ఉండేవారిని, విద్యావంతులనూ అనుకరిస్తూనే ఉంటాడు. అందుకు అవకాశం లేనప్పుడు మార్పులు ఎక్కువ అవుతాయి. ప్రాక్పశ్చిమ జట్లండ్ మాండలికాల్లో ఉన్న పెద్ద పెద్ద మార్పులకు పురాణకాలంనుంచీ ఆ ప్రాంతాలను వేరుచేస్తున్న నిర్మానుష్యసాంద్రారణ్యమే కారణమని వి.కె.థామ్సన్ కనుక్కొన్నాడు (Otto Jespersen, Mankind, Nation and Individual from a Linguistic Point of View, p.40) అదే విధంగా ప్రాచీనారణ్యమార్గం పొడుగునా సౌత్ సీలండ్ మాండలికాలు చీలి ఉన్నట్లు గునార్ క్నుడ్‌సన్ కనుక్కొన్నాడు (Ibid). తూర్పు న్యూగినీ ద్వీపంలోని మార్లాయ్ తీరంలో ప్రతి గ్రామానికీ ఒక మాండలికం ఉందనీ, అరుమైళ్ళ దూరంలో ఉన్న వివిధగ్రామాల ప్రజలు ఒకరొకరిని అర్థం చేసుకోలేరని గేబలెంజ్-మేయర్‌లు తమ మలనేషియన్ భాషాధ్యయనంలో రాశారు. దీనికి ప్రతిగా రాకీ పర్వతాల దగ్గర ఏటేటా జరిపే సంతలవల్ల ప్రాక్పశ్చిమప్రాంతాల ప్రజలు కొన్ని సంవత్సరాల్లోనే అన్యోన్యావగాహనం సంపాదించ గలిగేవారని యెస్పర్సన్ పేర్కొన్నాడు (Mankind, Nation, etc., pp. 46-47). ఈపరిణామాలన్నీ కాలక్రమాన జరిగినవే. నిజానికి రెండు మాండలికాల మధ్య కచ్చితమైన సరిహద్దులుండవు (Bloomfield, Language' p. 341). ప్రాంతీయ విభేదాలవల్ల భాషలో వచ్చే చీలికలు అవి సమసిపోగానే తామూ తొలగిపోతాయి. ఫ్రెంచి భాషకు 19వ శతాబ్దంలో గీసిన మాండలిక పదపటాలను (dialect maps) చూస్తే ప్రాక్పశ్చిమ మాండలికాలు ఉండేవని తెలుస్తుంది. ఫ్రెంచ్, ప్రొవిన్షాల్ అనే మధ్యయుగాల భాషాసాంస్కృతిక విభేదాలను ఈ వ్యవహారభేదరేఖలు (isoglosses) నిరూపిస్తాయి (Ibid., p. 342).

§ 6.25 అనేక భాషలను పరిశీలించగా మాండలిక భేదాలు రాజకీయ సరి

పరిస్థితులకనుగుణంగా మారుతున్నట్లు తెలుస్తుంది. రాజకీయకారణాలవల్ల వేరుపడ్డ ప్రజలు తమ తమ ప్రాంతీయభేదాలను భాషలో ప్రతిబింబిస్తారు. మధ్యమ జర్మన్ భాష విషయంలో చూస్తాం. రైన్ నదికి ప్రాక్పశ్చిమాలుగా ఏర్పడిన వ్యవహారభేదక రేఖలు పూర్వకాలపు బెర్గ్, జూలిచ్ రాజ్యాల హద్దుల వెంబడిగా పోతాయి (Ibid., p. 343-44). మాండలిక వృత్తిపదకోశాల్లో భద్రిరాజు కృష్ణమూర్తిగారు బూదరాజు రాధాకృష్ణ గీసిన మాండలికపదపటాలు ప్రాంతీయసంఘటన సూచించే రాజకీయహద్దుల వెంటనే మాండలికాల హద్దులు కూడా ఉన్నట్లు నిరూపిస్తాయి (చూ. మొదటి సంపుటం. పే. 46-52, 65-97; రెండో సంపుటం. పే. 14-21, 57-81). రాజకీయ బలం, వాణిజ్య వ్యాపారాల అభివృద్ధి, రవాణాసౌకర్యాలు, వార్తాసౌకర్యాలు, మహానగరాలు కేంద్రీకృతమైన చోటు రాకపోకలు కారణంగా ప్రజలకు సాన్నిహిత్యం కల్పించటమే కాక భాషాస్వరూపంలో కూడా సాదృశ్యం సాధిస్తుంది (Otto Jespersen, Mankind, etc., pp. 73-74):

"One may mention great political unifications, and be it observed, unifications on the line of nationality, greater mutual intercourse owing to the vast development of the means of communication—railways, tramways, motors, steam ships, telephones, wireless, etc., cheap books and newspapers in the interests of literary communism—finally the enormous growth of many great cities which attract a population from out side."

రాజకీయంగా శక్తిమంతమైన ప్రాంతం తన సంస్కృతినీ అధికారాన్నీ భాషారూపంలో కూడా ప్రదర్శిస్తుంది. అధికారభాషగా, సాహిత్య భాషగా, బోధన భాషగా పరిణమించటానికి చారిత్రకపరిస్థితులు అనుకూలించిన భాషారూపమే కాలగమనంలో ప్రామాణికభాషగా పర్యవసిస్తుంది; ఇతర మాండలికాలు దీంట్లో లీనమవుతాయి; లేదా అముఖ్యమై అప్రామాణికాలవుతాయి.

"The modern standard languages, which prevail within the bounds of an entire nation, supersede the provincial types. These standard languages become more and more uniform as time goes on. In most instances they have grown out of the provincial type that prevailed in the upper class of the urban centre that became

the capital of the unified nation .."

—Blomfield, Language, pp. 482–483.

§ 6.26 దేశాన్నంతటిని అనుకూలించే ఒక ప్రదేశం యాత్రాస్థలంగానో రాజధానిగానో రాజకీయకేంద్రంగానో వాణిజ్యకేంద్రంగానో విద్యాకేంద్రంగానో మారినప్పుడు చుట్టుప్రక్కల జనం అక్కడికి రాకపోకలు సాగిస్తారు. పట్టణవాసుల మాట్లాడటం నాగరికతాలక్షణంగా పరిగణించి అలవాటు చేసుకుంటారు. ఒక వయస్సువాళ్ళు, వృత్తివాళ్ళు, ప్రాంతంవాళ్ళు తమలో తాము ఎక్కువగా ప్రసంగిస్తారు. చదువులో ఐశ్వర్యంలో అధికారంలో సాంఘికస్థితిగతుల్లో తమకన్న పెద్దలని తాము భావించినవారి భాషారీతులు అనుకరిస్తారు. ఇది మానవనైజం. 'యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే' గతానుగతికమైన లోకంలో నాగరభాష ప్రామాణిక భాషగా మారుతుంది. కాలగతిలో మాండలికవ్యవహర్తలు ప్రామాణికాన్నే భాషించటం మొదలు పెడతారు. క్రమిష్ఠకమైన ఈ పరిణామం మెల్లగా జరుగుతుంది. స్థానిక మాండలికాలను మరుగుపెట్టిన తర్వాతనే ఈ ప్రామాణికం ఇతర ప్రాంతీయ భాషారూపాలను తన పరిధిలోకి తెచ్చుకుంటుంది (Ibid., p. 485):

"The standard language influences the surrounding dialects at wider range and more pervasively as it gains in prestige. It affects especially provincial centres and, through them, their satellite dialects....The standard language takes speakers from the provincial and local dialects. The humblest people make no pretense at acquiring it, but with the spread of prosperity and education, it becomes familiar to a larger and larger stratum ...Both in the gradual assimilation of lesser dialects and in the conversion of individuals and families to standard speech, the result is usally imperfect and is to be described as substandard or, in the favorable case, as provincially colored standard . The evaluation of these types varies in different countries ..."

కాలం గడిచేకొద్దీ సాంకేతిక పదాలవంటి విశిష్టశబ్దాలను మాత్రమే ప్రామాణిక

భాష మాండలికాలనుంచి గ్రహిస్తుంది. ఏది ప్రామాణికమో ఏది కాదో గుర్తించే ప్రమాణాలు దేశాని కొకవిధంగా ఉంటాయి. ఈ వైవిధ్యాలు ఎన్ని రకాలుగా ఉన్నా ప్రామాణికభాషలో మొత్తంమీద ఒక విధమైన ఏకరూపత ఉంటుంది. ఒకే జాతికి చెందిన బహుజనానికి ఫోటోలుతీసి ఒకరి బొమ్మ మీద మరొకరి బొమ్మ పడేలాగు ముద్రిస్తే జాతిసాధారణస్వరూపం కనిపిస్తుందన్నట్లుగా, భిన్నమాండలికపరిశీలన వల్ల భాషా సామాన్యస్వరూపాన్ని గుర్తించవచ్చు (Jespersen, Mankind, etc. p. 76):

"...The standard language may be compared with the composite photographs which Galton was the first to think of and to apply to a scientific purpose. If you photograph a number of people (of the same or similar race) one over another on the same plate, you get a picture in which all small divergences from the normal vanish, and the type is shown in its purity ..."

§ 6.27 ప్రామాణికభాషలు అస్తిత్వరాజకీయస్వాతంత్ర్యాలవల్ల ఏర్పడతాయనటానికి నార్వే అనుభవాలు మహోత్తమోదాహరణాలు. కొన్ని శతాబ్దాలపాటు డేనిష్ పాలనలో ఉన్న నార్వేలో ప్రామాణిక డేనిష్ భాషే అధికారభాషగా బోధనభాషగా ఉండేది. ఆ రెండు భాషలకూ దగ్గరిపోలికలున్నందువల్ల డేనిష్ బోధనభాషగా ఉండటానికి అంత ఇబ్బంది కలగలేదట. తరవాత నార్వే పండితులు నార్వీజియన్ భాషకు అనుకూలంగా ఉండేటట్లు డేనిష్ భాషను ఆస్లో మాండలికంతో కలగలుపు చేసి మన పరిగ్రాంథికంలాంటి 'రిక్స్‌మాల్' (రాజ్యభాష) అనే కృత్రిమభాషను అధికారభాషగా సృష్టించుకున్నారు. కొద్దిమంది విద్యావంతుల కిది మాతృభాషగా పరిణమించింది. కాని 1813 లో నార్వే స్వతంత్రదేశం కాగానే దేశభాషామాండలికాల ప్రభావంవల్ల రిక్స్‌మాల్‌లో చాలా మార్పులు వచ్చాయి. 1840 లో ఐవర్ ఆసెన్ (Ivor Aasen) అనే భాషావేత్త నార్వీజియన్ మాండలికాల ప్రాతిపదికగా 'లేండ్స్‌మాల్' (దేశభాష) అనే ప్రామాణికభాషను రూపొందించాడు. తొలిదశలో ఈ రెండు భాషలవారికీ గ్రాంథిక వ్యావహారికవాదుల మధ్యలాగ తీవ్రంగా అభిప్రాయభేదాలుండేవి. ఇప్పుడు లేండ్స్‌మాల్ ప్రామాణిక వ్యవహారభాషగా సాహిత్యభాషగా పరిణమిస్తున్నది (చూ. విసోగ్రదోవ్. వెరెటిన్: భాష, భాషోత్పత్తి, పే. 91, 92; Bloomfield, Language, pp. 483-84). ప్రస్తుతానికి ఇవి రెండూ

బోధనభాషలుగా ఉన్నాయి. నార్వే దేశీయుడైన భాషా శాస్త్రజ్ఞుడు స్టెన్‌కొనొ మధ్య యుగాలనాటి ఓల్డ్ నార్స్ మాండలికంనుంచి ఏర్పడ్డ వ్యావహారిక నార్వీజియన్‌కూ డేనిష్ భాషకూ పోలికలు చాలా తక్కువనీ. బ్యోర్నసన్ (Bjoernsen), ఇబ్సెన్ (Ibsen) వంటి మహాకవులూ రచయితలూ లేండ్స్‌మాల్ అనే ఆధునిక ప్రామాణిక నార్వీజియన్ భాషను శాశ్వత స్థితికి తెచ్చారనీ చెబుతాడు. క్నూద్ క్నూద్సెన్ (Knud Knudsen. 1812-95) వంటి విద్వాంసులు డేనిష్ భాషాధోరణులను ఇక్కడి మన గిడుగువారిలాగా బహుతీవ్రంగా ప్రతిఘటించినందువల్లనే ఈనాటికి నార్వీజియన్ ప్రజాభాష ప్రామాణికభాష అయిందని ఆయన తెలియజేస్తున్నాడు (Sten Konow. Language Reform in Norway, వ్యాస సంగ్రహము, పే. 27, 28). రాతలో పలుకులో సహజంగా ఉండే భాష జాతీయసంస్కృతి నాగరికతలను అభివృద్ధి చేయటంలో ప్రజలందరినీ భాగస్వాములు చేస్తుందని స్టెన్‌కొనొ వాదిస్తాడు (Ibid, p. 29):

A natural national language, spoken and written, means that the whole people can join in the work of developing national civilization and reap its fruits, as homely and intelligible".

నేటి సంస్కృతైకప్రియులైన గ్రాంథికవాదులు గమనించవలసిన విషయమిది. ఇలాంటి సందర్భాలు మరికొన్ని లేకపోలేదు. టర్కిష్ దాస్యంనుంచి విముక్తులైన సెర్బో-క్రోషియన్ ప్రజలకు ప్రామాణికభాష అంటూ ఒకటి ఉండేది కాదు. వుక్ స్టెపనొవిచ్ కరజిచ్ (Vuk-Stepanovich Karadjich. 1787_1864) అనే విద్వాంసుడు తన మాండలికానికి ఒక వ్యాకరణగ్రంథం రాసి, ఒక నిఘంటువును తయారుచేసి స్వతంత్రమైన తన జాతికి ప్రామాణికభాష ఏర్పాటుచేశాడు. ఇప్పుడింకా సజీవంగా ఉన్న వ్యక్తులు చూస్తుండగానే బహుమాండలికాలనుంచి లిథువేనియన్ ప్రామాణికభాష ఏర్పడ్డది (Bloomfield, Language, p. 483). అంటే రాజకీయ స్వాతంత్ర్యం, ఆర్థికాభివృద్ధి అనేవి ప్రామాణికభాష లేర్పడటానికి ప్రధానకారణా లన్నమాట.

§ 6.28 ప్రామాణిక భాష లేర్పడే సమయంలో వాటి పురోగతిని అరికట్టే సంప్రదాయదాస్యధోరణులు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. నిన్న మొన్నటి వరకూ ఎక్కువగాను, ఇప్పుడిప్పుడు కొంచెం తక్కువగానూ మన తెలుగు దేశంలోని తెలుగు

పండితులే తెలుగును చిన్నచూపు చూస్తుండటం ఆచారంగా ఉంది. సంస్కృతంలాగా వ్యుత్పత్తులు గాని- వ్యాకరణాలుగాని, మహత్తర సాహిత్యంగాని లేని తెలుగు అధోగతిలో ఉండటూనే ఆయా విధాల తెలుగు అభివృద్ధి పొందటానికి ఎప్పుడూ కష్టపడుతుండటం జాతిలక్షణమైపోయింది. 'సంస్కృతపండితుని దృష్టి తెనుంగునం దంత ఘనంబుగాఁ బోవనేర'దని నిన్న మొన్నటి గుప్తార్థప్రకాశికాకారు లన్నారు. తెలుగుపేర్లను సంస్కృతీకరించిన వాళ్ళను మన మెరుగుదుము. తెలుగులో ఉన్న ఒకటి రెండు దిక్కుమాలిన వ్యాకరణ గ్రంథాలను సంస్కరిద్దామంటే ఒకవైపు ప్రతిఘటిస్తూనే రెండోవైపు సంస్కృతంలో ఉన్నన్ని వ్యాకరణ గ్రంథాలు మనకు లేవని చప్పరించటం పరిపాటి అయిపోయింది. ఈ దాస్యబుద్ధి ఇతరత్రా లేకపోలేదు. నిన్నమొన్నటివరకూ ఫిన్లండ్ లోని ఏకైక సారస్వతభాష విదేశీయమైన స్వీడిష్ భాష. పై తరగతులవారు స్వీడిష్‌లోనే వ్యవహరించేవాళ్ళు. సామాన్య ప్రజలు మాట్లాడే ఫిన్నిష్ దేశభాషను 'గ్రామ్యభాష'గా పరిగణించేవారు (Otto Jespersen' Mankind, etc., p. 72). లేటిన్ గ్రీక్ భాషాదాస్యంలో నిన్నమొన్నటివరకూ ఆధునిక యూరపియన్‌భాషలు ఇదే దుస్థితినీ, అమర్యాదనూ పొందేయి. యూరపియన్ వ్యాకర్తలు లాటిన్ గ్రీకు భాషల వ్యాకరణాలు సతార్కికంగా ఉంటాయని ఆ వ్యాకరణ సూత్రాలకు విరుద్ధమైన దేశభాషారూపాలన్నీ 'అలాక్షణికా'లని విశ్వసించేవారు. చిత్రమేమంటే, ఆ దివ్యభాషల్లోకూడా అతార్కికాపలక్షణాలు చాలా ఉన్నాయని వీరు గమనించకపోవటం. మన మాతృభాషలోనో మనకు అత్యంతపరిచితమైన భాషలోనో ఉన్న అతార్కికలక్షణాలను మనం సాధారణంగా గుర్తించలేము. అలాంటి లక్షణాలే అపరిచితభాషలో ఉంటే, ముఖ్యంగా కొంత వయస్సు వచ్చిన తరవాత కొత్తగా నేర్చుకున్న భాషల్లో ఉంటే, తక్షణం వాటిని మనం గుర్తించగలం. ఇంగ్లీషు స్పెలింగులలో 'silent letters' ఉంటాయని ఆక్షేపించే మనమే 'వ్రాత' లోని వకారం ఇంగ్లీషు 'write' లోని వకారం వంటిదేనని గమనించం. శాస్త్రీయపద్ధతిలో భాషాధ్యయనం చేసేవారు అన్ని భాషలనూ ఒకే తార్కిక దృష్టితో చూస్తారు. నిజానికి పూర్తిగా తార్కికమైన భాష ఒకటైనా ప్రపంచంలో ఈనాటికి లేదు. అంతమాత్రాన ప్రతిభాషా అతార్కిక లక్షణాలతోనే ఉందని కూడా చెప్పలేము. భాషకు ఒక తీరు తార్కికత కొన్ని లక్షణాల్లో ఉంటే, మరికొన్నింటిలో తర్క విరుద్ధ లక్షణాలు కనిపిస్తాయి. అంతే కాదు. పాశ్చాత్యులు తర్కం అనేది లేటిన్ వ్యాకరణం అందించిన ఆలోచనావిధానం మాత్రమే. ప్రపంచంలో ఇప్పటికి

ఏ ఒక్క భాషా పూర్తిగా సతార్కికం కాదని తెలుసుకున్న తరవాతనే కొందరు విద్వాంసులు 'కల్పితభాష'లను (artificial languages) సృష్టించారు. 19, 20 శతాబ్దాల్లో. దురదృష్టవశాత్తూ అందరికీ ఆ భాషలు సతార్కిక మనిపించనందున వాటిని మళ్ళీ మళ్ళీ సవరించవలసి వచ్చింది. ప్రపంచంలోని సహజ భాషలన్నీ (natural languages) కాలగతిలో మారినట్లు, మారుతున్నట్లుగానే ఈ సహజ భాషలు కూడా అతార్కికమార్గాల్లో—అందులోనూ అందరూ మహా విద్యావంతులే ప్రయత్నపూర్వకంగా వ్యవహరిస్తుండగానే—మారిపోయాయి. ఆ మారటానికి దశాబ్దాలు కూడా పట్టలేదు! అంటే మార్పు సృష్టిసహజమని, పరమసత్యం నిరూపించగల సతార్కికభాషాప్రమాణం మనకు ఈనాటికీ అందుబాటులో లేదని గుర్తించాలి. దిగువ ఇచ్చిన పట్టిక ఇందుకు నిదర్శనాలు కల్పిస్తుంది.

| సంవత్సరం | కల్పిత భాష పేరు | కల్పించిన వారి పేరు |
|---|---|---|
| 1863 | Universal-Sprache | Pirro |
| 1880 | Volapuk | John Martin Schleyer |
| 1887 | Esperanto | Dr. Ludwig L. Zamenhof |
| 1890 | Mundolingue | Julius Lott |
| c1900 | Latinesce | Henderson |
| c1900 | Romanal | Michal |
| c1900 | Occidental | de Wahl |
| c1900 | Inter Lingua | International Auxilary Language Association |
| 1907 | Ido | bouis de Beaufont |
| 1908 | Latino sine Flexione | Guiseppe Piano |
| 1928 | Novial | Otto Jespersen |
| 1928 | Oberi Okaime | (First reported by R. G. Adams) |

ఇంతకన్నా చిత్రమయిన విషయం ఒక్క వోలపక్ భాషను పన్నెండు సంవత్సరాలలో ఆరుసార్లు సంస్కరించవలసి వచ్చింది!

| సంవత్సరం | పరిష్కృత నామధేయం | పరిష్కర్త పేరు |
|---|---|---|
| 1887 | Bopal | St. de Maux |
| 1888 | Spelin | Bauer |
| 1893 | Balta | Dormoy |
| 1893 | Dil | Fieweger |
| 1896 | Veltparl | Von Armin |
| 1899 | Langue Bleue | Bollock |

ఎనభై లక్షల మంది విద్యార్థులు మాట్లాడుతున్నారనే ప్రతిష్ఠ సంపాదించిన ఎస్పెరాంటోను R.de Saussure పరిష్కరించి దానికి 'Esperantido' అనే పేరు పెట్టేడు. ఇంకా ఇలాటివి ఎన్ని పుడతాయో, పుట్టి ఎన్నినాళ్ల మారిపోతాయో చెప్పలేరు. కోట్ల సంఖ్యలో ఉన్న అక్షరాస్యనిరక్షరాస్యులు మాట్లాడే భాషలు, రాసే భాషలు మారవని ఎవరైనా అంటే ఆ మాటకున్న విలువ ఎంతో ఊహించవచ్చు.

§ 6.30 పై వాస్తవిక విషయాలను గమనించినప్పుడు తర్కప్రమాణం భాషా విషయంలో పనికిరాదని భాష అనేది తర్కాతీతమని (alogical) గ్రహించవలసి ఉంటుంది. సంప్రదాయదాస్యంవల్ల భాషావిషయకంగా కలిగిన మరో దుర్గుణం జనక భాషనో దేవభాషనో తాను పూజిస్తూ, తన విద్యకూ, తాను ఉపయోగించే పద జాలానికీ మూలాధారంగా ఉంచి, తాను బాగా నేర్చిన మరో భాషమీదా ఆ భాషా భాషులమీదా తనకున్న గౌరవాన్ని పురస్కరించుకొని దేశభాష పనికిరానిదనీ, తప్పులతడక అనీ భావించటం, వాదించటం. ఈ విధానాన్ని హాకెట్ 'ద్విభాషా పరిశుద్ధతావాదం' (bilingual purism) అంటాడు (C.F. Hockett, A Course in Modern Linguistics, p.419). సంస్కృతవ్యాకరణసంప్రదాయాను గుణంగా మన వ్యాకరణాన్ని సవరించటమో పునర్నిర్మించటమో చేసే పెద్దలకు ఉన్న దౌర్బల్యమిదే. దేశ్యశబ్దాలకు సంస్కృత వ్యుత్పత్తులను కల్పిస్తూ అవి దేశ్యములని తెలిసిన తరవాత వ్యసనపడే మన పండితుల చేతలు ఉదాహరణలు. ఈ సంస్కారదృష్టి భాషాసహజలక్షణాలను విస్మరించి మనల్ని నిష్ఫలప్రయోజనాలకు మప్పుతుంది. ఈ ఆదర్శం నిలిచేదీ కాదు ఫలించగలిగేదీ కాదు. ప్రామాణికత కోసం హాకెట్ మాటలను దిగువ ఉదాహరిస్తాను:

"Detailed knowledge of a language which is a constant source of learned and technical loans, combined with a kind of veneration of the culture of its speakers, can produce a type of "bilingual purism." When classical erudition was at its height in England, a word like *Sociology*, the first half from Latin and the second half from Greek, would have eyed askance.... it should be recognised that the bilingual purist pursues an unattainable ideal. His knowledge of the languages from which English has borrowed is inevitably limited. He objects to *morpheme* because he knows Greek; he passes in silence over the equally "objectionable" expression ***The Mississippi River*** because he does not know that, when literally translated from Fox, this expression becomes ***The Big River River***" — **Ibid.**

ఈ వాక్యభావం మిశ్రసమాసాలని, వైరిసమాసాలని పేర్లు పెట్టి భాషాపారిశుద్ధ్యం పరిరక్షించదలుచుకొన్న మన దేశవాళీ పండితులకుకూడా అన్వయిస్తుంది. ఇది అసాధ్యమైన ఆదర్శ మనటానికి నేటి మన భాషా పరిస్థితికన్నా మరి వేరు నిదర్శనాలు అనవసరం. మన వ్యాకర్తల విధినిషేధాలవల్ల భాషలోని పరిణామా లేవీ ఆగిపోలేదు గాని, ఇది తప్పు- అది ఒప్పు- అనే విభ్రమ చదువుకున్నవాళ్ళనుంచి కూడా ఇంకా పూర్తిగా పోలేదు. మనకు నిత్యం వినిపించే భాషారూపం కన్నా ఎన్నడూ వినిపించనిదే ప్రామాణికమన్న సిద్ధాంతం, చివరకు లిపినిబట్టి ఉచ్చరించటం ప్రతి ఒక్క పదాన్నీ అతి ప్రమాణీకరించటం (hyper-standardization), లాంటి దురవస్థలకు దారితీస్తున్నాయి. 'చెప్పాను' అని అకారమధ్యంగా మాట్లాడటం భేదము - ద్రేహము-ద్రేల్పు - భీభత్సము - ఆనందభాష్పాలు వంటి రూపాలను సృష్టించటం ఈలాంటివే.

"The doctrine of our grammarians has had very little effect in the way of banishing or establishing specific speech forms, but it has set up among literate people the notion that forms which one has not heard may be "better" than those which one actually hears or speaks. The only danger that threatens

the native speaker of a standard language is artificiality: if he is snobbish, priggish, or timid he may fill his speech (at least, when he is on his good behavior) with spelling pronunciations and grotesque "correct forms"—Bloomfield, Language, p. 498.

§ 6.31 అధునాతనదేశభాషలకు సంప్రదాయపండితులవల్ల కలిగిన మరో దుర్గతి లిపికీ ధ్వనులకూ భేదం లేనట్లు భావించగలగటం। చిన్నయసూరి ప్రతి సంధి సూత్రాలని చెప్పిన వాటిలో సగానికిపైగా లేఖనసంప్రదాయానికి సంబంధించినవేగాని ఉచ్చారణకు సంబంధించినవి కావు. ఉచ్చారణలో ఉన్న పదాదియవలను నిషేధిస్తూ 'యకారంబును వుపూ వొవోలును తెలుఁగు మాటలకు మొదట లేవు' అనటం రాతలో ఉండగూడదని చెప్పటానికి ఉపలక్షణ మన్నమాట. నిజానికి రాతలోగాని పలుకులోగాని పదాదిని లేని 'ఙ ఞ ణ ళ' ల విషయం ఆయన ప్రస్తావించనే లేదు. అనుస్వారమనేది ఉచ్చారణసంబంధి. దానికి లిపిసంజ్ఞ ఒక్కటే ఉన్నా రెండు తీరుల ఉచ్చారణ వుండేది: (1) పూర్వాచ్చుకు ఆనునాసిక్యంగా, (2) వర్గ పంచమాక్షరానికి ప్రత్యామ్నాయంగా. రెండో తీరులో అది ప్రకరణాన్ని బట్టి 'ఙ ఞ ణ న మ' లు గా ఉచ్చరిత మవుతుంది. పై వాటిలోని మొదటి తీరు శతాబ్దాల క్రితమే వాడుకలోనుంచి తొలగిపోయింది. రెండోది మాత్రం ఇప్పటికీ నిలిచింది. సూరి 'హ్రస్వము మీఁది ఖండబిందువునకుఁ బూర్ణంబగు' అంటే లేఖనంలో అరసున్న ఉన్నచోట్ల నిండుసున్న వస్తుందని గదా అర్థం? ఇది లిపినిబట్టి వచ్చిన మార్పు కాదే మరి? ఆయనకు సమకాలంలోగాని, అంతకు నాలుగువందల సంవత్సరాల క్రితంగాని ఉచ్చారణలో అనునాసికాచ్చు లేదే మరి। ఇది లిపినిబట్టి ఉచ్చారణ నిర్ణయం చేయటం కాదా? ఉచ్చారణలో ఉన్న అనేక ధ్వనులకు రేఖాసంకేతాలు లేవు—అంటే లిపిలేదు. చాలా వర్ణాలకు (phonemes)—అంటే అర్థభేదం కలిగించగల అనేకధ్వనులకు—మాత్రం లేఖనంలో ప్రతిరూపాలున్నాయి. భాషలోని ధ్వనులకూ లిపికీ అన్వేకసంబంధం (one-to-one correspondence) లేదని అర్థం. ఉచ్చారణలో ధ్వనులకు వచ్చిన మార్పులను ఉచ్చారణ పరిణామంగా భావించాలిగాని లిపి పరిణామం అనుకోరాదు. ఇంత అతార్కికత పండితలోకంలోనే ఉండగా దేశభాష సతార్కికం కాదని ఈసడించుకోవట మెందుకో? [11]

§ 6.32 భాషలో ఇది తప్పని ఇది ఒప్పని నిర్ణయించే తొందరపాటు. అది ప్రామాణికత్వం పొందటానికి అడ్డంకిగా ఉంటుంది. ఈ తప్పొప్పుల విషయంలో

ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు ఆ భాషాభాషుల సహజవ్యవహారమే ప్రమాణ మంటారు. తర్కవాదానికి తప్పొప్పులతో సంబంధంలేదు. తార్కికంగా ఆలోచించి తప్పు చేయవచ్చు. అతార్కికంగా ఒప్పు చేయవచ్చు. 'Shall,will' శబ్దాల ఉపయోగవిషయంలో. 'It's I,It's me' అనే వాక్యాల విషయంలో ఏది తప్పో ఏది ఒప్పో ఆంగ్ల వైయాకరణులు ఏకగ్రీవంగా నిర్ణయించలేకపోతున్నారు. కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, వేదం వేంకటరాయశాస్త్రిగారి వంటి మహావిద్వాంసులను అనేకశబ్దరూపాల విషయంలో తప్పొప్పులు తేలక విచారించుకున్నారు. బహుకాలం శాస్త్రచర్చలు చేసినందువల్ల కలిగే ప్రయోజనంకన్న కాలమే నిర్ణయించటానికి వదిలిపెట్టినందువల్ల కలిగే ఫలితమే ప్రశాంతకరమైనది. అన్ని భాషలకీ ఇలాంటి ద్వంద్వ ప్రయోగాలు వస్తూనే వుంటాయి. సమకాలిక పండితుల, పండిత పరిషత్తుల అనుమోదం ఉన్నా లేకపోయినా, తర్కవాదం గెలిచినా ఓడినా ఇందులో ఒకటి ఆమోదయోగ్యం కావటమో, రెండూ సమప్రాధాన్యంతో వ్యవహృతం కావటమో జరుగుతుంది. 'ప్రభావి, సమిష్టి' వంటి శబ్దాల విషయంలో పదకొండో శతాబ్దినుంచి చర్చలు జరిగినా రెండూ నిలిచాయి. 'యువ్వని' వంటివి లాక్షణిక కవిప్రయోగాల కెక్కాయి. వ్యవహారబలమే ప్రామాణికత్వానికి నిదర్శనంగాని పండితపరిషత్తుల తర్కవాదోపవాదాలు కావు (Otto Jespersen, The Philosophy of Grammar, p. 338): [12]

It is a natural consequence of the complexity on the one hand of the phenomena of life which have to be expressed, and on the other hand of the linguistic means available to express them, that conflicts of various kind are bound to occur, in which the speaker has to make a choice – grammarians indulge in disputes as to which form or expression is "correct" ...the question is settled practically by the speaking community, sometimes under protest from the Lindley Murrays and Academies of the time, who very often prefer logical consistency to ease and naturalness."

§ 6.33 తప్పొప్పుల సంగతి చర్చించిన భాషావేత్తల్లో ఆటో యెస్పర్సన్ (1895) ముఖ్యుడు. ఆయన చెప్పిన ఏది తప్పో ఏది ఒప్పో నిర్ణయించటానికి మూడు ముఖ్య పద్ధతులున్నాయి:(i)సాహిత్యకచారిత్రకపద్ధతి (literary-historical

method): పురాతన రూపాలను పూర్వకవి ప్రయోగాలను ప్రామాణికంగా పరిగణించి సాధుత్వాసాధుత్వ నిర్ణయం చేయటం. ఇందువల్ల పరిణామక్రమంలో ఏర్పడ్డ ఆధునికరూపాలన్నీ అసాధువు లవుతాయి. భాషాస్వరూపనిర్ణేతలుగా కవులకు అపారాధికారం లభిస్తుంది. ఈ మార్గాన్ని గ్రిమ్, రిచ్‌క్విస్ట్ వంటి వాళ్ళు అనుసరించారు; (ii) సహజపరిణామపద్ధతి (natural-historical method): ఈ మార్గంలో భాషలు వివిధపరిణామదశల్లో ఏయే స్థితుల్లో ఏ రూపాలతో ఉంటే ఆ స్థితిలో ఆ రూపాలే సాధువులని అంగీకరించటం. ఇది అరాజక సిద్ధాంతం (anarchic theory) అని యెస్పర్సన్ ఆక్షేపించాడు; (iii) తార్కిక లౌకికపద్ధతి (rational-commonsense method): ఈ మార్గాన నేల విడిచి సాము చేయవలసివుంటుంది. ఇది అవకాశవాదిసిద్ధాంత మంటాడు యెస్పర్సన్. ఈ పద్ధతులను పేర్కొన్న నోరీనే, టెగ్నర్ సిద్ధాంతాలకు అనుకూలంగా తన సిద్ధాంతాలను వదులుకున్నాడు. భాషాసౌలభ్యసిద్ధాంతాన్ని పురస్కరించుకొని సులభతరంగా ఉచ్చరించటానికి వీలయ్యే రూపమే సాధు వంటాడు టెగ్నర్. ఈ సిద్ధాంతం ఉపయోగితకేగాని సాధుత్వానికి నిరూపకం కాదంటాడు సెతాలా. యెస్పర్సన్ సాధుత్వనిర్ణయానికి ఏడు ప్రమాణా లున్నాయంటాడు: 1. పండితప్రమాణం 2. భౌగోళికప్రమాణం 3. సాహిత్యప్రమాణం 4. కులీనప్రమాణం (aristocratic standard) 5. ప్రజాస్వామికప్రమాణం 6. తర్కప్రమాణం 7. ఆలంకారిక ప్రమాణం (aesthetic standard). వీటిలో ఒక్కొక్కదాన్నే పరీక్షిద్దాం.

అకాదమీలవంటి పండిత పరిషత్తుల ప్రామాణ్యంవల్ల భాషలో సాధుత్వ నిర్ణయం జరుగుతుందనిగాని జరిగిందనిగాని చెప్పలేము. ఇంగ్లండులో ఏ అకాదమీ లేకపోయినా నిర్ణయం జరుగుతునే ఉంది. ఫ్రెంచ్ అకాదమీ చేసిన నిర్ణయాలు దిక్కులేకుండా పోయాయి. ప్రామాణికులైన పండితులే అకాదమీలలో ఉంటారనీ చెప్పలేం. ప్రామాణికు లయినా అధికారపూర్వకంగా చెప్పిందాన్ని లోకులు అంగీకరించి పాటిస్తారనీ చెప్పలేము. ఏదో ఒక ప్రాంతీయమాండలికమే ప్రామాణిక భాషగా పరిణమించినప్పుడు తప్ప భౌగోళికప్రమాణం నిలవదు. సాహిత్యగ్రంథాలను 'వ్రాతప్రతు'లనూ ఎప్పటికప్పుడు పరిష్కరిస్తుండటం ప్రపంచమంతటా జరుగుతూనే ఉంది. పురాతనలిఖిత ప్రతులు ఖిలం కాకుండా దొరకటమూ అసాధ్యమే. దొరికిన కొన్ని లిఖితరూపాలనుబట్టి అనేక వ్యవహృతరూపాల సాధుత్వం నిర్ణయించటంగాని, పూర్వసాహిత్యగ్రంథాలను యథాతథంగా పునర్నిర్మించటంగాని జరిగే పనికాదు. మహామేధావులైన రచయితలందరూ నిర్దుష్టంగా రాయగలరన్న

వివర్శనలు లేవు. సామాన్యులు కులీనులను అనుకరించటం సాంఘికధర్మమయినా విద్యాబుద్ధులు లేని కేవలకులీనత్వం అనుకరణీయం కాదు. జనసామాన్యంలో అత్యధిక సంఖ్యాకులు మాట్లాడే రూపమే వ్యాకరణరీత్యా సాధువనే వాదాన్ని భాషావేత్తలనేకులు ఆమోదిస్తున్నారు: [13]

"The sole standard of correctness is custom and the common usage of the community. What is grammatically correct is what is accepted by the great body of those who speak a language."

—Sayce in his "Introduction to the Science of Language." 2.333.

"Whatever is in general use in a language is for that very reason grammatically correct."

— Henry Sweet, New English Grammer, § 12.

తర్కప్రమాణం ఆలోచనాపద్ధతి నిర్ణయిస్తుందేగాని భాషాస్వరూపం నిరూపించదు. పైగా భాష మనస్తత్వనిరూపకమేగాని పరమసత్యనిరూపకం గాదు. తర్కంగా భాసించేది (ముఖ్యంగా పాశ్చాత్యుల విషయంలో) లేటిన్ వ్యాకరణమర్యాదేగాని అన్యంకాదు. భాష తర్కాతీతమే గాని అతార్కికమూ కాదు సతార్కికమూ కాదు. భాషాశాస్త్రజ్ఞులెవరూ ఈ ప్రమాణాన్ని అంగీకరించరు (O. Jespersen. Mankind, etc., p. 14):

Most linguists are against any attempt to apply a logical standard to language. Language, they say, is psychology, not logic; or 'language is neither logical nor illogical, but a-logical' ....In many cases what gives itself out as logic, is not logic at all, but Latin grammar disguised."

ఆలంకారిక ప్రమాణమనేది కేవలం వ్యక్తి నిష్ఠమైన సౌందర్యదృష్టి. సుందర వస్తువులన్నీ నిర్దుష్ట వస్తువులయితే పెద్దపులి, నాగుబాము వంటివే ప్రామాణికాలన్నీ. కాళిదాసు చెప్పినా 'యత్రాకృతి స్తత్ర గుణా భవంతి' అనేది సార్వకాలిక సార్వజనీన సత్యమేమీ కాదు. అంతఃకరణ ప్రవృత్తులు మహర్షులకూ నియంతలకూ

ప్రమాణాలేమోగాని జనసాధారణానికి కాదు. అందువల్ల పై వాటిలో అయినా ప్రమాణమే అత్యంతంగా ఉపాదేయ మనిపిస్తుంది.

"Our definition of 'that which is linguistically correct' is therefore 'that which is demanded by the particular linguistic community to which one belongs'. What is at variance with this is linguistically incorrect" (Ibid., p. 123).

§ 6.34 ఒక్కొక్క భాషాచరిత్రను అధ్యయనం చేస్తుంటే కేవలం వ్యాకరణ దృష్టితో చూసినప్పుడు అపభ్రంశాల చరిత్రనే చదువుతున్నా మనిపిస్తుంది — మార్పులన్నీ అపభ్రంశాలే అయితే.

"The history of language, when looked at from the purely grammatical point of view, is little other than the history of corruptions" - Lounsbury as quoted by Jespersen, Mankind, etc., p. 139.

సంఘధర్మాలు మారినట్లే భాషాప్రమాణాలు కూడా దేశకాల పరిస్థితులను అనుగుణంగా మారిపోతుంటాయి. సరిగ్గా ఇదే కారణంవల్ల భాషాచరిత్రకారు లెప్పుడూ తప్పొప్పుల సంగతి పట్టించుకోలేదు. పైగా భాషలో ఇది తప్పని, అది ఒప్పని చెప్పదగింది ఏమీలేదనే నిర్ణయానికి వచ్చారు (Ibid.):

"It was precisely this fact, that which was considered a bad mistake in one century, is recognised in the next century as absolutely correct, that, as already mentioned, was the most important reason why linguistic historians were so disinclined to concern themselves with questions of 'right' or 'wrong' in language, and managed even to come to the conclusion that from a scientific point of view there was nothing in language which could be called correct or incorrect."

§ 6.35 ప్రామాణిక భాష నిర్ణయానికి సాధుత్వాసాధుత్వ చర్చలకూ సంబంధం లేదు. వ్యవహారవ్యాప్తిలో ఉన్న రూపం ప్రామాణికం – భాషా శాస్త్రజ్ఞుల

దృష్టిలో అదే సాధువు. అప్రామాణిక రూపాలే (అంటే స్థానిక మాండలిక రూపాల వంటివే) తత్కాలంలో అసాధువులు. మరో చారిత్రకదశలో ఒకనాటి అప్రామాణిక రూపాలకు ప్రామాణికత్వం సంభవిస్తే ఆ కాలంలో అవే ప్రామాణికాలు. నేటి ప్రామాణికరూపాలు తరవాతి కాలంలో వ్యవహారదూరమైతే ('పాతబడ్డ' మాటలయితే) అప్పుడవి అప్రామాణికా లవుతాయి. ఒక్కో సందర్భంలో వృత్తిరీత్యా గ్రామగ్రామానికీ తిరిగే భట్రాజులు, నాటకాల కంపెనీలవాళ్ళు, అలాటి ఇతరులూ విభిన్నమాండలికాలనుంచి ఏక ప్రామాణికభాష ఉద్భవించటానికి తోడ్పడ్డ నిదర్శనలు లేకపోలేదు. మధ్యయుగాల్లో కథనం వృత్తిగా పెట్టుకున్నవాళ్ళు (saga-men) లిఖితవ్యవహృతరూపాలు రెంటిలోనూ సాధారణప్రామాణికభాషను సాధించారు ఐర్లండులో (Ibid. p. 53):

"In the middle ages there was a common language .. in Ireland evloved in great part under the influence of the professional saga-men or story-tellers ('fili'). Moreover, it may be remarked, this common language was not only written, but spoken."

కొన్ని సందర్భాల్లో పర్యటనలుచేసే నాటక కంపెనీలవాళ్ళు తాము రాయించుకున్న నాటకభాషలో ప్రదర్శనయోగ్యంగాని అనేక ఉచ్చారణలను దుష్ప్రయోగాలనూ సంస్కరించుకోవటం జర్మన్ భాషలో కద్దు. ఈ విధంగా వ్యవహారబలం సంతరించుకొన్న జర్మన్ నాటకభాషను సర్వోత్తమభాషారూపంగా పరమప్రామాణికంగా పరిగణించేవారు. గెథేవంటి మహాకవులు కూడా ఈ భాషా సంస్కరణ కిచ్చిన గౌరవాదరాలను పరిశీలిస్తే సాహితీపరుల్లోకూడా వ్యవహారబలానికి ఎంత ప్రాముఖ్యముందో వ్యావహారికరూపాలకు ఎంత ప్రామాణ్యముందో గ్రహించవచ్చు (Ibid p. 56):

"In many passages of Gothe's conversations with Eckermann one may see the importance attached in literary circles to the fact, that this or that pronunciation is unsuitable to the stage. The same point of view is found in Palleske, for example, and quite recently more scientifically expressed in Seio's book on German pronunciation. 'Theatre – German' ('Bunendeutsch') is widely identified with the best German."

ఇందువల్ల సాహిత్యప్రమాణమే సాధుతాసాధుతలను నిర్ణయిస్తుందనుకోవటం ఎంత ప్రామాదికమో తెలుస్తుంది. సమకాలికశిష్టవ్యవహారాన్ని అనుకరించటం మంచిదని ఆ వ్యవహారమే సాధువని మహాభాష్యకారుడు పతంజలి అభిప్రాయపడ్డాడు :

"అనుకరణం హి శిష్టస్య సాధు భవతి. అశిష్టా ప్రతిషిద్ధస్య వా నైవ తద్దోషాయ వా నాభ్యుదయాయ. యథా లౌకిక వైదికేషు."

—చూ. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, "ప్రాకృత గ్రంథ కర్తలూ-ప్రజాపేనానూ," వ్యాస సంగ్రహం, పే. 176.

వ్యాకరణాలు అంగీకరించినా లోకవ్యవహారదూరమైనవి ప్రయోగసాధువులు కావని కుమారిలభట్టు 'తంత్రవార్తికం'లో స్పష్టంగా చెప్పేడు:

"లోకే తు సర్వభాషాభి ర్దా వ్యాకరణా దృతే
సిధ్యంతి వ్యవహారేణ కావ్యాది ష్వ ప్యసంశయమ్"....
న చ లక్షణ మస్తీతి ప్రయోక్తవ్య మలౌకికమ్"—అదే. పే. 179

అంతే కాదు. కవులే భాషాస్వరూపనిర్ణేత లనుకోవటంకూడా భ్రాంతిమూలకమైన దురభిప్రాయమే. ఒక మహాకవి ప్రయోగించినంత మాత్రాన అసాధు రూపం సాధువు కాదు. 'మహాకవి ప్రయోగత్వాత్ సాధుః' అనే మాటల్లోని మొదటి దాంట్లో సవర్ణ దీర్ఘాదులు లేకపోయినా సాధుత్వం వచ్చిపడదు. మహామేధావులు కూడా చిన్న చిన్న పొరపాట్లు చేయవచ్చు. 'ప్రమాదో ధీమతా మపి.' కాళిదాసాదుల్లోను అపప్రయోగాలుండవచ్చు. ఆయా రూపాల ప్రామాణ్యాన్నిగాని సాధుత్వాన్నిగాని నిర్ణయించటానికి ఇతరప్రమాణాలనుకూడా పరిశీలించాలేగాని ఏకైకవిశ్వాసం సాధుతానిర్ణాయకం కాదు (O Jespersen, Mankind. etc., p. 104):

"It is no proof that an expression is correct that it is found in a great writer. Even the greatest genuises can make mistakes, even Homer takes a nap now and then, even the Sun has spots — but whether or not they are spots, we must decide for ourselves by means of other criteria."

అయితే అనేకమహాకవికావ్యాలనుంచి వ్యావహారికప్రయోగాలను ఎందు కిచ్చినట్లు అనే ప్రశ్న రావచ్చు. రెండు మూడు ప్రయోజనాల నుద్దేశించి ఇలా చేశాను:

(1) వ్యవహారబలం కవి ప్రతిభావ్యుత్పత్తులను మించిందని నిరూపించటం కోసం; (2) 'సలక్షణ'భాష తామే రాయలేని మహాకవులు ప్రామాణికులని ఇంకా భావించే వారు ఆ భ్రాంతిని పోగొట్టుకోవటం మంచిదని నిర్దేశించటం కోసం; (3) ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎంతటివారు చేసినా, భాషా పరిణామక్రమం వారితో దోబూచు లాడుతుంటుంది కాబట్టి ప్రయత్నపూర్వకంగా లోకవిరుద్ధభాషను ఉపయోగించ టానికి బదులు ఆధునిక ప్రామాణికభాషలోనే రాయటం మంచిదని నచ్చచెప్పటం కోసం. ఈ కారణాలచేతనే భాషాశాస్త్రజ్ఞు లెవరూ సాహిత్యకభాషకు ఆధిక్యంగాని వ్యావహారికానికి తక్కువతనంగాని కల్పించరు; సమదృష్టితోనే చూస్తారు. మంచి చెడ్డల, తప్పొప్పుల నిర్ణయం సాంఘికపరిస్థితులవల్ల వచ్చేదేగాని భాషామూలక మయింది కాదు. భాషలోని సమస్తవిధాల రూపాలనూ సమప్రాధాన్యంతోనే చూస్తారు. ఏయే లక్ష్యానికి ఏది లక్షణమో, ఆ లక్షణ స్వరూప మేమిటో, అందుకు కారణ మేమిటో, వర్ణించి సరిపెట్టుకుంటారు (Bloomfield, Language, p. 22).

§ 6.36 ఉచ్చరితభాషకు లిఖితభాష ప్రతిబింబంగా మాత్రమే ఉండటం సహజమే కాని లిఖితభాష కాలక్రమాన వ్యవహృతభాషకు దూరమై పోతుంటుంది. ఉచ్చారణలో వచ్చిన మార్పులన్నీ వచ్చినంత త్వరగానూ లేఖనంలో ప్రతిబింబించవు. అందువల్ల లిఖితభాషను అప్పుడప్పుడు సంస్కరించకపోతే అది వ్యవహృత భాషనుంచి వేరుపడిపోతుంది. లిఖితభాష సారస్వతమాండలికాన్ని ప్రతిబింబించి నంతగా వ్యావహారికాన్ని ప్రతిఫలించదు. కేవలవ్యవహారంలో ఉన్నన్ని మాండలిక రూపాలు లిఖితభాషలో కనిపించవు. అంటే అసలుండవని కాదు. పూర్వప్రకరణంలో సాహిత్యంలోనుంచి మాండలికపదాలను ఉద్ధరించి చూపేను. అయితే మాండలిక పదాల శాతం తక్కువ. రాణకెక్కిన ఒక ప్రాంతంలోని మాండలికాలు ఇతర ప్రాంతాల లిఖితభాషలో భాగం కాగానే ఆ ప్రాంతాలవారు కూడా వాటిని వాడటం మొదలు పెడతారు. భిన్న మాండలిక పదాలు ఈవిధంగా పర్యాయోపయోగంలోకి వస్తాయి. ఇవే 'పర్యాయ పదా'లని లాక్షణికులు వ్యవహరించేవి—రూపవైవిధ్యం భాషలో కనిపించటానికి ఇవే కారణం. ఇది గ్రహించక వ్యావహారికవచనులవల్ల రూపవైవిధ్యం రూపబాహుళ్యం వచ్చి భాష అగమ్యగోచర మవుతుందని గ్రాంథిక వాదులు గగ్గోలు పెట్టేరు. అయితే వారు ప్రామాణికమని అంగీకరించే 'గ్రాంథిక భాష'లోకూడా ఈ వైవిధ్యం కనిపిస్తూనే ఉందిగాని 'అతిపరిచయం' వల్ల వా రది గమనించినట్లు లేదు. కింది వాక్యాలు పరిశీలించండి:

"చింతా సుందరరామశాస్త్రి అనే ఆయన 'సంస్కృతాంధ్రశబ్దరూపరహస్యము'

అనే పుస్తకం 1877 లో మచిలీపట్టణంలో అచ్చువేయించారు. ఈయన కాలం నాటికే అప్పుడే గ్రాంథికం పాతుకపోయింది. కనుక ఈ పుస్తకంలో కేవలం గ్రాంథిక రూపాలే ఇచ్చారు. ఈ గ్రంథంలో రూపాంతరాలు గల శబ్దాల జాబితా అకారాదిగా ఇచ్చారు. రూపాంతరాలు గల శబ్దాలు సంస్కృతంలోనూ తెలుగులోనూ కలిసి 3630 ఉన్నాయి. వీటిలో తెలుగు శబ్దాలు 1374. నేను లెక్కపెట్టిన ప్రకారం తపసీళ్ళు తెలియచేస్తాను. రెండు రూపాలుగల శబ్దాలు 1054, మూడు రూపాలుగల శబ్దాలు 208, నాలుగు 66, అయిదు 19, ఆరు 11, ఏడు 5, ఎనిమిది 2, పది 3, పదకొండు రూపాలుగల శబ్దం 'ఎవరు', పద్నాలుగు రూపాలుగల శబ్దం 'చూరకత్తి', పదహారు కలది 'ఒకడు', ఇరవై రెండు కలది 'ఎవరై', ముప్ఫయి కలది 'ఒకరు'. యాభై రెండు కలది 'ఒకరై'. సంస్కృతంలో పదిహేను రూపాలకి మించిన శబ్దం ఒక్కటయినా ఈ పుస్తకంలో లేదు."

—చూ. చేకుమళ్ళ కామేశ్వరరావుగారు, వాడుక భాష: రచనకి కొన్ని నియమాలు, పే. 22. అవో దీపిక.

గ్రాంథికవ్యావహారికాల్లో వాడుకలో ఉన్న పర్యాయపదాల పట్టిక నొకదాన్ని గురజాడ అప్పారావుగారిచ్చారు. 'స్త్రీ'కి వాడుకలో 7 మాటలుంటే గ్రంథాల్లో 130 పర్యాయపదా లున్నాయి. అలాగే 'చక్కదనానికి' వాడుకలో 11 గ్రంథాల్లో 91, 'మన్మథునికి' వాడుకలో 1 గ్రంథాల్లో 88, 'ప్రేమ'కు వాడుకలో 10 గ్రంథాల్లో 71, 'వేశ్య'కు వాడుకలో 6 గ్రంథాల్లో 50, 'చావు'కు వాడుకలో 5 గ్రంథాల్లో 79, 'యుద్ధానికి' వాడుకలో 7 గ్రంథాల్లో 42, 'పిడుగుకి' వాడుకలో 5 గ్రంథాల్లో 56, 'మోహానికి' వాడుకలో 14 గ్రంథాల్లో 44 పర్యాయపదా లున్నాయి. అలాగే 'అచ్చ తెలుగు'లో 'మించు'కు 97, 'వ్యాపించు'కు 90, 'ఎక్కువ'కు 6, 'చిన్న'కు 82, దుఃఖానికి' 84, 'సంతోషానికి' 33 (జగద్ధర్మంలో గూడా ఇవే పాళ్ళేమో!), 'కోపానికి' 58, 'శత్రుత్వానికి' 27, 'గర్వానికి' 59, 'బాగుపడటానికి' 56 పర్యాయపదాలు గ్రాంథికభాషలో ఉన్నాయి(Minute of Dissent...pp 68-69). ఇవన్నీ భిన్నకాలాల్లో భిన్నమాండలికాలనుంచి ప్రామాణికభాషలో చేరిన పదాలే. వ్యావహారికరచనల్లోకన్నా గ్రాంథికరచనల్లోనే కొన్ని పదాలకు ఎక్కువ సంఖ్యలోను కొన్నిటికి తక్కువగాను పర్యాయపదా లుండవచ్చు. కాని వీటివల్ల గ్రాంథికానికి రాని 'అవ్యవస్థ' వ్యావహారికానికి రాదు. లిఖితభాష లన్నిటిలోనూ పర్యాయపదాల సంఖ్య అత్యధికంగానే ఉంటుంది. ఇందువల్ల ఒక భాషలోని పదజాలం, (వ్యాకరణం) ప్రయోగవైవిధ్యం పెరిగి మొత్తంమీద భాష అభివృద్ధమవుతుందేగాని చెడిపోదు. అంతేకాక భిన్నమాండలికాల సమాహారానికి ఒకే ఒక లిఖిత భాష ఏర్పడుతుంది.

ఇది మంచిదే. లిఖిత జర్మన్ భాష ఈ విధంగానే బహుమాండలికాలనుంచి బహు కాలక్రమపరిణామంవల్ల ఏర్పడ్డది. మొదట ఇది ఒక మధ్య జర్మన్ మాండలికం నుంచి ఏర్పడ్డది. చారిత్రకకారణాలవల్ల ఇది హైజర్మన్ మాండలికప్రాంతంలోను, లో జర్మన్ మాండలికప్రాంతంలోని అనేకభాగాల్లోను వాడుకలోకి వచ్చింది.

"Written German had a long and gradual development. It was originally based on a Middle German dialect. By historical accident its use spread over most of the Middle and High German dialect areas and over a large part of the Low German dialects...Thus there came about a remarkable degree of uniformity in written language over a large area."

—H. A. Gleason, An Introduction to Descriptive Linguistics, p. 320.

సారస్వత డచ్ భాష భిన్నకాలాల్లో భిన్నమాండలికాలమీద ఆధారపడి ఏర్పడింది. 13, 14 శతాబ్దాల్లో ఫ్లెమిష్‌మీద, 14, 15 శతాబ్దుల్లో బ్రబంట్‌మీద, 16, 17 శతాబ్దుల్లో డచ్‌మీద ఆధారపడి సారస్వత డచ్ భాష ఏర్పడింది. ఈ పరిణామంలో వాడుకలోని సంప్రదాయాలకు దగ్గరగా లేఖనమూ లేఖనపద్ధతులకు దగ్గరగా వ్యవహారమూ అన్యోన్యంగా ఇచ్చిపుచ్చుకోలు పద్ధతుల్లో ఉండేవి. అంటే ఈ సారస్వత భాషాస్వరూపాన్ని గడచిన ఆరు శతాబ్దాల్లో మూడుసార్లు సంస్కరించారన్నమాట (చూ. వి. వినోగ్రదోవ్, వై. దెషెరీవ్: భాష, భాషాభివృద్ధి, పే. 79). ఈ రకంగా సంస్కరణ జరగనప్పుడు లిఖితసారస్వతభాష వ్యవహారంనుంచి తొలగిపోతుంది. సరికొత్త సారస్వతభాషలు వ్యవహారాధారంగా మొలకెత్తుతాయి. 16 వ శతాబ్దంలో లాటిన్ మయమైన సారస్వతభాషను నిష్క్రమింపచేసి ఆధునికసాహిత్యక ఇటాలియన్ తలెత్తింది. మహాకవి డాంటే రాసిన 'Divina Commedia' అనే మహాకావ్యం సజీవవ్యావహారికభాషాప్రాతిపదికమీద, ముఖ్యంగా ఫ్లారెంటిన్ మాండలికం ఆధారంగా ఏర్పడ్డ సారస్వతభాషలో ఆదికావ్యం (అదే. పే. 77). ఆ రచనే నూతన లిఖిత భాషాభివృద్ధికి ఎంతో సహాయపడింది. అనాటినుంచీ టస్కన్ మాండలికం సారస్వతభాషను ప్రభావితం చేస్తూనే వుంది. పెట్రార్క్, బొకాసియో వంటి తరవాతి మహారచయితలు కూడా టస్కన్లో రాసినందువల్ల, కొంతకాలం ఆ ప్రాంతమే ఆ ద్వీపకల్ప మంతటికీ విజ్ఞానకేంద్రం కావడంవల్ల, ఈ నవీనసారస్వత భాష దేశ వ్యాప్తంగా ప్రామాణికభాషగా మారింది. తరవాతి కాలంలో కొందరు

రచయితలు ఇతర మాండలికలక్షణాలను సారస్వతభాషలో చేర్చారు. టస్కన్ను కూడా ఈ నూతన లక్షణాలను అనుకరిస్తూ వచ్చారు. ఈ విధంగా అనేకమాండలికాలనుంచి ఆదాన ప్రదానాలు పొందిన ఈ నవీన ఇటాలియన్ తొలినాటి ప్రాంతీయతను పోగొట్టుకుని ఇప్పుడు దేశభాషగా పరిణమించింది.

("Modern literary Italian is an excellent example.... average of all the local dialects"-Gleason, An Introduction to Descriptive Linguistics, pp. 321-22).

దాంటేను, అతని తొలి ప్రయత్నాలనూ అధిక్షేపించిన సనాతనపండితులు ఆనాడూ వుండేవారు. అయితే వారి శ్రమ ఫలించలేదు (A. Galleti, Gramyam and Grammar in Italy, వ్యాససంగ్రహం, పే. 12-21). ఈ విధంగా వ్యావహారికసాహిత్యకప్రామాణికాలకు సాన్నిహిత్యం రాక, సంస్కరణాపకారకంతేక, సంస్కర్తల ప్రయత్నాలు ఫలప్రదంకాక, పోయినప్పుడు మధ్యయుగాల యూరపియన్ భాషలు లాటిన్‌నుంచి వేరుపడ్డట్లు మొదటికే మోసం వస్తుంది. ఇలాంటి చారిత్రకసత్యాలను గుర్తించనందువల్లనే వ్యావహారికవాదులు భాషాసంస్కరణం చెయ్యాలని, మన సారస్వత(గ్రాంథిక) భాష ఇప్పటికే వ్యవహారానికి బహుదూరమై పోయిందని వాదిస్తున్నారు. గతానుగతికమై కృత్రిమమై శబ్దాడంబరభూయిష్ఠమై భావగోపనమాత్రసమర్థమై ప్రయోజనరహితమై వ్యవహారదూరమైన సారస్వత భాషకూ స్థానికమాండలికానికీ ప్రయోజనంలో భేదంలేదు.

"The language of poetry is closely related to slang in so far as both strive to avoid commonplace and everyday expressions....In some countries, these forms tend to become stereotyped, and then may to some extent kill the poetic spirit, poetry becoming artificiality instead of art; the later Skaltic Poetry may serve as an illustration. Where there is a strong literary tradition-and that may be found even where there is no written literature-veneration for the old literature handed down from one's ancestors will often lead to a certain fossilization of the literary language, which becomes a shrine of archaic expressions that no one uses naturally or can master without great labour. If this state of things persists for centuries, it results in clevage between

the spoken and the literary language which can not but have the most disastrous effects on all higher education : the conditions prevailing nowadays in Greece and in Southern India may serve as warning."

—O. Jespersen. Language its Nature. Origin and Development, pp. 300-301; quoting G. V. Ramamurti in foot notes.

§ 8.4 ఆధునికభారతీయభాషల్లో ఇందుకోసమే సంస్కరణవాదం బయలు దేరింది. తెలుగుసీమలో దీన్ని మొదట 'గ్రామ్య' వాదమని, తరవాత 'వ్యావహారిక' వాదమని పిలుస్తూ వచ్చారు. ఆధునికవంగభాషను సంప్రదాయబద్ధకృతకలక్షణాల నుంచి వేరుచేసి సజీవసాహిత్యభాషగా వ్యవహారసన్నిహితంగా తీర్చిదిద్దినవాడు మహాకవి రవీంద్రనాథ టాగూర్. ఇక్కడ లాగానే అక్కడకూడా సంప్రదాయ పండితుల విశ్వకళా పరిషదధికారుల ప్రతిఘటన తప్పలేదు. వాటికి 1918 లో సమాధానం చెబుతూ మహాకవి 'మోడరన్ రివ్యూ' పత్రికలో రాసిన మాటలు కొన్ని ఇక్కడ ఉద్ధరిస్తాను:

"I have found that the direct influence which the Calcutta University wields over our language is not strengthening and vitalising but pedantic and narrow. It tries to perpectuate the anachronism of preserving the Pandit-made Bengali swathed in grammar wrappings borrowed from a dead language. The artificial language of a learned mediocrity, inert and formal, ponderous and didactic, devoid of least breath of creative vitality, is forced upon our boys at the most receptive period of their life....In the modern European universities the medium of instruction being the vernacular, the students in receiving, recording and communicating their lessons, perpectually come into intimate touch with it, making its acquaintance where it is not slavishly domineered by one particular set of acadamicians....I assert once again that those who, from their position and authority have the power and the wish to help our language in the

unfolding of its possibilities, must know that in the present stage. freedom of movement is of more vital necessity than fixedness of forms" (మా. వ్యాసావళి, పే. 148_149).

ఠాకుర్ సాగించిన మహోద్యమఫలితంగా ఇప్పటికి యాభైయేళ్ళుగా ఆధునిక వంగసాహిత్యం 'చలిత్ భాష' సాహిత్యంగా వర్ధిల్లుతున్నది. ఠాకుర్ సాహిత్యప్రతిపత్తితోబాటు దాని గౌరవమూ పెరిగింది. బళ్ళలో ఇప్పుడు 'చలిత్ భాష' లోనే బోధన జరుగుతున్నది. ఇది కలకత్తా మాండలికంనుంచి ఏర్పడ్డ ఆధునికసాహిత్యకభాష.

"The present day literary Bengali is often nothing but Calcutta colloquial, with only a few archaic inflections of the verb; it is freely used in literature especially in poetry, drama and fiction and there is a strong body of writers who advocate suppression of old literary language by this living and vigorous form of Spoken Bengali."

—Suniti Kumar Chatterji, Bengali Phonetics.

ఈ రకం ఉద్యమం భారతరాష్ట్రాలలోనే వచ్చింది కాదు. యూరపులో రెండు వందల సంవత్సరాలుగా ప్రపంచవ్యాప్తంగా ఒక విలక్షణమైన పాంస్వతోద్యమం బయలుదేరింది. దీర్ఘసమాసభూయిష్ఠవాక్యాలమీద మోజు తగ్గిపోయింది. డొంక తిరుగుడు వాక్యరచనమీద అసహ్యం పుట్టుక వచ్చింది. పాండిత్యస్ఫోరకాలైన సాము గరిడీలు సన్నగిల్లిపోతున్నాయి. ఇంగ్లీషులో విక్టోరియన్ శైలి, దాని ప్రాబల్యం ఏనాడో అంతరించాయి. జర్మన్, డచ్, స్కాండినేవియన్ భాషా ప్రాంతాల్లో సులభ సుందరవాక్యరచనమీద, పదజాలంమీద అభిమానం పుట్టుకొచ్చింది. తెలుగు రచయితలు 'సరళ'త్వం అభిమానించటం మొదలుపెట్టేరు. ఈ మార్పు 'ప్రజాస్వామిక శైలి'ని అపేక్షిస్తున్నదనటానికి చాలా నిదర్శనలున్నాయి (Otto Jespersen, Efficiency in Linguistic Change. pp. 79_80):

"A longer lived literary fashion has now been evident for a century and a half. I am thinking of a growing preference for what may be called a democratic style : long involved sentences

with many dependent clauses and many learned words and classical allusions have been giving away to short, crisp, natural sentences with a preference for native vocabulary. In German, Dutch and the Scandinavian languages the same period has witnessed a similar movement with the disappearance of a great many foreign words through a sane purism, which is often half-conscious while an excessive purism is often ridiculed (...the man who first introduces a foreign word into his mother-tongue gene-rally finds it easier to repeat what he has learnt abroad or through a foreign book than to rack his brains for a fitting expression by means of native speech-material...''

ఈ పరిస్థితికి ప్రధానకారణం బహుశా ఆధునికశాస్త్రవిజ్ఞానవికాసమే కావచ్చు. చెప్పదలచిన విషయాన్ని సూటిగా స్ఫుటంగా స్పష్టంగా క్లుప్తంగా చెప్పటం శాస్త్ర పద్ధతి. అదే భాషాసామాన్య లక్షణంగా పరిణమిస్తున్న దన్నమాట. రెండో ముఖ్య కారణం విద్యార్జనావకాశాలు, జ్ఞానతృష్ణ విపరీతంగా పెరగటం. ఇందుకు నేటి ప్రజాస్వామికాది రాజకీయ విధానాలు ఎంతో ఉపస్కారకాలు. అందువల్ల కొద్ది మంది పండితుల ఆత్మతృప్తికో శాంతికో ఉపయోగపడిన ప్రాచీనసాహిత్యశైలిగాని ప్రాచీనధోరణి లేవైనాగాని కాలధర్మంవల్ల ఇప్పుడు పనికిరావు. కూపస్థమండూక ప్రవృత్తి ఇందువల్లనే వదులుకోవాలి. 'పరుగు రాఁడుమాట పాటియై ధరఁ జెల్లు' నన్నది వారూ చదివేరుగదా.

---

§ 6.5 ప్రపంచభాషాపరిస్థితు లిట్లా ఉండగా, వ్యాకరణమనే ఒక శాస్త్ర వ్యాపారానికి—పండితులు ఏనాడో నిర్మించుకున్న కొన్ని సూత్రాల సంపుటికి—మార్పు రాదని రాకూడదని రానీయరాదని వాదించేవాళ్ళు ఇంకా ఉన్నారు. రాజకీయాధికారంతో సిద్ధాంతరీత్యా తిరుగులేనివిగా చెలామణీ కావలసిన చట్టాలకే దిక్కులేని రోజుల్లో, పదిమంది పండితులు నిరూపించిన భాషాలక్షణాలకు వ్యతిక్రమం రాకూడదని ఆశించటం శాసించటం ఎంత తెలియనితనమో ఊహించుకోవచ్చు.[14] పై పెచ్చు ఆ పూర్వవ్యాకరణ సూత్రాలు మారిస్తే భాషాస్వరూపమే మారిపోతుందని భావించటం ఒకటి కద్దు. దీనికి తోడు ఆ సూత్రాలు లేకపోతే సృష్టి స్తంభించిపోతుందన్న విశ్వాసమొకటి. భాషలో లేని లక్షణాలను సూత్రీకరించినంతమాత్రాన అవి రావు; సూత్రాలు లేనంత మాత్రాన ఉన్నలక్షణాలు పోవు. ఈ సందర్భంలో సంప్రదాయవ్యాకరణవేత్తలు ఒకటి రెండు సైద్ధాంతిక లోపాల

వల్ల తప్పుదారిన పడ్డారు: (1) పూర్వకాలపు సాహిత్యకమహాభాషల వ్యాకరణాలు నిర్దుష్టంగా సతార్కికంగా ఉన్నాయి కాబట్టి ఆధునికదేశభాషల వ్యాకరణాలను పైవాటి పద్ధతిలో సంస్కరించి నిర్మించాలనుకోవటం.(2) ఆధునిక దేశభాషలన్నీ ఆపూర్వ భాషల నుంచి పుట్టాయి కాబట్టి వాటి లక్షణాలు తల్లిపోలిక లోనే ఉండాలనటం. లేటిన్, గ్రీక్. సంస్కృతంవంటి మహాభాషల వ్యాకరణాలు దుష్టమో నిర్దుష్టమో మనం లిఖితసారస్వత భాషారూపాలనుబట్టిమాత్రమే ఊహించగలుగుతున్నాం. అవి ఇప్పుడు నిత్య వ్యవహారంలో లేనందువల్ల ఆ వ్యాకరణ సూత్రాలు వ్యవహృత భాషాలక్షణాలను ఎంత సక్రమంగా సంపూర్ణంగా వర్ణించగలిగేవో మనకు తెలియదు. అవి చెప్పిన లిఖిత భాష అప్పటి వ్యవహృతభాషకు సరైన ప్రతిబింబమో కాదో తెలుసుకోకుండానే ఆ భాషా లక్షణాలను చెప్పిన వ్యాకరణాలు సలక్షణమైనవని ఎలా చెప్పగలం? ప్రపంచంలోని సుమారమి 3500 భాషల్లో అనేక విధాల విరుద్ధ, విలక్షణ, లక్షణాలున్నాయి. అవన్నీ ఒకే మూసలోపోసి ఏకైక లక్షణవంతాలని చెప్పటం—అదిన్నీ ఆ భాషల స్వరూప స్వభావాలేమిటో తెలియకుండానే చెప్పటం— అవిచారమూలకమే గదా? నిజానికి సంస్కృత వ్యాకరణం సతార్కికమై అంతిమ ప్రమాణమే అయితే సంస్కృతంలో వేదకాలంనుంచి ఈనాటివరకూ ఇన్ని వ్యాకరణాలు ఎందుకు వచ్చినట్లు? ఇందరు వ్యాకర్తలెందుకు తర్జనభర్జనలు చేసినట్లు? ప్రాచీనభాషల లక్షణాలే అర్వాచీనభాషలకు ఉండాలన్న నియమం ఎక్కడుంది? మన పూర్వవ్యాకర్తలెవరైనా అలా ఉండాలని నిర్దేశించారా? వైదికలౌకిక సంస్కృతాలకు ప్రత్యేక వ్యాకరణాలు ఎందుకు వచ్చాయి? ఇవన్నీ గమనించకుండా భాషాసంస్కారానికి దిగి మనం చేసేది తిరోగామి సంస్కరణమా, పురోగామి సంస్కరణమా? [15]

"I am firmly convinced that many of the short - comings of current grammatical theory are due to the fact that grammar has been chiefly studied in connection with ancient languages known only through the medium of writing, and that a correct apprehension of the essential nature of the language can only be obtained when the study is based in the first place on direct observation of living speech and on written and printed documents"

—O. Jespersen, The Philosophy of Grammar, pp. 7—8

వ్యాకరణ మొక శాస్త్రమే అయితే శాస్త్రీయవిధానానికి పరమప్రమాణమైన పరిశీలన (observation), నిరూపణ (proof), లేని నిష్కర్ష (conclusion) ఎంత తార్కికమైనది?

§ 6.51 జనకభాషాలక్షణాలు జన్యభాషలకుంటాయనే దురభిప్రాయం ముఖ్యంగా 18, 19 శతాబ్దాల్లో చాలా అనర్థకరంగా పరిణమించింది-ప్రపంచమంతటా. గురుమూర్తి శాస్త్రి వ్యాకరణాన్ని తోసిరాజని చిన్నయసూరి వ్యాకరణం తననాటి భాషాలక్షణాలను దూరీకరించి లకారాలను, ప్రత్యాహారసంజ్ఞలను. అటువంటి మరి కొన్నింటిని తెలుగు వ్యాకరణానికి తెచ్చిపెట్టింది. పదజాలాన్నేగాని ఇతర లక్షణాలను గమనించని పాండిత్యం తెలుగు సంస్కృతజన్యమన్నది. సంస్కృతంలోని ద్వివచనాన్ని లింగబోధక ప్రణాళికనూ ఆత్మనే పరస్మైపదములనూ ఇంకా అలాంటివి మరికొన్నింటినీ తప్ప సమస్త సంస్కృత మర్యాదలనూ తెలుగులోకి తెచ్చిపెట్టేరు. తల్లిపోలికలు బిడ్డకు వచ్చి తీరుతాయనే దురభిమానంతో పైవాటినికూడా ఎందుకు తెచ్చిపెట్టలేదో అస్పష్టంగా ఉంది। లేటిన్ ప్రమాణాలతో ఆధునిక యూరోపియన్ భాషలను పరిశీలించి సంప్రదాయవిద్వాంసులు దేశభాషాప్రయోగ వైచిత్రిని ప్రత్యేకలక్షణాలను గమనించక భాషావ్యాకరణాలను భయంకర గహన సీమలుగా మార్చారు [16] (Ibid., p 47):

Some centuries ago it was the common belief that grammar was but applied logic, and it would therefore be possible to find out the principles underlying all the various grammars of existing languages, people consequently tried to eliminate from a language everything that was not strictly conformable to the rules of logic, and to measure everything by the cannon of their so-called general or philosophical grammar ... This confusion of logic and Latin grammar with its consequence, a Procrustean method of dealing with all languages, has been the most fruitful source of mistakes in the province of grammar. What Sayce wrote long ago in the article "Grammar" in the ninth edition of the Encyclopaedia Britannica, "The endeavour to find the distinctions of Latin grammar in that of English has only resulted in grotesque errors, and a total

misapprehension of the usage of the English language"—these words are still worth taking to heart".

వ్యాకరణ లింగబోధక ప్రత్యయాలకూ వాస్తవికలింగవిచక్షణకూ సంబంధం లేదు. భాషావిభాగాలు (parts of speech) అనేవి భాషకొక తీరులో ఉన్నాయి. వచనప్రత్యయాలు భిన్నభాషలలో విభిన్నవిధాలుగా ఉన్నాయి. ఒక భాషలో ఉన్న లక్షణాలన్నీ తదితర భాషల్లో ఉండవు. ఇంగ్లీషులో లాగా ఫ్రెంచ్‌లో తరతమ వాచక విధానంలేదు. తమ వాచకం ఫ్రెంచ్‌లో లేదు. జర్మన్ భాషలోని లింగబోధక ప్రత్యయం స్వదేశీయులకూ విదేశీయులకూ సమంగానే దురవబోధం. డెర్ యూటర్ (der euter) అనాలో, డెస్ యూటర్ (des euter) అనాలో జాకబ్ గ్రిమ్‌వంటి పండితులకే తేల లేదని చెబుతారు. ఇంగ్లీషు స్పెల్లింగుల బాధ అందరికీ తెలిసిందే. ఈ సహజలక్షణాలను గ్రహించక రాసిన వ్యాకరణాలు ఆ భాషను గురించికాక ఆ వ్యాకర్తల అభిమతాలను గురించి మాత్రమే తెలుపుతున్నాయి.[17] ఈ కష్టాలు అన్నిటికీ మూలకారణం ప్రతి వ్యక్తికీ ఒక తీరు వ్యక్తిత్వం ఉన్నట్లే ప్రతిభాషకూ ప్రత్యేకలక్షణా లుంటాయని గ్రహించకపోవటం. రెండోది అనేక భాషల లక్షణాలను విడివిడిగా గ్రహించి పోలికవల్ల తులనాత్మకంగా ఏ భాషలో ఏవి విశిష్టలక్షణాలో గుర్తించకపోవటం. మూడోది జన్యజనకసంబంధమున్న భాషల విషయంలో కూడా తల్లి పోలికలన్నీ పిల్లలకు రానక్కరలేదని, ఎవరి వ్యక్తిత్వం వారికున్నంతమాత్రాన జన్యజనకసంబంధం తొలగిపోదని గమనించకపోవటం. అన్నిటికన్నా పెద్దకారణం వ్యాకరణమంటే పాణినిపద్ధతిలోనో డొనేటస్ మార్గంలోనో రచించింది మినహా మరోటి కాదనే అంధవిశ్వాసం.[18] వ్యాకరణరచనలు ఎన్ని విధాలుగా ఉంటాయో, ఏవిధమైన వ్యాకరణం ఏ విషయాలను విశేషంగా చెబుతుందో తెలియక పోవటం.

§ 6.52 భారతీయ వైయాకరణుల్లో కొన్ని శతాబ్దాలుగా పాతుకపోయిన భావం వ్యాకరణం అంటే విధినిషేధాత్మకసూత్రసంపుటి అనేది. అగ్రవర్ణాల్లో తప్ప విద్యావంతులు లేని కాలంలో, అగ్రజాతిభాషే ప్రామాణికంగా చెలామణీ అవుతున్నప్పుడు, ఆ భాషావిశేషంలో వాడుకలో ఉన్నవి ఒప్పనీ లేనివి తప్పనీ మన పూర్వులు రాశారు. దేశకాలపాత్రలు మారి విద్య అందరికీ అందుబాటులోకి వచ్చే సరికి సహజంగానే మొదట అవిద్యావంతులుగా ఉన్నవారు మొదటినుంచీ విద్యావంతులైన వారి భాషారీతులను అనుకరించటం మొదలుపెట్టారు. ఇది పండిత మండలికి మంచి అవకాశాన్నిచ్చింది. ఆ సమయంలో వెలువడ్డవే మన సంప్రదాయ వ్యాకరణాలు. ఇవి విధి నిషేధాలతో వ్యాకర్తల వ్యక్తిగతాభిరుచులతో అధికార

పూర్వశాసనాలతో తయారైన 'ఆధికారికవ్యాకరణాలు' (normative grammars) లేదా నిర్ణాయకవ్యాకరణాలు (prescriptive grammars). వీటిలో ప్రయోగదృష్టికన్నా ఆధికారికప్రవచనదృష్టి ఎక్కువ. 'ప్రయోగశరణా వైయాకరణాః' అనే అభియుక్తోక్తికీ, 'శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవ దుచ్యతే' అనే అర్వాచీనోక్తికీ పొందికలేదు. పరస్పర విరుద్ధమైన ఈ ప్రమాణాలతో మన వ్యాకర్తలు ఇన్ని 'సలక్షణ' ప్రవచనాలెట్లా చేశారో వారికే తెలియాలి; లేదా వారి భక్తులకైనా తెలియాలి. 'అనుకరణం హి శిష్టస్య సాధు భవతి' అనే పతంజలిమీద ఏపాటి గౌరవమున్నా (పూజావిషయం వేరు; అందులో మన వ్యాకర్తలు బహిరంగ భక్తులు. అంతరంగంలో ఏముండేదో వారికే తెలియదు!) మహాకవిప్రయోగాలనైనా సాధించి వుండవలసింది. ఇలాంటి పరిస్థితే పాశ్చాత్య దేశాల్లో కూడా ఉండేది. మధ్యయుగాల యూరప్‌లో గ్రీక్ వ్యాకరణ సంప్రదాయంలో తయారైన లేటిన్ వ్యాకరణాలు బయలుదేరేయి. ఆనాటి యూరపియన్లు మన భారతదేశంలో ఒక శతాబ్ది క్రితంవరకూ సంస్కృతాన్ని చదివినట్టే దేశభాషలు గాక లేటిన్ సాహిత్యం మాత్రమే అభ్యసించేవారు. వారి బుద్ధికి మానవభాష లన్నిటికీ సరిపొయ్యే తర్కప్రమాణాలు లేటిన్ వ్యాకరణంలోనే కనిపించేవి. దాంతో విశ్వజనీనవ్యాకరణాలు (universal grammars) అని, తాత్త్వికవ్యాకరణాలు (philosophical grammars) అని సిద్ధాంత ప్రవచనంచేసే వ్యాకరణ గ్రంథాలను రాసిపారేశారు. 1660 లో ప్రకటితమైన 'Grammaire generale et raisonnee' అనే బృహద్గ్రంథం మనకు మహాభాష్యంలాగా వారికి పరమప్రామాణికమయింది. ఈ అసాధారణ వ్యాకరణ సిద్ధాంతాలు 18 వ శతాబ్దికల్లా పిల్లలుపెట్టి దేశానికొక భాషకొక 'నిర్ణాయక వ్యాకరణం' వెలువరించాయి—పై గ్రంథం మూసలో. ఆ వ్యాకరణ సూత్రాల్లో చెప్పింది వేదం. పాఠశాలలో ప్రామాణ్యం వాటికే. ఇలా ఉండగా సాంస్కృతిక పునరుజ్జీవనంతో (Renaissance) పాశ్చాత్యప్రపంచంలో అనూహ్య పరిణామాలు వచ్చాయి. అందులో లేటిన్ స్థానంలో గ్రీక్ భాషాధ్యయనం రావటం ఒకటి. తరవాత హీబ్రూ అరబిక్ భాషలను నేర్చుకోవలసి వచ్చింది. సామ్రాజ్యాల హద్దులు విస్తరించి రాజకీయసాంస్కృతికవికాసం రాగానే విశ్వవ్యాప్తంగా దూర తీరాలను పరిశోధించటం ఆరంభమయింది. ఆ రోజుల్లో విదేశాల్లో పర్యటించిన మేధావులు, మత ప్రచారకులు, సైనికులు అనేకానేక నూతనభాషల గురించి కొద్దోగొప్పో తెలుసుకోవటం మొదలయింది. మతగ్రంథాలను విదేశభాషల్లోకి అనువ

దించటం ఆరంభమయింది. ఈ పరిస్థితి అనేక విద్వాంసులచేత కొత్త భాషలకు వ్యాకరణాలూ నిఘంటువులూ రాయించింది. స్పేనిష్ మత ప్రచారకులు 16 శతాబ్దం లోనే అనేక అమెరికన్, ఫిలిప్పైనో భాషలమీద ఉద్గ్రంథాలు రచించారు. వాణిజ్య వ్యాపారాల, నూతనప్రయాణసౌకర్యాల అభివృద్ధితో బాటు ఈ విద్యాదాహం కూడా పెరిగింది. రష్యన్ చక్రవర్తిని కేథరిన్ ప్రోత్సాహం మీద పి. ఎస్. పలాస్ అనే విద్వాంసుడు యూరప్, ఆసియాఖండాల్లోని 200 భాషలకు చెందిన 285 సమానార్థక పదాలతో తులనాత్మకనిఘంటువు నిర్మించి 1786 లో ప్రచురించాడు. ద్వితీయ ముద్రణలో ఈ మహాగ్రంథంలో మరి 80 ఆఫ్రికన్, అమెరికన్ భాషలు చేర్చేయి. జె. సి. అడెలంగ్, జె. ఎస్. వేటర్ అనే యిద్దరు 1806 – 1817 ల మధ్య 'Mithridates' అనే నాలుగు సంపుటాల మహాగ్రంథంలో క్రైస్తవ ప్రార్థనలను 500భాషల్లో ప్రకటించారు. 18 వ శతాబ్ది భాషావేత్తలు తాత్త్వికవ్యాకరణాలు రాసి ఈ ఆధునిక భాషలన్నీ ప్రాచీనభాషల అపభ్రంశ రూపాలని, పై తరగతుల భాషలు ప్రాచీనభాషా లక్షణాలను చాలావరకు కాపాడి నిలుపుకుంటూ వచ్చినా కింది తరగతుల గ్రామ్య భాషాప్రభావంవల్ల చెడిపోతూ వచ్చాయని, పెద్దల స్వచ్ఛభాషల నుంచి (pure languages)చిన్నల గ్రామ్యభాషలు భాషాక్షయంవల్ల (linguistic decay) ఏర్పడ్డాయని నిర్ధరించారు. గ్రాంథికవాదులు 'గ్రామ్య'మనే పరిభాష ఇలాటిదే. పండితులు 'సెనగలు' గ్రాంథికమనీ శుద్ధమనీ భావిస్తారు; 'చెనగలు' గ్రామ్యం కింద లెక్క. వీటి మూలరూపం సంస్కృతంలోని 'చణక' శబ్దం. వీటిలో ఏది చెడిపోయి కుళ్ళి పోయిన రూపమో పై ఉదాహరణమే నిరూపిస్తుంది....

కొన్ని భాషలకు దగ్గరి పోలికలున్నాయని గుర్తించినా అవేమిటో ఎందుకు వచ్చాయో పరిశీలించక భాషాక్షయసిద్ధాంతంమీద ఆధారపడి అవన్నీ అపభ్రంశాలని గ్రామ్యాలని భ్రమించారు. లేటిన్ భాష ఆధునికఫ్రెంచ్‌గా పరిణమించిందని గ్రహించక అది చెడిపోయి ఫ్రెంచి అనే పేరు తెచ్చుకొం దనుకున్నారు. లేటిన్ మన సంస్కృతంలాగా ఈ క్షణం వరకూ మార్పొందకుండా జీవించి వుందనే నమ్మకంతో సమకాలభాషలు ఒకదానినుంచి మరొకటి ఏర్పడ్డాయని కొందరు నిర్ణయించారు. చాలామంది ప్రపంచభాషలన్నీ హీబ్రూనుంచి పుట్టేయన్నారు. అన్ని భాషలకూ సంస్కృతం జనని అనే మనవారి వాదాన్ని దీంతో పోల్చవచ్చు. అయితే స్వస్థానదేశ భాషాభిమానంగల దేశభాషాభక్తులు కొందరు అన్ని భాషలూ తమ మాతృభాషనుంచే జన్మించాయని వాదించారు. ఆంట్వెర్ప్ వాస్తవ్యుడు గోరోపియస్ బికానస్ లెక్కన భాషలన్నీ డచ్‌లోనుంచే ఉద్భవించాయి. కొంతకాలం క్రితం

విశాఖపట్టణవాస్తవ్యుడైన విద్వాంసుడొకడు అన్ని భాషలకూ తెలుగే తల్లి అని వాదిస్తుండేవాడు. ఈ మూఢ విశ్వాసాలన్నీ యూరపియన్లు సంస్కృత భాషతో సంస్కృత వ్యాకరణాలతో పరిచయం సంపాదించిన తరవాత ఒకదాని వెంట మరొకటిగా నశించి భాషాధ్యయనం క్రమంగా శాస్త్రీయమార్గాలు తొక్కింది. మన దౌర్భాగ్య మెటువంటిదోగాని ప్రపంచం కళ్ళు తెరిపించిన సంస్కృతవిజ్ఞానం మన కళ్ళు కప్పుతూనే ఉంది. గతానుగతికమైన మనవారి భట్టీయమార్గం స్వతంత్రాలోచనలకు దూరమై శతాంధన్యాయంలో మననీ మన విజ్ఞానాన్నీ గోతిలోకి దింపుతునే ఉంది. ఇందుకు ఆధునికవిజ్ఞానప్రభావాలకు దూరంగా ఉన్న రాజకీయ సాంఘిక వ్యవస్థే ప్రధాన కారణమని చెప్పాలి.

§ 6.53 వేద భాషను యథాతథంగా నిలుపుతున్నా భారతజాతి లౌకిక సంస్కృతంలో వచ్చిన మార్పులను వర్ణిస్తూ ప్రత్యేకవ్యాకరణగ్రంథాలు రచించింది. తరతరాల శ్రమ ఫలితంగా అద్భుతమైన కోశవ్యాకరణగ్రంథాలు వెలువడ్డాయి. పాణిని వ్యాకరణం వర్ణనాత్మకవిధానంలో మానవమేధాశక్తికే పరమప్రతీకగా పేరు తెచ్చుకుంది ("....The grammar of Panini....is one of the greatest monuments of human intelligence" - Bloomfield. Language, p.11). పదహారో శతాబ్దంనుంచీ సంస్కృతాన్నిగురించి అంతో ఇంతో తెలుస్తూనే వున్నా పందొమ్మిదో శతాబ్దం నాటికి యూరపియన్లు చాలా విశేషాలు తెలుసుకో గలిగేరు. ఒక భాషలోని సూక్ష్మాతిసూక్ష్మవిషయాలను గూడా ఏవిధంగా వర్ణించ వచ్చో తెలుసుకున్నారు. ఇలా భిన్నభాషలను పోల్చి చూసే పద్ధతులుకూడా గ్రహించారు. సర్ విలియం జోన్స్ అనే ఆంగ్ల విద్వాంసుడు 1786లో సంస్కృతం, గ్రీక్, లేటిన్ మొదలైనవి ఒకానొక ప్రాచీనమూల భాషనుంచి ఏర్పడ్డ సోదర భాషలని ప్రకటించాడు. తులనాత్మకవ్యాకరణరచనకు పునాదులు పడ్డాయి. 1816 లో ఫ్రాంజ్ బాప్ పైమూడు భాషలనూ పర్షియన్, జెర్మానిక్ భాషలనూ అధ్యయనంచేసి తులనాత్మకవ్యాకరణం (comparative grammar) రచించాడు. కారల్ బ్రగ్మన్, బెర్థాల్డ్ డెల్‌బ్రక్ అనే యిద్దరు 1886 లో ఇండో - యూరపియన్ భాషలకు తులనాత్మకంగా రాసిన వ్యాకరణం ఈనాటికీ ప్రామాణిక గ్రంథంగా ఉంది. ఇలా అనేకభాషా కుటుంబాలకు అనేకతులనాత్మకవ్యాకరణాలు కాలక్రమాన వచ్చాయి. 1856 లో బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్ ప్రచురించిన ద్రవిడభాషాతులనాత్మకవ్యాకరణం మన దేశంలో భావవిప్లవం సాధించిన మహాగ్రంథం. తెలుగు, తమిళం, మలయాళం మొదలైనభాషలు సంస్కృతజన్యాలు కావని,ఒకే భాషా కుటుంబానికి చెందిన స్వతంత్ర

భాషలని. ఆయన చేసిన నిరూపణ అనాదిసిద్ధంగా సంప్రదాయవాదులు విశ్వసించిన సంస్కృతప్రాకృతజన్యతాసిద్ధాంతాన్ని పటాపంచలు చేసింది. అంతో ఇంతో ఆనాటి భాషాశాస్త్రం అధ్యయనం చేసిన చిలుకూరి నారాయణరావుగారివంటి విద్వాంసులకు గూడా ఇది కంటగింపుగానే ఉండి వారి 'ఆంధ్రభాషాచరిత్రలో' అపూర్వసిద్ధాంత లోపంతో సంస్కృతజన్యతానిరూపణకు ప్రయత్నాలు చేయించింది. దీనికి పోటీగా గంటి జోగి సోమయాజిగారి 'ఆంధ్రభాషావికాసము' ద్రవిడభాషావాదాన్ని నిరూపించ టానికి ప్రయత్నించింది. మన వారికి పాఠ్యగ్రంథాలుగా ఉన్న ఈ రెంటిలోనూ కని పించే సైద్ధాంతిక వాస్తవిక లోపాలనూ దోషాలనూ నిరూపించటానికి ఇది స్థలమూ కాదు-సమయమూకాదు. ద్రవిడభాషల్లో తెలుగుకు ఉన్న స్థానాన్ని తులనాత్మకంగా వర్ణనాత్మకంగా నిరూపిస్తూ ప్రామాణికంగా ఉన్న గ్రంథం భద్రిరాజు కృష్ణమూర్తి గారు ఆంగ్లంలో రాసిన 'Telugu Verbal Bases' అనేది. [19]

ఈ తులనాత్మకపరిశీలనలు భాషల చారిత్రకపరిణామదశలను కూడా బయ టికి తీశాయి. పాతకాలపు విశ్వాసాల స్థానంలో భాషల్లో మార్పు లెన్ని రకాలుగా ఉంటాయో ఏ పరిస్థితుల్లో అవి వస్తాయో శాస్త్రీయంగా చర్చించే చరిత్రాత్మక వ్యాకరణాల (historical grammars) తయారీకి ఇది దారితీసింది. విలియం డ్వైట్ విట్నీ అనే అమెరికన్ విద్వాంసుడు 1867లో 'Language and the Study of Language' అనే ఉద్గ్రంథం రాశాడు. హెర్మన్ పాల్ 1880 లో ప్రచురించిన 'Principles of Linguistic History' అనేది అధికారిక గ్రంథ మయింది. తెలుగు భాషకు ముఖ్యంగా శాసనభాషకు బూదరాజు రాధాకృష్ణ, కోరాడ మహాదేవశాస్త్రి, ఎం. కందప్పచెట్టిగార్లు చారిత్రకవ్యాకరణాలు ఆంగ్లంలో రాశారు. చారిత్రకవ్యాకరణాలతోపాటు వర్ణనాత్మకవ్యాకరణాలు పాణినిపద్ధతిలో వెలువడుతూ ఉండేవి. ఆగస్ట్ లెస్కీన్ అనే విద్వాంసుడు స్లావిక్ బాల్టిక్ భాషల్లో చాలావాటికి వర్ణనాత్మక వ్యాకరణాలు (descriptive grammars) రాశాడు. తెలుగులో నన్నయ భాషకు నాగభూషణరావుగారు రాసిన వర్ణనాత్మకవ్యాకరణం ఉంది. కొందరు విద్వాంసులను విభిన్నభాషల్లో కనిపించే వైవిధ్యం, సమానలక్షణాలూ ఆకర్షించాయి. భాషా సాధారణంలోని స్వభావైక్య వైవిధ్యాలను తాత్వికదృష్టితో పరిశీలించి కొన్ని మౌలిక సిద్ధాంతాలను మొట్టమొదట ప్రతిపాదించినవాడు విల్హెల్మ్ వాన్ హంబోల్ట్. ఆయన భాషాశాస్త్రం (General Linguistics) 1836 లో వెలువడింది. ఫ్రాంజ్ నికోలస్ ఫింక్ అనే పండితుడు ఒక భాషా సిద్ధాంతగ్రంథాన్ని 1905 లోను, పరస్పర సంబంధంలేని ఎనిమిది భాషల వర్ణనాత్మకవ్యాకరణాన్ని

1910 లోను ప్రచురించి భాషాశాస్త్ర పరిశోధనలకు—ముఖ్యంగా చారిత్రాత్మక అధ్యయనానికి — వర్ణనాత్మకపరిశీలనమే ప్రథమసోపానంగా ఉండాలని వాదించారు. ఆ తరవాత భిన్నమార్గాల్లో భాషాపరిశోధనకు సమన్వితమార్గం దొరికింది. ఆచరణలోకి వచ్చింది. భాషాధ్యయనానికి ప్రాథమికమార్గం వర్ణనాత్మక పరిశీలన. ఒకే భాష చారిత్రకపరిణామాలను గ్రహించటానికి ఆ భాషకు భిన్నకాలాల్లో ఉన్న వర్ణనాత్మకవ్యాకరణాలను పోల్చిచూడాలి. భిన్నభాషల చారిత్రకవ్యాకరణాలను పోల్చిచూసినప్పుడు తులనాత్మకవ్యాకరణరచన సాధ్యపడుతుంది. ప్రాథమికమైన వర్ణనాత్మక పరిశీలన ఎంత విపులంగా, సలక్షణంగా, శాస్త్రీయంగా, స్పష్టంగా వుం దే తక్కినవి అంత ప్రామాణికంగా ఉంటాయి. విభిన్నభాషాలక్షణాల సాధారణీకరణం (generalisation) ఆ భాషల వాస్తవికలక్షణాలను పరిశీలించటంమీదనే ఆధారపడాలి గాని పారమార్థికసత్యాలమీదనో తార్కికప్రమాణాలమీదనో ఆధారపడగూడదు. సహస్రాధిక ప్రపంచభాషాలక్షణాలను పరిశీలించిన తరవాత కలిగిన అనుభవంతో చెప్పిన ఈ శాస్త్రీయపద్ధతులను గమనించక అంధపరంపరాన్యాయంలో విశ్వాసైక ప్రధానంగా ఏమి చెప్పినా ఏమి చేసినా అశాస్త్రీయమే.

§ 6.54 తెలుగుభాషలో ఇరవైయేళ్ళక్రితంవరకూ వచ్చిన వ్యాకరణాలు సంఖ్యాధికంగా ప్రాచీనపద్ధతిలో ఉన్న నిర్ణాయకవ్యాకరణాలు మాత్రమే. వీటిలో విధినిషేధాలతోపాటు కొన్నిచోట్ల చారిత్రక విషయాలు కూడా కనిపిస్తాయి. ఇవి సంస్కృతవ్యాకరణ సంప్రదాయాలను తెలుగుమీద రుద్దుతూ అశాస్త్రీయసూత్రాలతో భాషాస్వరూపం దురవబోధం చేశాయి.[20] ఉదాహరణకు గ్రాంథికవాదానికి పరమ ప్రామాణికమైన బాలవ్యాకరణాన్ని తీసుకొందాం. అందులోని సూత్రాలను స్థాలీపులాకంగా కొన్నిటిని పరీక్షిస్తే చాలు. బండారం బయటపడుతుంది. 'క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు' (సంధి. 8) అనేది కావ్యప్రయోగ విరుద్ధమని వేరే చెప్పనక్కరలేదు. వ్యాఖ్యానాలు ఎన్నో ప్రయోగాలిచ్చాయి. 'పిఁగి చేఁగి యనుచోఁ బ్రాక్స్వరంబునకు సంధి లేదు' (సంధి.10) అని ఏగివల్లి రాసిన వివరణంలో తన పట్టుదలను నిరూపించుకోటానికి మాత్రమే పునరుక్తి చేయక తప్పలేదు ఇలాంటి విశేష సూత్రాలు. ఈ విశేషాలకు చారిత్రక ప్రమాణం లేదనటానికి మరో ఉదాహరణ తీసుకొందాం 'అత్తునకు సంధి బహుళముగా నగు' (సంధి. 4) అనే సూత్రవృత్తిలో 'అమవికా'లైన శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదా ప్రయోగాలకు సాధుత్వం కల్పించే ప్రయత్నం జరిగింది. అనవద్యాచార్యుల శాస్త్రవచనాన్ని ప్రయోగప్రాధాన్యత కారణంగా మారి నిరాకరించారు. ఇక్కడ 'శాస్త్రప్రయోగవచనోః శాస్త్రం బలవదుచ్యతే,

ఆ ఉచ్చారణ అప్రధానమని భావించినా దంత్యతాలవ్యచజలను ప్రత్యేకవర్ణాలుగా నిర్ణయించి వర్ణసమామ్నాయంలో చేర్చాడు (సంజ్ఞా 3). ఎప్పటికేది ప్రమాణమో మన వ్యాకర్తలే చెప్పాలి.

ఇక పరస్పర విరుద్ధ నిర్ణయాలకు దారితీసిన ఏకైకప్రమాణం కూడా మనకు లేకపోలేదు. 'సమానపదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో నుండు బిందువునకుం బూర్ణంబగు' (అచ్చిక. 16) అనే సూత్రంలో 'తెనుఁగున బిందుపూర్వక స్థిరంబు లేమింజేసి (చూ. 'సంస్కృత సమేతరములయిన తెనుఁగు శబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు కానంబడుచున్నది' —సంజ్ఞా. 16) యది గ్రాహ్యంబుగాదు' అని 'పెంప్లు' శబ్ద ఢకారానికి కొందరు చెప్పిన ఆదేశం నిరాకరించారు. అంటే ఇక్కడ బిందువు ఉంటుంది; స్థిరం (శకారం) తొలగిపోతుంది. 'ఆమ్రేడితంబు పరంబగు నపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' (సంధి. 41) అనే సూత్రవృత్తిలో 'ఇంచుక నాఁ డిత్యాదులందు బహుళగ్రహణము చేత నంతిమాక్షర లోపంబు' రాగా 'నాఁనాఁడు' అనే రూపంలో స్థిరం (నకారం) కాక బిందువేపోయి 'నానాఁడు' సిద్ధిస్తుంది. ఇక్కడ వాదన వేరు; 'పరుషసరళములకు ముందే' ఉండగల బిందువు తదితరాలముందు లోపిస్తుందట! ఇదంతా సతార్కిక సశాస్త్రీయప్రామాణిక విధానమే గదా మరి!

అప్పుడప్పుడు చరిత్రాత్మకవ్యాకరణంలో ఉండవలసిన విషయాలు ఇందులో కనిపిస్తాయి—పరస్పర విరుద్ధంగా. 'అడంగ్వాదుల దాకు ణకారంబు విభాషనగు' (ప్రకీ. 13) అనే చోటి డకారమధ్యరూపాలు చారిత్రకంగా తులనాత్మకంగా ప్రాచీనాలు; ణకారమధ్యరూపాలు పరిణామక్రమంలో అర్వాచీనంగా ఏర్పడ్డవి. ఈ మాట నిజమే. కాని తరవాతి సూత్రంలో 'వక్కులోనగువాని దాకు దకారంబు విభాషనగు' (ప్రకీ. 14) అని చెప్పిన దకారయుక్త రూపాలు ప్రాచీనాలుకావు. భాషాపరిణామ క్రమంలో డకారయుక్త రూపాలే ప్రాచీనతరమైనవి. ఇంతకు ముందు పేర్కొన్న చారిత్రకవ్యాకరణాల్లోగాని. ఈ వ్యాసంలోనే స్థలాంతరంలోగాని (§2.32), 'Dravidian Etymological Dictionary' లో ఆయాపదాల దగ్గరగాని చూస్తే తెలుస్తుంది. మొదటి సూత్రంలో మిడతంభొట్లు పలికేరు; తరవాత పార్వతి శాపం అడ్డుపడ్డందువల్ల వ్యవహారం బెడిసికొట్టింది. ఇలాటి అసందర్భాల నన్నిటినీ చర్చించటం ఇక్కడ సాధ్యపడదు. ప్రత్యేక గ్రంథమే రాయవలసి వుంటుంది. కొన్ని చర్చలు 'ఆంధ్రభాషాచరిత్ర'లో 'ఆంధ్రభాషావికాసము'లో అక్కడక్కడ కనిపిస్తాయి. ఇది కావ్య భాషకైనా సమగ్రంగా సరిపోదు. దీన్ని

నమ్ముకొని ఒక మహోద్యమం నడిపిన విద్వద్వరేణ్యులమీద జాలిపడటంకన్నా మరో మార్గంలేదు. ఈ వ్యాకరణాలూ ఈ కావ్యాలూ నిర్దుష్టాలని భావించేవారు కేతన చెప్పిన ఈ మాటలు నెమరువేసుకోవటం మంచిది:

"నేరములు కావున వు
యూరాములకైనఁ గలుగ నొరులకు లేవే ? (11)

"కంచి నెల్లూరు మఱి యోరుగ ల్లయోధ్య
యను పురంబులపై గంగ కరుగు మనిన
పగిది నొకత్రోవఁ జూపెద" బహుపథంబు
లాంధ్ర భాషకుఁ గల; వవి యరసికొనుఁడు (12)"

—ఆంధ్ర భాషా భూషణము.

పై పద్యంలో అయోధ్య మీదుగా గంగకు పొమ్మన్న మార్గనిర్దేశానికీ కేతన వ్యాకరణ మార్గానికీ ఉన్న సంబంధం గమనార్హం. కనీసం ఈ విద్వత్కవి 'బహుపథంబు' లుండగా 'ఒకత్రోవ' మాత్రమే చూపుతున్నా ననటం మరింత గమనార్హం. ఈపాటి వివేచనకూడా లేని తరవాతి వ్యాకర్తలకన్నా కేతన ఎన్నో రెట్లు మెరుగు — ఆయన వ్యాకరణంకూడా తరవాతి వ్యాకరణాలంతగా సంస్కృత దాస్యం చేయలేదు.

§ 6.6 పై విషయాలనుబట్టి చూస్తే మనకు ప్రామాణికమని చెప్పదగిన సంప్రదాయవ్యాకరణం ఒక్కటీ లేదనాలి. ఉన్నవి తప్పుల కుప్పలు. ఉన్నంతలోను ప్రాకృతసమ. ప్రాకృతభవాల రూపనిష్పాదనప్రక్రియను చెప్పేవయినా లేవు. వాక్య నిర్మాణక్రమాన్ని పదబంధప్రవృత్తిని వివరించేభాగాలు ఈ గ్రంథాల్లో దాదాపు లేనట్లే. అందుకనే తిరుపతి వేంకట కవులన్నట్లు 'తెలుగునకున్న వ్యాకరణదీపము చిన్నది'. చిన్నయ్య రాసింది పెద్దదవుతుందా మరి? వీటి నాధారంగా, పరమ ప్రమాణంగా తీసుకొని తమ వాద ప్రశస్తిని తామే ఎట్లా పొగడుకుంటున్నారో గ్రాంథికవాదులకే తెలియాలి. విపులమైన వర్ణనాత్మకవ్యాకరణాలే గాక (వీటిలో వాక్యనిర్మాణ క్రమంలో చెప్పగలిగిన విశేషాలు తక్కువే కాబట్టి) ఆధునికభాషా శాస్త్రరీతిలో వికాసకవ్యాకరణాలు (generative grammars), పరివర్తక వ్యాకరణాలు (transformational grammars) కూడా కొత్తగా రావాలి. వీటిలో ఏ ఒక్కటీ భాషా సమస్త లక్షణాలనూ చెప్పలేదు. మాండలికభాషా వ్యాకరణాలూ మాండలికపదకోశాలూ అనేకానేకంగా రావాలి. ఒకనాటి ప్రామాణికభాషాలక్షణాలను

చారిత్రకవికాసాములతో నిమిత్తం లేకుండా, విధినిషేధప్రమేయం లేకుండా, గ్రంథకర్త ఇష్టానిష్టాలతో సంబంధం లేకుండా, యథాతథంగా సమగ్రంగా వివరించేవి వర్ణనాత్మకవ్యాకరణాలు. చారిత్రక దృష్టితో భిన్నకాలాల్లో భాషలో వచ్చిన మార్పులను విశదీకరించేవి చరిత్రాత్మక వ్యాకరణాలు. ఏకకుటుంబానికి చెందిన సోదరభాషాలక్షణాలను మన భాషాలక్షణాలతో పోల్చిచెప్పేవి తులనాత్మకవ్యాకరణాలు. భాషలోని పదసంఘటనల క్రమవికాసం సూచించేవి వికాసకవ్యాకరణాలు. వాక్యనిర్మాణక్రమంలో భిన్నపదజాతుల అన్యోన్య సంబంధాలను శబ్దార్థ సంబంధాలను నిరూపించేవి పరివర్తక వ్యాకరణాలు. ఇంతకుముందే చెప్పినట్లు తెలుగుభాషకు నాలుగైమ చరిత్రాత్మక, తులనాత్మక, వర్ణనాత్మక వ్యాకరణాలూ ఇప్పటిప్పుడే చేకూరి రామారావుగారు ప్రచురిస్తున్న పరివర్తకవ్యాకరణమూ తప్ప మరి లేవు. ఇవన్నీ యావద్భాషా విశేషాలను సమగ్రంగా నిరూపించగలవి కావు. ఇలాంటి స్థితిలో బాల (ప్రౌఢ) వ్యాకరణాలు సమగ్రాలనీ, ప్రామాణికాలనీ, వాటికి విరుద్ధంగా ఏ మార్పులూ భాషలోగాని చివరికి వ్యాకరణ స్వరూపంలోగాని రావనీ రాలేదనీ రాగూడదనీ వాదించటం హాస్యాస్పదం. కాకపోతే సంప్రదాయవ్యాకరణాలు సాధించింది ఒక బ్రహ్మాండమైన దురభిప్రాయాన్ని మూఢవిశ్వాసంగా లోకంలో ప్రచారం చేయగలగట మొక్కటే: వ్యాకరణమంటే కొన్ని సూత్రాల సమాహారమనీ, దానికి తిరుగులేదనీ, అది లేకపోతే వ్యవహారహాని కలిగి ప్రపంచం స్తంభించిపోతుందనీ. ఈ వాదాన్ని ఒక్క పోలిక చెప్పి పరాస్తం చేయవచ్చు. భారద్దేశానికి 'లిఖిత రాజ్యాంగం' (written constitution) ఉంది. బ్రిటనుకు అలాటిది లేదు. పౌరశాస్త్రంలో బ్రిటీషువారికి 'అలిఖితరాజ్యాంగం' ఉందంటారు గాని రాజ్యాంగమే లేదని అన్న వారు లేరు. పరిపాలన విధానాలను కాగితం మీద కొన్ని ప్రకరణాలుగా రాసినంతమాత్రాన దానికి బలంరాదు; రాయకపోతే బలహీనతరాదు. పరిపాలనలో ఆచారాలకు (precedents) ఎంత బలంవుందో భాషలో ప్రయోగానికి (usage) అంతబలమూ ఉంది. ఆయాలక్షణాలను గ్రంథస్థం చేయనంతమాత్రాన లక్షణాలే లేవనుకోవటం భ్రాంతిమాత్రమే. వ్యావహారికానికి వ్యాకరణం లేదనే గ్రాంథికవాదుల వాదం ఇంత సలక్షణమయింది. సంఘధర్మాలు మారినప్పుడు వాటిని గ్రంథస్థం చేసినట్లే భాషలో ప్రయోగాలు మారినప్పుడూ చేస్తారు. గ్రంథస్థం చేయటం 'గుర్తు' కోసం; 'గుర్తింపు' కోసం. మరోవిధంగా చెప్తే మన కావ్యభాషకే సమగ్రమైన వ్యాకరణ 'గ్రంథం' లేదు; వ్యాకరణం 'గ్రంథ' నిరపేక్షంగానే ఉండేది. అలాగే ఆధునికప్రామాణిక భాషకున్నూ. ఈ చర్చలు ఎట్లావున్నా, వ్యాకరణ 'గ్రంథం'

లేనందువల్ల 'వ్యవహారలోపం'గాని 'వ్యవహారహాని' గాని జరగటంలేదు. లక్షణ క్రోడీకరణం మంచిదే. కాని అలా జరక్కపోయినా వ్యవహారం ఆగిపోలేదు-పోదు. కాబట్టి 'వ్యాకరణగ్రంథం' లేకపోవటమూ 'వ్యాకరణం' లేకపోవటమూ ఒక్కటి కాదని, ఆ రెండూ సమానం కావని, గమనించాలి. కేవలం సంప్రదాయ వ్యాకరణాలను సంస్కరించటంవల్లగాక ఆధునికవిధానాల్లో విశదీకరించటం మంచిది. ఇది గ్రంథసంస్కారమేగాని భాషాసంస్కారంకాదు. ఈ సంస్కరణాభిలాష ఈనాడు కొత్తగా మొలకెత్తిందేమీ కాదు. నన్నెచోడుడి 'జానుదెనుగువాదం', పాల్కురికి సోమన సంస్కృత వ్యతిరేకవాదం, గిడుగు గురజాడల వ్యావహారిక వాదం—ఇవన్నీ మానవబుద్ధి వికాసక్రమంలో వచ్చిన పరిణామాలకు ఉపలక్షణాలు మాత్రమే. కాకపోతే గిడుగు, గురజాడలు ఒక విధంగా దూరదృష్టివంతులు. సమకాలిక దేశీయ పండితమండలికన్నా వాళ్ళు రెండు మూడు శతాబ్దాలు ముందుగా ఆలోచించిన దూరదృష్టి కలవాళ్ళు. వేమకూర పద్యభాగాన్ని కొద్దిగా మార్చి 'ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా' అని సరిపెట్టుకోవటం తప్ప ఆ మహామేధావులకు మనం చేయగల మహోపకారమేమీలేదు. విశ్వవ్యాప్తమైన ఆధునిక విజ్ఞానాన్ని మధ్యయుగాల మనస్తత్వంలో ఉన్న సమకాలిక కవిపండితులకు అందిచ్చే ప్రయత్నంలో వారిద్దరూ ఆ రోజుల్లో అప్రతిష్ఠపాలైనా, అపజయం పొందినా, నేటి పరిస్థితి వారి క్రాంతిదర్శిత్వాన్ని రుజువుచేస్తున్నది.

## సాంప్రదాయక చర్చాసమన్వయం

§ 6.7 వ్యావహారికోద్యమ చరిత్రలో ఉభయవాదాలవారూ పేర్కొన్న ప్రధాన లోపాలోపాలను. ఆక్షేపణాధిక్షేపణలను రేఖామాత్రంగా ఉట్టంకించాము. భాషాశాస్త్ర దృష్టిలో ఆ యా అభిప్రాయాలు ఎంతవరకు సమంజసమైనవో ఈ ప్రకరణంలో ఇంతవరకూ చర్చించాను. వాదోపవాదాల సమయంలో రెండు పక్షాలవారూ రాసిన సాహిత్యాన్ని ఎత్తిరాసినందువల్లగాని, అప్రస్తుతంగా వివాదంలో చొరబడ్డ వ్యక్తిగత విభేదాలవంటి, అనవసరచర్చలవంటి క్షుద్రవిషయాలను ప్రస్తావించినందువల్ల గాని వచ్చేలాభమేమీలేదు. ప్రధానమైన దురభిప్రాయాల విషయంలో స్థూలాతి స్థూలమైన పరిశీలన చేస్తేచాలు. ఈ దృష్టితో ఇక్కడ కొన్నిటిని చర్చించటమే లేదు. అక్షరసంఖ్యనుబట్టి ఇంగ్లీషుకన్నా తెలుగే గొప్పదన్న వాసుదాసుగారి అభిప్రాయం, సంస్కృతాంగ్లాలలో పదజాలసంఖ్యనుబట్టి సంస్కృతమే అభివృద్ధి పొందిన భాష అనే గౌతమరావుగారి నిర్ణయం, వ్యావహారిక వాదంవల్ల తెలుగు కోయ, చెంచు, సవరభాషల్లాగా ఆటవికస్థితిలోకి వస్తుందనే, తెలుగుకు ఇప్పుడున్న ఉచ్చస్థితిపోయి నీచస్థితి వస్తుందనే పండితమండలి భయాందోళనలు, వ్యావహారిక రచనలు చేయటానికి పదజాలం చాలదనే విశ్వనాథశర్మగారి ఉక్తి మొదలైనవన్నీ

క్షుద్రవిషయాలు. ఈ అభిప్రాయ భేదాల్లో ప్రధానమైన వాటిని మాత్రం తీసుకొని వాదసమయంలో మనవారు చెప్పిన ఉపపత్తులను సంక్షిప్తంగా ఉట్టంకించిన తరవాత ఆధునిక పరిస్థితి, నేటి ప్రామాణికాంధ్రభాషాస్వరూపం నిర్దేశించి ముగిస్తాను.

§ 6.71 కొమర్రాజు లక్ష్మణరావుగారు వ్యాకరణానికిచ్చిన నిర్వచనం గ్రాంథిక వాదుల అభిప్రాయానికి మచ్చుతునక. వ్యాకరణం అంటే సంప్రదాయ వ్యాకరణ గ్రంథమని. ఆ గ్రంథాలంగీకరించిన శబ్దరూపాలని. కందుకూరి వీరేశలింగంగారి వంటి, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారివంటి వచనరచయితలు వాడని శబ్దరూపాలు అందుకు విరుద్ధమైనవని వాదించారు. భాషా సంస్కరణను అభిలషించేవారికి స్వకీయమైన వ్యాకరణం లేదనికూడా వారు ఆక్షేపించారు.

"When I say grammar and grammatical forms, I mean the traditional grammar of the Telugu language and the forms sanctioned by it and employed by popular prose writers like Viresalingam and Lakshmarasiminham."

—K. Lakshmana Rao, as quoted by Gurajada, Minute of Dissent, p. 7.

'వ్యాకరణ' మంటే లక్ష్మణరావుగారి దృష్టిలో 'వ్యాకరణగ్రంథ'మై ఉంటుందని గురజాడవారు అధిక్షేపించారు (Ibid., p. 52):

"In para 11 he (K. L. Rao) says that the new school of linguistic reform has no grammar of its own. Here he probably means a treatise on grammar."

వ్యాకరణంవల్ల భాష 'స్థిర' మవుతుందని, భాషను స్థిరీకరించటంకోసమైనా ముందు వ్యాకరణంరాసి ఆ తరవాత వ్యావహారికరచనలు చేయమని గ్రాంథికవాదులన్నారు. భాషలో వచ్చిన మార్పులను ప్రతిఫలించటం మాత్రమే వ్యాకరణకర్తవ్యమని, భాష మారగానే వ్యాకరణం మారవలసి ఉంటుందిగాని, భాషకులేని 'స్థిరత్వం' వ్యాకరణానికి ఉండదని, 'స్థిర' లక్షణాలుగల వ్యాకరణం మృతభాషకు మాత్రమే సాధ్యమని వ్యావహారికవాదులన్నారు.

"The new school pointed out that grammar is not a fixed unchanging scheme but a body of rules deduced from usage; as usage

changes, so must grammar change; and when you have the perfect, perpectual, immutable grammar, the language is dead."

—A. Galleti, Gramyam and Grammar in Italy, వ్యాససంగ్రహం: పే. 14.

వ్యాకరణ ప్రయోజనం భాషను స్థిరీకరించటంగాదు. శిష్టవ్యవహారంలోని ప్రయోగాలను వివరించటం, ప్రయోగవైవిధ్య మున్నప్పుడు భిన్నరూపాల్లో ఏది స్పష్టమో, ప్రయోజనవంతమో విశదీకరించటం వ్యాకరణకర్తవ్యంగాని. భాషా స్వరూపం నిర్ణయించటం వ్యాకరణప్రయోజనం కాదని వ్యావహారికవాదులు కింది సైద్ధాంతికభాగాన్ని ఉద్ధరించి చూపేరు.

"In considering the use of grammar as a corrective of what are called ungrammatical experessions, it must be borne in mind that the rules of grammar have no value except as statements of facts; whatever is in general use in a language is for that very reason grammatically correct. A vulgarism and the corresponding standard or polite expression are equally grammatical each in its own sphere -if only they are in general use. But whenever usage is not fixed—whenever we hesitate between different ways of expression— then grammar comes in and helps us to decide which expression is most in accordance with the genius of the language, least ambiguous, most concise, or in any other way better fitted to express what is required."

-Henry Sweet, 'New English Grammar,' Part I, p. 5.

భాషలో పాండిత్యం సంపాదించటానికి వ్యాకరణాలు తోడ్పడవని, భాషా దోషాలను పరిహరించటానికి వ్యాకరణాధికారం పనికిరాదని, అప్రామాణిక ప్రయోగాలనూ స్థానికమాండలికప్రభావాలనూ తొలగించేవీ తొలగించగలవీ సంఘ ధర్మాలేనని వ్యావహారికవాదులు వాదించారు.

"We do not study grammar in order to get mastery over our own language, because in the nature of things we must have that

mastery before we begin to study grammar at all, nor is grammar of much use in correcting vulgarisms, provincialisms and other linguistic defects, for these are more dependent on SOCIAL influences at home and at school than grammatical training" — Ibid, pp. 4-5

భాషను శాశ్వతంగా స్థిరీకరించే ప్రయత్నాలు మన పూర్వులు కూడా చేయలేదని, ఆయా కాలాల్లోని శిష్టవ్యవహారాన్ని ఆధారం చేసుకొని వ్యాకరణ సూత్రాలను సరిదిద్దటం అనూచానంగా వస్తున్న సంప్రదాయమని, అసంగతాశ్లీలాదులే గ్రామ్యంగాని వ్యావహారికం కాదని, ఉచ్చారణలో లేని లిపి సంజ్ఞలను (అర్ధానుస్వారశకట రేఫాదులను) ప్రయోగించటం ఈనాటి ధర్మాలకు విరుద్ధమని, ఏనాటి అన్యదేశ్యాలకు ఆనాటి భాషలో శిష్ట వ్యవహారకారణంగా ప్రయోగాలు ఉన్నప్పుడు స్వీకార్యత ఉంటుందని తాతా సుబ్బారాయుడు శాస్త్రిగారివంటి వైయాకరణులు కూడా 1912 నాటికే అంగీకరించారు.

"అన్ని వ్యాకరణములకంటె విపులమగు పాణిని వ్యాకరణముగూడఁ బూర్ణముగను నిస్సందిగ్ధముగను, భాషను సంస్కరింప సమర్థము కాకపోయెను. ఈ విషయ మాకృతిగణములు చెప్పుటవలనను, 'పృషోదరాదీని యథోపదిష్ట'మ్మనెడి సూత్రమువలనను, దయ్యాన్త్రిభాష్యమువలనను, స్పష్టమగుచున్నది....ప్రకృతము బంగాళాభాషను సంస్కరించి యందు నూతన గ్రంథములను వ్రాయుట యెల్లరకుం దెలిసినదే. ఇట్లే ప్రాచీనకర్ణాట మనియు నూతనకర్ణాటమనియు విభాగము గలిగినది. ప్రకృతమగు నాంధ్రభాషలోను 'దేశ్యము' 'గ్రామ్యము' అని విభాగించిరి. ఈ విభాగమునకుఁ దాత్పర్య మాలోచింపఁగా నాంధ్రదేశమునం దంతటను వాడుకలో నుండు పదములు దేశ్యములనియుఁ, గొన్నికొన్ని గ్రామములలో మాత్రము వాడుక చేయఁబడు పదములు గ్రామ్యములనియు, గ్రామ్యపదములను గ్రంథములలో వ్యవహరించినచో నా గ్రంథమునం దంతటను విదితములు కావు గనుక వానిని విడిచి దేశమం దంతటను దెలిసికొనఁదగు దేశ్యపదములను వ్యవహరించుట సకలాంధ్ర దేశోపకారమనియుఁ, బ్రాచీనుల యభిప్రాయమని నిశ్చయింప నవకాశము గలదు. నగరములందును, నగరప్రాంత గ్రామములందును, వాడుక చేయఁబడు భాష దేశ్యమనునట్టి కేతన కిదియే యభిప్రాయమని చెప్పవచ్చును. ఎట్లనఁగాఁ బట్టణములలోనుండు జనులకుఁ బరస్పర సంబంధముండినట్లు పల్లెలలో నుండువారి కుండదు. పరస్పరసంబంధ మున్నప్పుడు భాష యేకీభవించుట కవకాశముగలదు గాన నట్టి భాష దేశవిదిత మని కేతన యూహించినట్లు చెప్పవచ్చు. అట్లు కానిచో దేశ్యశబ్ద

సారస్యమునకు భంగము కలుగును ... ప్రాచీన కవుల కట్టి స్వాతంత్ర్య ముండుటకును, ప్రకృతి కవులకు లేకుండుటకును కారణ మున్నదా? గ్రంథకర్తలు కాకున్నను ప్రాజ్ఞులగు నాగరకు లార్యులు కారందురా? వారి వ్యవహారము గూడ నేల గ్రాహ్యము కాఁగూడదు?.... భాషయనఁగా స్వాభిప్రేతార్థమును నితరులకు వ్యక్తపరచుటకై యుచ్చారితవర్ణసమూహముకాని వర్ణానుమాపక రేఖా సముదాయము కాదు. ఈ నిర్వచనమును, మహాభాష్యమునందుఁ బతంజలి 'యేనోచ్చారితేన సాస్నాదిమాన్ సమ్ప్రత్యయతే స శబ్దః' అను గ్రంథముచే స్పష్టపఱచెను. 'ఉచ్చారిత ఏవ శబ్దః ప్రత్యాయకో నానుచ్చారితః' అను భాష్యగ్రంథము గూడ నీ నిర్వచనమునే సూచించుచున్నది .. ఉచ్చారణభేదము లేనిచో లిపి భేదము శబ్ద భేదప్రయోజకము కానేరదు ... ప్రకృతకాలమున నర్ధానుస్వారరేఖ యుచ్చారణభేద జ్ఞాపకము కాకుండుటచే ని ర య నా వ శ్య క ము .... ఇట్లే శకటరేఫ మనావశ్యకమని యెఱుంగునది."

—ఆంధ్రభాషా సంస్కరణము. ఆం. సా. ప. ప., 2-3. పే 277-283.

ఏనాటి శిష్టవ్యవహారం ఆనాటి ప్రామాణిక భాషావిశేషమే నని, ఆయా కాలాల్లోని వ్యాకరణ గ్రంథాలు వాటికి సాక్షులుగా భావించాలని. ఒకనాటి గ్రామ్యం మరో కాలంలో ప్రామాణికం కావచ్చునని వఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు వాదించారు.

"పూర్వవ్యాకరణము లనుటచే .... మహాభారతమె గ్రామ్యపదభూయిష్ఠము గానలసివచ్చును .... తద్వ్యవహారమున నున్న భాషానియమము నెత్తి వ్రాసిన నదియె వ్యాకరణము. కాబట్టి తత్తత్కాల వ్యవహారభాషకుఁ దత్తత్కాలిక వ్యాకరణములు ప్రమాణములై యుండును .... పురాతనాంధ్రవ్యవహారకాలమున నాగరక వ్యవహారస్థము లగుటచే నవి గ్రామ్యములే యైనను వానిలో 'పంపేరు, తెంపేరు, చూపేరు, ఇస్తిని' మొదలగు పదము లిప్పటి నాగరకవ్యవహారభాషలోఁ బ్రవేశించినవి కనుక నవి యీ భాషలో గ్రామ్యములు కావు. తక్కిన 'ఉనుతి, యుండాము, సూసేరు' మొదలగు పదము లిప్పటికిని గ్రామ్యజనవ్యవహారమాత్రస్థములే యగుటచే నవి యీ భాషయందును గ్రామ్యములే యనుట నిర్వివాదాంశము"

—ఆంధ్రభాష, ఆం. సా. ప. ప., 2.4, పే. 386-391.

ఏవో కొన్ని వ్యాకరణసూత్రాలనో నిఘంటువులనో నిర్మించినంతమాత్రాన భాష స్థిరపడదని, అందుకు ప్రయత్నించినవారంతా విఫలప్రయత్ను లైనారని గిడుగువారు వాదించి అందుకు పాశ్చాత్య పండితానుభవాలను కొన్నింటిని ఏకరీక

రించారు (చూ. భాషను స్థిరీకరించగలవా రెవ్వరు?, వ్యాసావళి, పే. 98–102). ఈ సందర్భంలో లౌన్స్బరీ అనే ఆంగ్ల విద్వాంసుడి అనుభవపూర్వకవాక్యాలు గమనార్హాలు:

"Dr. Johnson in the plan of his dictionary issued in 1747, declared that one end of his undertaking was, 'to fix the English language'. But a man could not compile vocabulary of the tongue without learning something of the nature of speech. By the time he finished his work, he had been cured of this particular error. It seemed impossible for most men of the past—the impossibility continues for most men of the present–to comprehend the elementary principle that in order to have a language become fixed, it is first necessary that those who speak it should become dead, at least intellectually, if not physically. Then indeed, it can undergo no change for there is no one to change it."

—The Standard of Usage by Lounsbury, p. 143.

ముందు వ్యాకరణసూత్రాలను మార్చి తరవాత ప్రయోగించమన్నవారికి గురజాడ వారు మంచి సమాధానమే చెప్పేరు(Minute of Dissent, pp.51–52):

"To change the rules of grammar first and to seek to change usage in accordance with such change is an impossible process in respect of a living language and wanton vandalism in respect of a language that is dead"

§ 6.72 మాండలికాలను అన్యభాషా పదాలను, చివరకు గ్రామ్యపదాలను కూడా నిఘంటువుల్లో చేర్చటానికి వేదం వేంకటరాయ శాస్త్రిగారు అంగీకరిస్తూనే వుండేవారు.

"గ్రామ్యములని తెలుపుటకేనియు, విచ్ఛిత్తివిశేషముంబట్టియేనియు, కొన్ని గ్రామ్యములను, వాక్యములంగూడ, గ్రహింపవలయును ... ఆంధ్రదేశ్యములవలెనే అన్యదేశ్యములును ప్రయోగవ్యవహారరూఢములు నిఘంటువున నుండవలసినవే.... సంస్కృతమందును అన్యభాషాపదములు కలవు .... వ్రాతలోను అచ్చులోను ఉన్నమాత్రాన కంఠోక్తలక్షణవిరుద్ధమును ప్రమాణీకరించుట సాధుమతము గాదు.

'శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవదుచ్యతే, అనిష్పన్నపదే తేన ప్రయోగాశ్రయణం మతమ్'"—ఆంధ్రభాషా సర్వస్వార్థ నియమ కతిపయములు, పే. 4-26.

జయంతి రామయ్యగారు మాత్రం ఆధునికకవిప్రయోగాలను నిషేధించటానికి వీలుగా ఏదో ఒక కాలం తరవాత ప్రచురితమైన పుస్తకాలను నిఘంటువుల్లో ఉదాహరించరాదని, అర్వాచీనగ్రంథాలు ప్రామాణికాలు కావని వాదించారు.

"It will perhaps be desirable to fix a time-limit and rule that no book written after that limit should be quoted from. This will shut out almost the whole of Telugu literature which is quite recent and can not lay much claim to authority."

—Defence of Literary Telugu, p. 3.

ఇది ఏలాటి ప్రమాణమో ఎంతవరకు సాధ్యమో ఆయన గమనించినట్లు లేదు. జొనాథన్ స్విఫ్ట్‌వంటి ఆంగ్ల విద్వాంసుడు 'mob' వంటి మాటలను భాషలో ప్రయోగించరాదనే ఉద్యమం నడిపి, నిష్ఫలారంభుడై, చివరకు తానే ఆ పదాలను వాడిన సంగతి బహుశా ఆయనకు తెలిసివుండదు (చూ. వ్యాసావళి. పే. 98) పాపం. భాషా పరిణామక్రమాన్ని ఆపటం సాధ్యంకాదని దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు గ్రహించారు గాని ఆ మార్పులను చూసి 'ఆనందించటం మాత్రమే' భాషాభిమానుల కర్తవ్యమని నిష్క్రియాభిమానం చూపమని ఆయన బోధించారు. (చూ. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1925; సర్వాంధ్ర సాహిత్య వీధులు, 2.192):

"....ఇట్టి మార్పులన్నిటికి ప్రవాహరూపమున నుండు వ్యవహారమే కారణము. ఈ ప్రవాహమును నివారింప శక్యము గాదు. నివారింప యత్నించుట సమంజసముగాదు. ఇట్లు మారుచున్న శబ్దములను వాని యర్థములను గ్రహించుచు దీనినిబట్టి వ్యవహారబల మన నెట్టిదో వాని పరిగ్రాహ్యతను లోకమునకు బోధించుచు నానందించుట మాత్రమే భాషాతత్త్వ జిజ్ఞాసువులకు గర్తవ్యము".

జిజ్ఞాసువుల విషయం ఎలావున్నా భాషాసహజపరిణామాన్ని ఆటంకపరిచినప్పుడు భాషావ్యవహర్తలు ఆనందించటంతో సరిపుచ్చుకోరు. అధికారవ్యవహారమూ పఠన పాఠనాలూ ఎన్ని అడ్డంకులు పెట్టినా, ప్రజా సామాన్యంలో విద్యాభివృద్ధి కలిగినప్పుడు, రాజకీయావకాశాలుగాని సాంఘికవసతులుగాని, సమకూడి

నప్పుడు, ఒక్కసారి విజృంభించి అధికారభాషను మృతభాషగా మార్చి తాము తమభాషను ప్రత్యేకభాషగా చేసుకుంటారు. మధ్యయుగాల యూరప్‌లో లేటిన్ దురహంకారులకు గుణపాఠం చెబుతూ ప్రజాభాషను దేశభాషగా నియమించారు.

"In the first Christian centuries the influence of Latin was so over-powering in official life and in the schools that it obstructed a natural development. But soon after the 3rd century, the educational level rapidly sank, and political powers broke the power of not only of Rome, but also of its language. The speech of the masses, which has been held in fetters so long, now asserted itself in full freedom and with elemental voilence, the result being those far-reaching changes by which Romantic Languages are marked off from Latin. Language and nation or race must not be confounded."

— Pucariu as quoted in Otto Jespersen's Language, its Nature, Origin and Development, p. 206.

కొందరు గ్రాంథికవాదులు అసలు భాషలు మారనే లేవని, ఉచ్చరితలిఖితాంధ్రాలనే భేదమే మన భాషలో లేదని దబాయించారు. 1912 మే నెలలో మద్రాసు పచ్చయప్ప కళాశాలలో జరిగిన పండితసభలో పాల్గొన్న పెద్దలు ఈ విశ్వాసం ప్రకటించారని ఆనాటి పత్రికలు సాక్ష్యమిస్తున్నాయి:

"....there is no need for the reform as there is, strictly speaking, no such thing as spoken as different from written Telugu." — Madras Times, May 17, 1912; Minute of Dissent, p. 53.

పైమాటే నిజమయితే శిష్టవ్యవహారభాష అనుపాదేయమనే వాదానికి అర్థమే లేదు. వ్యావహారికరచనలను నిరసించటం బహిష్కరించటం అర్థశూన్యమైన ఉన్మత్తచర్యలే గదా.

పండితులు వాదోపవాదాలు చేస్తుండగా పేరు మోసిన విద్వత్కవులు తిరుపతి వేంకటేశ్వరులు యథేచ్ఛగా రచించి ఆక్షేపించిన వారిని సవాలు చేశారు:

"కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశ భా
షాలలితాంగి మాఱుటది సత్కవి సమ్మతమౌట, నన్యదే
శ్యాలను నాంధ్రభాషఁగల పాటను, నౌచితిఁబట్టి మేము క
వ్యాలను వాడుచుంటి మవి పండితు లేగతి నొప్పకుందురో?"
—పాణిగృహీత, 1-19.

ఏదో తాతలనాటి సూత్రాలను వల్లించటమేగాని భాషాస్థితిని లోకవ్యవహారాన్ని సంఘధర్మాలను గమనించని వాళ్ళెవరూ పరిణామ చక్రాన్ని ఆపుమనరు- ఆపుదామని కలలో కూడా సంకల్పించరు. యుక్తాయుక్త విచక్షణలేని శాస్త్ర విజ్ఞానం అజాగళస్తనం వంటిది. "కేవలం శాస్త్ర మాశ్రిత్య నకర్తవ్యో వినిర్ణయః, యుక్తిహీన విచారేతు ధర్మ హానిః ప్రజాయతే" అని గుర్తించిన వారంతా క్రమంగా వ్యావహారిక వాదం సమర్థించటం మొదలుపెట్టేరు. 'మార్పు' 'సత్కవి సమ్మతి' మనీ, 'క్షణే క్షణే యన్నవతా ముపైతి తదేవ రూపం రమణీయతాయాః' అనీ ఆలంకారిక దృక్పథం అలవర్చుకున్న రచయితలు కాలగతిలో ఈ వాదం వైపు మొగ్గేరు. మొదట 'ప్రామాణికభాష' అంటే 'గ్రాంథిక భాష' అని భావించిన పండితులుకూడా (చూ. కేతవరపు రామకోటిశాస్త్రిగారు, ప్రామాణిక భాష: తెలుగు తీరు తెన్నులు- ప్రభుత్వ కర్తవ్యం, ఆంధ్రపత్రిక సారస్వతాను బంధం, అక్టోబరు 15, 1955; బూదరాజు రాధాకృష్ణ, ప్రామాణికభాష, ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం, అక్టోబరు 30, 1955; బొడ్డుపల్లి పురుషోత్తంగారు ప్రామాణిక భాష, ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం, నవంబరు 14, 1955; బూదరాజు రాధాకృష్ణ, ప్రామాణిక భాష, ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం, డిసెంబరు 4, 1955; ఈ వివాదాలకు ప్రధాన కారణం గంటిజోగి సోమయాజిగారి ఆంధ్ర భాషా వికాసము, ప్రామాణిక భాష, 1948 ముద్రణం, పే. 235-41; ముఖ్యంగా పే. 238; 251 కూడా). ఇరవై యేళ్ల తరవాత మొదటి అభిప్రాయం మార్చుకోక తప్పలేదు.

"....ఏ రూపమున భాష యుండవలయును-చేయుచు అని వ్రాయవలెనా, చేస్తూ అనియా యనునది యల్ప విషయము. ఏ రూపమును వ్రాసినను అభ్యంతరము కలుగదు. భాషకు ఏకవిధమయిన ప్రామాణికత్వము వెలయవలయును. ఆ ప్రామాణికభాషకే ఒక్క తీరుననే వ్రాతయు, మాటయు శ్రేష్ఠులలోనైన నుండవలయును. అప్పుడు వారినే సామాన్యు లనుకరించుటచే భాషకు ఉన్నతి కలుగును - మార్పు విషయమున భాషా చక్రము వెనుక తిరుగదనియు, ముందువకే పోవుననియు భాషావిదుల యనుభవము."

—గంటి జోగి సోమయాజిగారు, ఆంధ్రభాషా వికాసము (1968) పే. 597.

§ 6.73 మాండలిక పదాలు చేరి 'భాషాపరిశుభ్రత' చెడిపోతుందనే భయం వల్ల వ్యావహారికరచనలను వ్యతిరేకించటం మన పండితమండలికి అనూచానంగా వస్తున్న దౌర్బల్యం. ఈ భావం తొలిగి పోవటానికి చాలా కాలం పట్టినా, అనుమానాలు ఇప్పటికయినా పూర్తిగా తీరేయని చెప్పలేము. నన్నయనాటినుంచి చిన్నయ నాటివరకూ ఉన్న 'ప్రామాణిక' కవులందరి రచనల్లోను మాండలికపదాలు కనిపిస్తూనే ఉన్నాయని ఉదాహరించాను. అన్యప్రాంతాల వారికి అర్థం కాని స్వమండల పదాలను కావాలని ఏ కవీ ప్రయోగించడు. కాని, అర్థస్ఫురణకు తనకు తృప్తి కలిగించే పదాన్ని వాడటంవల్ల అనుకోకుండా కొన్ని మాండలిక పదాలు దొర్లవచ్చు. ప్రామాణికభాషారూపాలను సరిగా ఉచ్చరించనందువల్ల మాండలికాలు ఏర్పడతాయనుకోవటం దురభిప్రాయం. మాండలికాలు ఒక జాతికి ప్రామాణిక భాష ఏర్పడటానికి ముందూ ఉంటాయి; ఏర్పడుతున్న సమయంలోనూ ఉంటాయి; ఏర్పడ్డ తరవాత కూడా ఉంటాయి. ప్రామాణిక భాషా రూపంలో ఒకే ఒక పదం ఉన్నప్పుడు మాండలికాల్లో పదిరూపాలు పర్యాయోపయోగంలో ఉండవచ్చు. పదపదానికీ అర్థస్ఫూర్తిలో ఛాయాభేదాలుండవచ్చు. సాహిత్యంలో ఈ స్ఫూర్తిని కలిగించటానికే మాండలిక పదప్రయోగం కొన్ని సమయాల్లో తప్పనిసరి కావచ్చు. అది కూడా అనాలోచితంగానే జరగవచ్చు. స్పష్టంగా, విస్పష్టంగా, సుస్పష్టంగా తన అభిప్రాయం వ్యక్తీకరించే ప్రయత్నంలోనే రచయితలు సాధారణంగా మాండలిక పదజాలంలోని ఈ శక్తిని గుర్తిస్తారు. ఈ మాండలికాలవల్లనే భాషలో పర్యాయ పదాలు ఏర్పడతాయని ఇంతకు ముందు విశదీకరించాను. మాండలిక పదాలకున్న సూక్ష్మార్థ ప్రకటన శక్తిని భాషావేత్తలు గుర్తించారు.

"It has been one of the fatal mistakes in the science of language to imagine that dialects are every where corruptions of the literary language. Every where there has been a litreary language, dialects are by no means mere modifications of it....

"When literary languages have stereotyped one general term, their dialects will supply fifty, though each with a special shade of meaning."

—Max Muller, Science of Language, 1.58

"Popular dialects, in spite of many archaic details, are on the

whole further developed than the various standard languages with their stronger tradition and literary reminiscences."

—O. Jespersen, Language, its Nature, Origin and Development, p. 68.

ఒక మాటకున్న అర్థాన్ని అది ఉపయుక్తమైన ప్రకరణాన్ని (context) బట్టి గ్రహించటం ఎప్పుడూ సాధ్యమే. నిఘంటుకారులు శబ్దార్థనిర్ణయాన్ని నిరూపించే విధానం సందర్భాన్నిబట్టి అర్థాన్ని ఊహించటమేగాని అన్యంకాదు. ఈ పనే సామాన్య ప్రజలయినా చేస్తారు. మాండలికభాషయందు రచన ఎవ్వరూ చేయరు. తమ తమ మాండలికభాషారూపాల్లో రచించినంత మాత్రాన సాహితీ గౌరవానికి భంగమూ కలగదు. అందుకు మన పూర్వకవులే నిదర్శనం. షేక్స్పియర్ లండన్ మాండలికంలో రాసినందున ఆయన గౌరవమేమి చెడలేదు (Ibid.,p 322, quoting Krauter's statement: "that it is not fatal to poetry is seen in the language of Shakespeare"...)

టస్కాన్ మాండలికంలో రాసిన డాంటేకి గాని, స్కాచ్ మాండలికంలో రాసిన బర్న్సుకుగాని, కలకత్తా మాండలికంలో రాసిన రవీంద్రనాథ్ టాగూర్‌కు గాని రాని అగౌరవం, అప్రామాణికత్వం ఇతరుల కెందుకు రావాలో —ఎవ్వరో— బోధపడదు. పెద్దపెద్ద రచయితల గ్రంథాల్లో స్థానం సంపాదించిన మాండలికపదాలకు ప్రామాణ్యం దానంతట అదే సిద్ధిస్తుంది. వాగ్వ్యవహారంలో, లిఖిత వ్యవహారంలో ఉన్న ఆనాటి పదజాలాన్ని కోశస్థం చేయటమే అర్థబోధ సాధించటానికి మంచి ఉపాయం.

"మాండలికభేదము లుంటే నిఘంటువులు వ్రాసి వాటిని చూపండి."

—తాతా సుబ్బరాయశాస్త్రిగారు. శిష్టభాష. ప్రతిభ. నవంబరు 1936. పే. 176.

పైమాటనే గిడుగువారు అప్పటికి ఇరవైయేళ్ళ క్రితమే అన్నారు (చూ. వ్యాసావళి. పే. 85). మాండలికాలను గురించిన వరకు వారి 'వ్యాసావళి' (పే. 156–157), 'బాలకవి శరణ్యము.' (పే. 271-74) ప్రామాణిక పఠనీయాలు. ఇప్పుడిప్పుడే 'మాండలికపదకోశాలు' ప్రచురితా లవుతున్నాయి. ఇవి అనేకంగా పరిస్ఫుటంగా పర్యాప్తంగా వెలువడ్డప్పుడు ఈ ప్రశ్నే రాదు—ఉండదు.

ఆధునికవచనసాహిత్యంలో ఇప్పటికే ప్రసన్నరచనలు వచ్చాయనీ మాండలిక భేదాలు పోయననీ మొదట ఆక్షేపించినవారే ఇప్పుడు తెలుసుకున్నారు.

"గ్రాంథిక, వ్యావహారికము లనుపేర 1918 వ సంవత్సరమున నుండిన వైమత్యము 1948లో చాలవరకు నశించిపోయినది. 1968 లో ఆ భేదమే చెప్పు కొనవలసిన యవసరము లేదు. అయినను కొందరు మృతసర్పములను మోయువారు ఎప్పుడైనను ఆ భేదమును స్వలాభముకొరకు పేర్కొనుచున్నారు. ప్రజారంజ నముకొరకు బయలుదేరిన సినిమాలు, రేడియో ప్రసారములు, వార్తాపత్రికలు, దైనిక పత్రికలు భాష కొరకు నూతన స్థితిని తెచ్చిపెట్టినవి .. దక్కని నుడికారము సిద్ధమగుచున్నది. అది మనము మాటాడు భాషకు విశేషము దూరముకాక, మాండలిక భేదములను తొలగించి, మధురమై విశిష్టముగా నున్నది."

గంటి జోగి సోమయాజిగారు. ఆంధ్రభాషా వికాసము (1968). పే. 598.

§ 6.74 గ్రాంథిక వ్యావహారికవాదాలు ముమ్మరంగా ఉన్న రోజుల్లో వ్యావ హారిక సాహిత్యం లేదని అధిక్షేపించటమేగాక చేతనైతే శుష్కవాదాలు మాని క్రియాత్మకంగా రచించి చూపమనే అవహేళనలు సవాలుమాటలు వచ్చాయి.

"పేరున్నవో లేనివో యుండదగినవో కానివో యేవో కొన్ని గ్రంథము లను గ్రాంథికవాదులే వ్రాసిరి గాని గ్రామ్యవాదులు వ్యావహారికభాషాశాస్త్ర విష యక పూర్వపక్షసిద్ధాంతములతోడనే కాలము వృథ సేయుచున్నారు"

—పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు, ప్రకీర్ణోపన్యాసములు. పే. 255.

ఈ ఆక్షేపణకు ఆనాడు సమాధానం చెప్పుకోవలసిన దుస్థితి వచన వాఙ్మ యానికి సంబంధించినంత వరకూ గ్రాంథికవాదులకే పట్టింది. ఈ విషయంలో విస్త రించటం నిష్కారణ శ్రమమాత్రమే.

ఇప్పటి కింకా ఇంతో అంతో అంటిపెట్టుకున్న ఒకటి రెండు విశ్వాసాల్లో కవి భాషానియంత అని, కవిత కెక్కిన భాషాభాగం అంతరిస్తుందని భావించటం ముఖ్యమైనది. బహుశా ఈ ఉద్దేశంతోనే 'పద్యానికి గ్రాంథికం—గద్యానికి వ్యావ హారికం'అనే విచిత్రవాదం ఇంకా కొందరు చేస్తున్నారు (చూ. నవ్యాంధ్ర సాహిత్య వీథులు. 3.555). కవియైనవాడు ఇతరభాషాభాషులకన్నా నిపుణుడనే విషయం నిర్వివాదమే. ఆ నిపుణత్వం అతనికి భాషానుశాసకత్వం ప్రసాదించదు. భాషలో మార్పులు తెచ్చేవాడుగాని భాషను నిర్ణయించేవాడుగాని కవి ఒక్కడే కాడు — ఆ భాషాభాషులయిన ప్రజలంతా. కవి నైపుణ్యం అతని భాషా'పాండిత్యం' మీదా 'రచనా పాటవం' మీదా ఆధారపడి సర్కీత మవుతుందేగాని అతడు భాషకిచ్చే కొత్త

నిర్దేశాలేమీలేవు. ఒక్క ఉదాహరణ. ఆంగ్లభాషనుండి అనేకపదాలు ఎరువు తెచ్చుకొని వ్యవహరిస్తున్న జాతి 'చెరిషించు, పెరిషించు' (cherish, perish) వంటి పదాలను ఒకానొక కవికుమారుడు ప్రయోగించినప్పుడు నిర్లక్ష్యంచేసింది—నిరాకరించింది—అనుకరించలేదు.[21] అంటే, భాషాస్వరూప స్వభావాలను నిర్ణయించేది ఆ భాషను మాట్లాడే ప్రజాసామాన్యమే గాని కవికాదని స్పష్టం. కవి అయినవాడు భాషలోని పదజాలాన్ని ఇతరులకన్నా ఎక్కువగా వాడవచ్చు. భాషలోని రచనా విధానాలను సామాన్యులకన్నా బాగా గ్రహించి వుండవచ్చు—ప్రయోగించవచ్చు. అంతే రచనారీతిగాని, పదసంఘటనా పద్ధతిగాని, వాక్యనిర్మాణ క్రమంగాని, భాషాస్వభావవిరుద్ధంగా ఉంటే దానికి స్వీకృతి లేదు; ప్రజాసామాన్యం దాని గౌరవించదు. గతానుగతిక, నిస్సార, సంకేతమయ, కవిత్వాన్ని లోకం ఆమోదించనట్లే, ఆదరించనట్లే స్వభావవిరుద్ధతకూ స్థానం లేదు. అంటే కవి భాష మనకు చేస్తున్న సేవ—దానికంటె ఇచ్చేదీ ఉపకరించిందీ ఎంతో తక్కువ.

"A common notion holds that great writers, such as Shakespeare and Milton are 'the architects of the English language'; that is, that individuals of special literary ability are those primarily responsible for the shape a language takes in the mouths of subsequent generations of ordinary speakers.

This theory .. is held with amazing tenacity by some scholars. Yet there is not a shred of evidence in its support ..

The architects of our language are not literary artists, but the masses of people who use the language for purposes. The greatness of a literary artist is not measured in terms of his stylistic novelty .. but by the extent to which he can develop freedom and variety of expression within the constraints imposed by the language. So far as language is concerned, the greatest of literary artists is infinitely more a recepient than a donor."

—C. F. Hockett, A course in Modern Linguistics, pp. 563-64.

పై కారణంవల్ల రచయితలు ఉపయోగించమని నిరాకరించినంత మాత్రాన నిత్యవ్యవహారంలో ఉన్న భాషకు వచ్చే అగౌరవప్రమాదాలేవీ ఉండవని గ్రహించాలి. స్వప్రయోజననిమిత్తమే స్వప్రతిష్ఠార్థమే రచయితలు భాషను ఉపయోగిస్తారు. వారు ఉపయోగించినా మానినా భాషాస్వరూపం నిర్ణయించేది వారు కాదు—భాషా వ్యవహర్తలయిన ప్రజాసమూహమే.

ఇలాంటి దురభిప్రాయాల్లో మరొకటి, భారతభాగవతాదుల్లోని భాషే నేటి వ్యావహారికభాషారచనల్లోని భాషకన్నా సులభతరమనేది. పోతనపద్యాలకు తలవూపే సామాన్యప్రజలే కాదు పండితుల్లోనే ఎంతమంది ప్రతిపదానికీ అర్థం గ్రహించి మెచ్చుకుంటున్నారనేది ఆత్మవిమర్శపూర్వకంగా వేసుకోవలసిన ప్రశ్న. భారతకథ గురించి బెత్తెడు ఎడంగా అందరికీ తెలుసు; ఆ కథమీద, అందులోని పాత్రలమీద పాఠకులకున్న ప్రేమాభిమానాలు 'గ్రంథగ్రంథుల'ను పట్టించుకోక పోయినా ప్రధానార్థం ఊహించేటట్లు చేస్తాయి. ఊహించటం గ్రహించటం రెండూ ఒకటే ననుకోవటం సరికాదు. ప్రాకరణికార్థంతో సరిపెట్టుకుంటూ చదివే ప్రాచీన కావ్యభాషాగ్రంథాలకూ ప్రతిపదరసాస్వాదన చేస్తూ చదివే నవ్యవచనగ్రంథాలకూ పోలికే లేదు. పూర్వకవుల గ్రంథాలన్నీ ఒకే విధంగా అర్థమయ్యే స్థితిలోగాని అర్థంగాని స్థితిలోగాని లేవు. ఆయావ్యక్తుల అభిరుచులనుబట్టి, గ్రంథగతవిషయాన్ని బట్టి, విషయసౌలభ్యకాఠిన్యాలనుబట్టి, రాసే తీరునుబట్టి, పాఠకుల అధికారాన్ని బట్టి, గ్రంథం ఏ రకం వ్యక్తులకు ఎంతటి విద్యావంతులను ఉద్దేశించబడిందన్న విషయాన్నిబట్టి, అర్థం కావటం కాకపోవటమనేవి జరుగుతుంది. వ్యక్తినిష్ఠమైన ఈ లక్షణాన్ని ఒకవాదం మొత్తానికి ఆరోపించటం సరికాదు. వెయ్యి సంవత్సరాల నాటి భాషలో రాసినకావ్యాలకన్నా నేటి వచనరచనలు ఎన్నోరెట్లు ఎక్కువగా ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉన్నాయనేది వాస్తవం. అందువల్లనే 'ప్రజా బాహుళ్యం' వీటిని సమాదరిస్తున్నదని 'జయంతి' సంపాదకులే ఒప్పుకోక తప్ప లేదు (చూ. సం. 1, సం. 1, నవంబరు 1958, పే.1_4). గిడుగువారు ఉద్ఘోషించిన 'ప్రజాసాహిత్యం' (చూ. వ్యాసావళి, పే. 103_121) యుగధర్మాన్నిబట్టి ఇప్పుడు తెలుగులో అనంతంగా వస్తున్నది.

ఆధునికభాషలో పఠనపాఠనాలు జరిగినా, రచనలు అనంతంగా వచ్చినా ప్రాచీన సాహిత్యం క్రమంగా అర్థం కావటం మానివేసి సుదూరభవిష్యత్తులో నశిస్తుందనే భయమొకటుంది. వ్యావహారికరచనలు రాకపోయినా, అది బోధనభాష కాకపోయినా ప్రాచీనకావ్యభాష కాలప్రభావంవల్ల వ్యవహారదూరం అవుతునే ఉంటుంది.

అర్థం కావటం కాకపోవటం అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ ఉంటుంది. సాహిత్యం మీద అభిరుచి ఉన్నవాళ్ళు ఎన్నికష్టాలయినాపడి ప్రయత్నపూర్వకంగా ప్రాచీన భాషను అభ్యసిస్తారు. ఆ అభిరుచి లేనివాళ్ళు ఆధునికసాహిత్యం చదివి సరిపుచ్చుకుంటారు. ఎప్పుడైనా సాహిత్యాన్ని అందరూ చదువుతారని చెప్పలేం. చదివే వాళ్ళుకూడా అన్నిరకాల సాహిత్యాన్నీ చదువుతారని చెప్పలేం. అందుకు చింతించి ప్రయోజనంలేదు. ప్రపంచ మంతటా ఇదే పరిస్థితి. విద్యాసౌకర్యాలు పెరిగి నూటికి నూరుపాళ్ళు విద్యావంతు లయినప్పుడు పాఠకుల సంఖ్య సహజంగానే పెరుగుతుంది. గతకాలంలో సాహిత్యం పఠించిన వారి సంఖ్యకన్నా ఇప్పటి పాఠకుల సంఖ్యాబలం ఎంతో ఎక్కువ. అయితే విద్యావంతులందరూ పూర్వం తర్కవ్యాకరణసాహిత్యాదులయిన కొన్ని సారస్వతభేదాలను మాత్రమే చదవ గలిగి ఉండేవారు. ఇప్పుడో అశేషశాస్త్రాల్లో దేంట్లోనయినా ప్రవేశం సంపాదించటానికి అవకాశాలున్నాయి. శాస్త్రవిద్యాభిమానం ఉన్నవాళ్ళు తమకు ప్రత్యేకాభిరుచి ఉన్న ఏ ఒక్క శాస్త్రాన్నో చదువుకుంటున్నారు. శాస్త్రవిజ్ఞానం అవధులు లేకుండా పెరిగి పోతున్నందువల్ల నానాటికీ ఏదో ఒక శాస్త్రభాగాన్నో విభాగాన్నో ప్రత్యేక కృషి వల్ల నేర్చుకోగలుగుతున్నారు. అనంతసాహిత్యాన్ని కూడా అధ్యయనం చేయాలన్న నిర్బంధం పెట్టినా అది కొనసాగదు. నిర్బంధంవల్ల చదువురాదు; నిర్బంధించకపోయినా చదవదలచిన వాళ్ళు చదువుతూనే ఉంటారు. ప్రాచీనసాహిత్యాన్ని ప్రత్యేకించి అధ్యయనం చేసిన వాళ్ళు పూర్వకాలపు విశేషాలను ఈ కాలపు భాషలో అర్థం చేసుకొని ఇప్పటి వారికోసం ఇప్పటి భాషా రూపంలో వ్యాఖ్యానిస్తారు వారి అవసరం ఎప్పుడూ ఉంటుంది. ఈనాటి భాష సుదూరభవిష్యత్తులో అర్థం కాకుండా పోతుందనే వాళ్ళు లేకపోలేదు. ఈ భాషకూ పూర్వభాషకు పట్టిన గతే పట్టుతుందనుకోవటంలో కొంత యథార్థం, మరింత రాక్షసానందం మాత్రముంటాయి. నాగరకతతోబాటు విద్యా సౌకర్యాలు వార్తాసౌకర్యాలు తెగ పెరిగి పోతున్నాయి. భూగోళం నానాటికీ సంకుచితమై పోతున్నది. అన్యోన్యపరిచయం ఎన్నోరెట్లు అందుబాటులోకి వచ్చింది. వస్తున్నది. అనుక్షణసంబంధసాన్నిహిత్యాలవల్ల భాషారూపం ఏకీభవిస్తుంది. పరిణామక్రమం మందగిస్తుంది; వైవిధ్యం సన్నగిల్లుతుంది; మాండలికత నశిస్తుంది. ఫలితంలో నిన్నటి పరిస్థితి నేడు వస్తుందని నేటి పరిస్థితే రేపటి కుంటుందనీ భావించటం పొరపాటు. ఈ చర్చలు ఇలా సాగుతున్నా భాష వీటి కోసం ఆగలేదు; లోకం ఆగలేదు. ఇప్పుడు వ్యావహారికరచనలు సార్వత్రికమై పోతున్నాయి.

§ 6.8 ఆధునికవచనవాఙ్మయం వ్యవహారసన్నిహితభాషలో వికృత మవుతున్నది గదా! దీని సాధారణస్వరూప మేమిటనే ప్రశ్న సహజంగానే వస్తుంది. ఈ సాధారణ లక్షణమే ఇప్పటి ప్రామాణికభాషాస్వరూపం. ఒకానొక ప్రాంతీయ మాండలికానికి ఆధునిక శతాబ్దంలో ఆర్థికసాంఘికరాజకీయప్రాబల్యాలు కాలగతిలో తటస్థించాయి. కృష్ణా గోదావరీ నదులకు ఆనకట్టలు కట్టగానే వ్యవసాయం, దానివల్ల ఆర్థిక పరిస్థితులూ సాగరతీరంలో అభివృద్ధమైనాయి. రాజకీయప్రాబల్యం చేకూరింది. అశేషంగా పత్రికలు బయలుదేరాయి. ఆధునికప్రయాణసౌకర్యాలు, వార్తా వసతులూ ఏర్పడ్డాయి. పాఠశాలలూ కళాశాలలూ సంఖ్యాధికంగా పెరిగి ప్రజాసామాన్యానికి చదువు క్రమంగా అందుబాటులోకి వచ్చింది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఏర్పడగానే ఉన్నత విద్యాబోధన లభించడం మొదలయింది. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రభావమూ, ఆంగ్లేయపాలనవల్ల కలిగిన ఆధునికసౌకర్యాలూ సాగరతీరంలో ఎక్కువయ్యాయి. రాజకీయ చైతన్యం ప్రజ్వరిల్లింది. కందుకూరి వీరేశలింగంగారు తమకు తెలిసి సంఘ సంస్కారాన్ని, తెలియకుండానే భాషా సంస్కారాన్ని ఆ ప్రాంతంలోనే ఆరంభించి సాధించారు (**Minute of Dissent, p. 85**):

**"The author was hardly conscious that he led a reform in the world of letters, nor seemed to realise the magnitude of the problems which were raised by that reform."**

వేదం వేంకటరాయశాస్త్రిగారు 'పాత్రోచిత భాష' పేరిట అవ్యక్తంగానే ఆధునిక భాషారూపానికి సాహిత్యంలో స్థానం కల్పించారు. గిడుగు వేంకట రామమూర్తిగారి ప్రచారకోటి, గురజాడ వేంకట అప్పారావుగారి రచనాకోటి ఎందరికో ఆదర్శమైనాయి. రచయితలు భావకవిత్వం నుంచి అభ్యుదయకవిత్వం వైపు మొగ్గుచూపగానే ఆనాటి రాజకీయసాంస్కృతిక వాతావరణం కూడా వ్యావహారికవాదానికే సహాయపడ్డది. గ్రాంథికవ్యావహారిక వివాదాలు, తిరుపతి వేంకట కవుల అవధానసాహిత్యమూ మొదలైన అనేక సాహిత్యోద్యమాలు తీరాంధ్రంలోనే బీజావాపనం జరిగించి; అక్కడే అవి విస్తరించాయి; అక్కడే భాషాభ్యుదయవాదం నిలదొక్కుకుంది—చివరికి జయించింది. మొదటితరంనుంచి ఈనాటివరకూ

తదయితర్లో తీరాంధ్రవాస్తవ్యులే అధికసంఖ్యాకులు. ఆధునిక ప్రచార సాధనాలన్నీ అక్కడివారి చేతిలోనే ఉన్నాయి. ఇన్ని వసతులు సమకూడినందున తీరాంధ్ర భాష (కోస్తా ప్రాంతీయ మాండలికం) నేటి ఆధునిక ప్రామాణిక భాషగా పరిణమించింది. పైన పేర్కొన్న చారిత్రక సంఘటనలే అందుకు ప్రధాన కారణం.

ఈ విషయాన్ని ప్రాచ్య పాశ్చాత్య భాషావేత్తలు ఏనాడో గుర్తించారు.

"It (Telugu) is spoken in its purity along the coast strip between Nellore and Vizagapatnam and in the four districts of the Madras Presidency included within these limits."

—K. Veeresalingam, Introduction to C. P. Browns' Telugu English Dictionary, second revised edition, p.iv.

"The dialect spoken in the northern circars is usually considered the purest form of the language."

—Grieson and Sten Konow, Linguistic Survey of India, 4.577.

"The dialect spoken in the Krishna and Godavari districts, which is the purest and most largely used, has been taken as the standard."

—Arden in his Telugu Grammar, as quoted by G.V. Appa Row, Minute of Dissent, p. 43.

ఆ ప్రామాణిక భాష ప్రాంతీయ మాండలికమేగాని (regional dialect) వర్గమాండలికం (class dialect) కాదు. భాషకి గౌరవప్రదంగా ఉయోగించే ఇక్కడ భాష్యమే ఇది చారిత్రక పరిణామం.

§ 69 ప్రాచీనకాలంనుంచి నేనాటి వరకూ భాషావికాసంలో వచ్చిన క్రమ వికాసాలను కావ్య సాహిత్యాలతో పరిచయం చేస్తాను. ఈ క్రమ వికాసాన్ని భాషాచరిత్రమూ వ్యాకరణాలకరణం ప్రతిబింబించింది. కాబట్టి అదే

సమర్థనీయం. సంకుచిత భావాలను పరిహరించి భాషాశ్రేయస్సునూ దేశాభివృద్ధినీ గుర్తించి ఈ వాదాన్ని మరింత బలపరచటం మంచిది. శిష్టభాషనుగాని, చివరకు పరమమూఢుడైన పల్లెటూరి వ్యక్తి మాట్లాడే స్థానికమాండలికాన్ని గానీ పరిహసించటం తెలియనితనం. ఒకభాష ఆ భాషాభాషులకన్నా గొప్పదీ కాదు, తక్కువదీ కాదు అని గుర్తిస్తేచాలు. ఈ చారిత్రక పరిణామం అభ్యుదయ హేతువే

**"A language is no better and no worse than the men who speak it."**

**—Lounsbury as quoted by G. V. Appa Row, Minute of Dissent, p. 61.**

# 7. ఉపయుక్త ప్రధాన గ్రంథాలు

## I తెలుగు

(చాలా పుస్తకాలకు వ్యాసంలోనే వివరణ లిచ్చాను)
అధర్వణుడు - అధర్వణకారికావళి (వికృతివివేకము,) రెండో కూర్పు, మద్రాసు 1955.
అన్నమాచార్యుడు-ఆధ్యాత్మ సంకీర్తనలు, శృంగారసంకీర్తనలు
అప్పకవి-అప్పకవీయము, మద్రాసు, 1951
అప్పారావు, గురజాడ-గ్రామ్యశబ్ద విచారణము, 1910
అప్పారావు, విస్సా-సంపా. క్షేత్రయ్య పదములు, 1950
ఉమాకాన్తం, అక్కిరాజు-సంపా. పల్నాటి వీరచరిత్ర, రెండో ముద్రణం, క.శ. 5040
కామేశ్వరరావు, టేకుమళ్ళ-వాచిక భాష : రచనకి కొన్ని నియమాలు, 1938
కృష్ణమూర్తి, భద్రిరాజు-మాండలికవృత్తి పదకోశం I: వ్యవసాయపదాలు, 1962
కేతన-ఆంధ్రభాషాభూషణం (వజ్ఝలవారి పీఠికతో), తెనాలి, 1953;
గోపాలకృష్ణయ్య, వజ్ఝల-ధ్వనిలిపిపరిణామం, లేక ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారికభాష, పటమటలంక, 1956;
—వ్యావహారిక భాషా వ్యాకరణం, రాజమహేంద్రవరం, 1958
గోపాలకృష్ణారావు, కె—తెలుగుపై ఉర్దూ పారసీకముల ప్రభావము, 1968
చిన్నయసూరి, పరవస్తు-బాలవ్యాకరణము (దూసివారి వ్యాఖ్యతో), 1950
చిన సీతారామస్వామిశాస్త్రి, వజ్ఝల—ఆంధ్రభాష, ఆం. సా. ప. ప., 1912
జోగి సోమయాజి, గంటి—ఆంధ్రభాషా వికాసము, 1948; 1968
ధర్మారావు, తాపీ—కొత్తపాళీ
నన్నయ (?)—ఆంధ్ర శబ్ద చింతామణి, మద్రాసు, 1956
నరసింహం, కూచి—గ్రాంథిక భాష-గ్రామ్యభాష, కాకినాడ, 1914
నాగభూషణం, ఉండపల్లి—వ్యావహారిక భాషా సంప్రదాయ విమర్శనము, 1914
నారాయణరావు, చిలుకూరి—ఆంధ్ర భాషా చరిత్రము, 2 భాగాలు, 1937
పిచ్చయ్యశాస్త్రి, దీపాల—సంపా. చాటు పద్య రత్నాకరము, 1961
ప్రతాపరెడ్డి, సురవరం—ఆంధ్రుల సాంఘిక చరిత్ర, 1958
ప్రభాకరశాస్త్రి, వేటూరి—తెలుగు మెరుగులు, 1948;
—మిగడ తరకలు

ముద్దు నరసింహనాయుడు. సామినేని—హితసూచని 1862

రమణారెడ్డి కె. వి.—మహోదయం, 1969

రాధాకృష్ణ, బూదరాజు—మాండలిక వృత్తిపదకోశం IV: వాస్తు పదజాలం. 1968

—ప్రాచీనాంధ్ర శాసనాలు. 1971

రామకృష్ణారావు, అబ్బూరి; వేంకటావధాని. దివాకర్ల — నన్నయ పదప్రయోగ కోశము. 1969.

లక్ష్మీనరసింహారావు. పానుగంటి—గ్రామ్యవాద విమర్శనము, తణుకు 1913;

—ప్రకీర్ణోపన్యాసములు, రాజమహేంద్రవరము. 1918

వినోగ్రదోవ్, విక్టొర్; దెషిరివ్. యూనస్—భాష. భాషాభివృద్ధి. 1967

వెంకటరత్నం, తెలికిచర్ల—వ్యాస సంగ్రహము, గుంటూరు. 1933

వేంకటరామమూర్తి. గిడుగు—ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము;

—గద్య చింతామణి—ప్రథమ భాగము;

—బాలకవి శరణ్యము;

— వ్యాసావళి

వేంకటరావు. నిడదవోలు—ఆంధ్ర వచన వాఙ్మయము, మద్రాసు. 1954

వేంకటరాయశాస్త్రి వేదం—ఆంధ్ర భాషా సర్వస్వార్థనియమకతిపయములు,

—గ్రామ్యాదేశ నిరసనము;

—విసంధి వివేకము

వేంకట సీతాపతి. గిడుగు—సొద్దు. 1913

వీరభద్రరావు, కొత్తపల్లి—తెలుగు పై ఇంగ్లీషు ప్రభావము

వీరాస్వామయ్య. ఏనుగుల—కాశీయాత్రా చరిత్ర. 1888

శేషగిరిశాస్త్రి, టి. ఎం.—అర్థానుసారతత్త్వము. 1892;

—ఆంధ్ర శబ్ద తత్త్వము (క్రియా ప్రకరణము), 1948

—సారస్వతవ్యాసములు. ఆం. ప్ర. సాహిత్య అకాదమి

సీతారామయ్య. కురుగంటి; హనుమంతరావు. పిల్లలమఱ్ఱి — నవ్యాంధ్ర సాహిత్య వీధులు (నాలుగు భాగాలు)

సీతారామాచార్యులు. బహుజనపల్లి—ప్రౌఢవ్యాకరణము. మద్రాసు, 1848

సుబ్బారావు. వావిలికొలను—ఆధునిక వచన రచనా విమర్శనము;

.. వ్యాసరచన; సులభవ్యాకరణము;

సూర్యారావు, అవసరాల—సంపా. గురజాడ రచనలు

సోమశేఖరశర్మ. మల్లంపల్లి—ప్రాచీనాంధ్ర భాషా స్వరూపము, RPS. 50-72

## II. ఇంగ్లీషు

Appa Rao, G.V.— The Minute of Dissent to the Report of the Telugu composition sub-committee, 1914

Bloomfield, Leonard—Language, repr., London, 1955

Butterworth, A. and Venugopaul Chetty, V.—A Collection of the Inscription's on copper - plates and stones in the Nellore District (నె.శా.), 3 volumes, 1905

Gleason, H.A.—An Introduction to Descriptive Linguistics, 1955

Hockett, C.F.—A Course in Modern Linguistics, New York, 1958

Hudson—Story of Renaissance

Jespersen, Otto—Efficiency in Linguistic Change, repr. 2nd., 1949; Mankind, Nation and Individual from a linguistic point of view, Oslo, 1925; Language, its Nature, Origin and Development; The philosophy of Grammar, London, 1929.

Krishnamurthi, Bh.—Telugu Verbal Bases, Berkeley, 1961

Lakshmana Rao, K.—A Memorandum on Telugu Prose

Lounsbury—The Standard of Usage

Max Muller—Science of Language, 2 Volumes

Ramamurti, G.V.—A Memorandam on Modern Telugu, 19 3

Ramayya, Jayanti—A Defence of Literary Telugu, 1913

Sircar, D.C.—Select Inscriptions Bearing on Indian History and Civilisation, Calcutta, 1942

Srinivasachar, P. —A Corpus of Inscriptions in the Telingana Districts of H.E.H. The Nizam's Dominions,, 1940

Srinivasachar, P.T.— Life or Death — A Plea for Indian Vernaculars, 1911

Suri Sastry, P.—ed., The Gramya Controversy, 1912

Sweet, Henry— New English Grammar

Arguments for and against Modern Telugu, Scape & Co., Cocanada, 1914

Proceedings of the Legislative Council, Fort St. George Gazette, 5-5-1914.

# 8. అనుబంధం

## ఆక్షేపణలు – ప్రత్యుత్తరాలు

1. "శైలీ = సమవధానపూర్వికా ప్రవృత్తిః. సరళ, శీలము."

   కాదని చెప్పలేము. § 1.7 చూడండి.

2. "బాగుంది."

   కాబోలు!

3. "అహమ్మద్‌షా సుల్తాణ భూమిభృత్
   అహమ్మద్‌షా గుజరాత భూమిభృత్"

   నేను ఒక్క ప్రయోగమే ఇచ్చాను. అయినా 'అహమ్మదుషా' అనకపోతే ఛందోభంగం కాదా?

4. సప్తఋషులు — ప్రకృతివద్భావము ఉందికదా?

   చెఱకు = సరిక శబ్దభవమనే వాదం వుంది. కరుంబునుంచే కానక్కరలేదు. చకారాది ప్రయోగం నన్నెచోడునిది ఉన్నట్టుంది."

   § 3.3లో ఈ చర్చ వచ్చింది. 'సప్తఋషులైరి. వారు మరుద్గణంబు' అనే లక్షణప్రయోగం చూపి ఉచ్చారణభేదనిరూపణకు యతిస్థానంలోని ప్రయోగమిచ్చాను. ఇక్కడ ప్రకృతివద్భావవిషయమే ప్రస్తావనకు రాలేదు. నేనూ చకారాదిప్రయోగమే ఇచ్చాను; శబ్దవ్యుత్పత్తినిగురించిన చర్చ చేయనేలేదు. కాబట్టి భిన్నాభిప్రాయపరిశీలన అక్కడ అవసరం లేదేమో. వైయాకరణులు చూచి అహోబలుడి ప్రయోగానికిచ్చిన విలువ కవిరాజ ప్రయోగాలకు ఇవ్వలేము.

5. "సాహిత్యం ఉమ్మడి సొమ్ము. దానిలో చేరిన తర్వాత మాండలికాలకు మాండలికత్వంపోతుంది. మాండలికాలను వాడే ధైర్యం మహాకవికి, మహాపండితునికి ఉంటుంది."

   కాదనలేము. అందుచేతనే § 3.41 లో మహాకవులు ప్రయోగించిన కొన్ని మాండలికపదాలు ఉదహరించాను.

6. నన్నయ్య కాలానికి బ్రాహ్మణార్థం తద్దినమనే అర్థంలో వుందా? నిమంత్రణమనేది దేశవ్యాప్తమయిన పదం. బ్రాహ్మణార్థమనేది చాల ఇటీవలి అర్థం. మనకాలపు అర్థభేదంతో నన్నయ పదాలకు అర్థం చెప్పవచ్చా?"

§ 3.41 చూడండి. వరుసగా ఒకే పద్యంలో మూడుసార్లు నన్నయ ప్రయోగించిన శబ్దం 'బ్రాహ్మణార్థం'. మూడో ప్రయోగం (18-2-91) నేటి అర్థానికి సరిపోతున్నది. కానీ ఆ పదబంధానికి ఆనాడు ఆ అర్థం లేదంటే చేయగలది లేదు. మహాకవి అర్థభేదంలేని మాటలను పునరుక్తం చేశాడనటం మంచిదా?

7. "పాలీ ఎక్కడి భాష? అది పాటలీపుత్ర ప్రదేశమాత్ర నిష్ఠం కదా? అది గ్రాంథికమయిపోయి అశోకునిద్వారా దేశమంతా శాసనాలలో నిలవలేదా? జైనులది పాలీకాదు. అపభ్రంశం."

పాలీ ఎక్కడిదో నేను చర్చించనేలేదు. అది నిలిచిందో లేదో ప్రస్తావించలేదు. నాకు వచ్చిన ప్రశ్నకూ ఈ చర్చకూ సంబంధంలేదు. జైనులది అపభ్రంశమనేది మాత్రం నిజమే. § 4.6 చూడండి.

8. "ఇది నిజం కాకపోయినా, వ్యావహారికమనే పేరుతో కోస్తావారు బ్రాహ్మణ భాషను వ్యాపింపజేస్తున్నారు. దేవాదేవేషు యద్దేవ వంటివి పూర్తిగా వైదిక బ్రాహ్మణ వ్యవహారంలోనివి. భాషాదృష్టితోగాని, అర్థదృష్టితోగాని ఏలాటి పరిణామానికీ కట్టుబడనివి దేవాదేవేషు—తర్వాత మాటలలో వచ్చే 'ధ్వం' శబ్దం విలహాకాలికుల సూచకంగా గ్రహించబడి. వైదికులు వినోదార్థం వాడింది."

§ 5.7 చూడండి. జువ్వాది గౌతమరావుగారు వ్యావహారికం 'కృష్ణాజిల్లా బ్రాహ్మణభాష' అన్నారని పేర్కొన్నాను. ఇది నిజం కాదన్న నా వాదంతో ఆక్షేపకులు ఏకీభవిస్తూనే కోస్తావారంతా బ్రాహ్మణభాషాప్రచారం చేస్తున్నారంటున్నారు. వారిచ్చిన ఉదాహరణలే గనక అందుకు నిదర్శనమైతే మొదటి పదాన్ని వైదికేతరబ్రాహ్మణులు వాడుతున్నట్లు రుజువులేదు. 'ఎద్దేవ' = వెక్కిరింత అనే అర్థంలో చాలా ప్రాంతాల్లో ఉంది. వాడుకలో ఉన్న ఒక్కొక్క పదాన్నీ స్తనశల్యపరీక్ష చేస్తే ఏదో ఒక కులంలోనో ప్రాంతంలోనో కొన్ని మాటలు ఎక్కువ వాడుకలో ఉన్నట్లు తేలవచ్చు. ఒకవేళ 'యద్దేవ' లాంటి పదం కోస్తావారి వాడుకలోనే ఉందనుకున్నా, అది ఒక్కటే ఆ ప్రాంతీయభాషను బ్రాహ్మణీకరిస్తుందని చెప్పగలమా? ఆయా పదాలను వాడినంతమాత్రాన కులగోత్రాలు సమసిపోతాయా? తాపీవారు, నార్లవారు, మరెందరో ప్రముఖులు బ్రాహ్మణభాషాప్రచారమా ఇంతకాలం చేశారు? ఇది ఎవరైనా నిరూపించగలరా? కోస్తావారి వాడుకలో బ్రాహ్మణేతర

కులాలవారి వాడుకలో ఉన్న తెలుగు మాటలు అసంఖ్యాకంగా లేవా? అసలు విడివిడి మాటలేనా భాషాస్వరూపం నిరూపించేది? ఏమిటో మరి!

9. "ప్రాచీన సంస్కృత పరిభాషాలక్షణాలు తెలుగులో పట్టించడానికి ప్రయత్నించిన పండితులలాగే నేటి భాషా శాస్త్రవేత్తలు ఆధునిక భాషాతత్త్వవేత్తలు పాశ్చాత్య శాస్త్ర పరిభాషను ఇరికించడానికి ప్రయత్నిస్తున్నా రనుకున్నప్పుడు నాకు చాలా భయమౌతుంది."

ఈ వాక్యం § 6.2 కు ఎదురుగా రాశారు. § 6.1 చదివిన తరువాత రాసినట్లు కనిపించదు. ప్రాక్ప్రతీచీదృక్పథాలు రెంటినీ చేతనైనంతవరకు సమన్వయించాలనే ప్రయత్నించాను. అందువల్లనే 'ధాతు' వనేది యథార్థంగా భాషలో భాగం కాదనే మంజూషావాక్యాన్నీ, బ్లూంఫీల్డ్ వాక్యాలను ఒకేచోట అనుసంధించాను. అత్యాధునికకాలంలో సంస్కృతవ్యాకర్తల భాషాతత్త్వ పరిశీలనకు భాషాశాస్త్రజ్ఞుల పరిశోధనలకు ఎంత దగ్గర సంబంధముందో చదివినవారికిగాని తెలియదు. 'పరిభాష' భాషాతత్త్వం మార్చదు; అది భాషాతత్త్వవిశదీకరణలో పనికివచ్చే ఉపకరణం మాత్రమే.

10. "సంస్కృతం ఒకప్పుడు మాండలికంగా నైనా వ్యవహృతమయి వుంటుం దనేది నిశ్చయం. దానికి ఇటీవలి శాస్త్రజ్ఞుల వాదాలు చాలా తోడ్పడుతాయి."

ఈ వాక్యాలు § 6.21కు ఎదురుగా రాశారు. సంస్కృతభాష పూర్వరూపాపర రూపాల విషయం ప్రస్తావనికయినా రాలేదు. ప్రామాణికభాషాభేదాల విషయం మాత్రమే ప్రస్తావించటం జరిగింది. ఆక్షేపకులకు ఏ కారణం తోచిందో నాకు తెలీదు.

11. "సంస్కృత వ్యాకరణం ప్రమాణంగ గ్రహించడంవల్ల వారి ఆలోచనాధోరణి అలా వుంది. నేడు పాశ్చాత్యపరిభాషతో ఎన్ని అతార్కికవిషయాలు విలయ తాండవం చేయడం లేదు?"

ఈ వాక్యాలు § 6.31 ని గురించి రాసినవి. నా వాదనతో ఏకీభవించారు. సంతోషం. పాశ్చాత్యపరిభాషలోని అతార్కికతావిషయం ఇక్కడ అప్రస్తుతమే గదా.

12. "అప్పటి వైయాకరణుల పద్ధతి వేరు. ఇప్పటి భాషాశాస్త్రజ్ఞుల దృష్టివేరు. భాషలో ఏదీ అపరిగ్రాహ్యం కాకపోయినా, దృక్పథభేదంవల్ల మార్గమే మారు

తుంది. అంతమాత్రాన ప్రాచీనులు తక్కువవాళ్లని. దేశవాళీపండితులని ఈసడించటం న్యాయమా?"

ఈ వాక్యాలను § 6.32 కు ఎదురుగా రాసినా అది § 6.31 ను దీన్నీ కలిపి కలగాపులగంచేసి రాసినదని నా బుద్ధికి తోస్తున్నది. ఎందుకంటే § 6.31 లో ధ్వని లిపులకు భేదంలేదని భావించిన వారి 'అశాస్త్రీయత' ను చర్చించాను. భాషలో ఇది తప్పు. అది ఒప్పనే గ్రాహ్యాగ్రాహ్యానిర్ణయ విషయం పరిశీలించాను. ఒక వ్యక్తిగాని, విషయంగాని, వాదంగాని, ఒక విషయంలో అశాస్త్రీయం అంటే సర్వకాలసర్వావస్థల్లో అంతేనని ఎవరూ అనరు; నేను అనలేదు. వారి వ్యాకరణంలోని ఒకానొక విశేషం అశాస్త్రీయ మన్నంత మాత్రాన ప్రాచీనులందరూ అశాస్త్రీయు లన్నట్లు అర్థంకాదు. ఆ దృష్టే నాకు ఉంటే పతంజలిని, మంజూషను, రాయుడుశాస్త్రిగారిని ప్రామాణికంగా ఉదాహరించేవాడిని కాను.

ఇంకో విషయం. పండితాదులను వర్గీకరించటం స్పష్టతదృష్ట్యా అవసర మయింది. పరంపరాగతమైన భావాలను అనుసరించిన వాళ్ళను సంప్రదాయ పండితు లన్నాను. మనదేశం వాళ్ళే అయినా పాశ్చాత్య సిద్ధాంతాలను ఆధు నిక భావాలను అవలంబించే వాళ్ళనుంచి పైవారిని పృథక్కరించటానికి ఇది అవసర మయింది. స్వదేశీయ విదేశీయ పండితుల భావాలు భిన్నంగా ఉన్న ప్పుడు, దేశవాళీవిలాయితీపండితులని వేరుగా చెప్పవలసి వచ్చింది. స్వదేశ విద్వాంసులను ప్రత్యేకించి ఈసడించలేదు; 'దేశభాషలందు తెనుగు లెస్స' అన్నవాడు ఎంత అమాయకుడో ప్రపంచభాషలన్నీ తల్లిభాషనుంచి పుట్టె యన్నవాడు కూడా అంతే. ప్రత్యేక విషయాలను గురించి చెప్పిన మాటలను సామాన్యీకరణాలుగా, సామాన్యీకరించి చెప్పిన మాటలను ప్రత్యేకీకరణాలుగా భావించటం తగదు.

13 "దేనివల్ల జరుగుతుంది? లింగ్విస్టిక్స్‌వల్ల, రచనకంటే రచనను రాచి రంపాన పెట్టే శాస్త్రజ్ఞమ్మన్యులవల్ల జరుగుతుందా? ఇక్కడ ప్రజాస్వామ్యమా?"

దేనివల్ల జరుగుతుందో విభిన్న విద్వాంసుల అభిప్రాయాలను చర్చించిన § 6.33 చదివితే తెలుస్తుంది. 'లింగ్విస్టిక్స్‌వల్ల' జరుగుతుందని నే ననలేదు. నిజానికి శాస్త్రివల్ల జరగదని భాషాసహజస్వభావంవల్లనే జరుగుతుందని పరిశీలనవల్ల తెలుసుకోవచ్చు.

14. "చట్టాలకన్నా వ్యాకరణం స్థిరం. చట్టాలను పదిమంది వోటుతో మార్చుకోవచ్చు. కాని, వ్యాకరణం ఒకరితో మారేదికాదు."

నిజమే సరి. 'ఒకరితో' మారని వ్యాకరణం కూడా 'పదిమంది' వోటుతో మారుతుందిగదా.

15. "ఇప్పటి లింగ్విస్టిక్కులకు కూడా ఇది వర్తిస్తుంది. తిరోగామి—తిర్యక్ అంటే అర్థంకాని, వెనక్కు కాదు."

'లింగ్విస్టిక్కులు' కాదు బాబూ, లింగ్విస్టులు: 'తిరోగామి' శబ్దాన్ని 'పురోగామి' సామ్యంమీద రూఢిమీద ఆధారపడి నేను వాడినట్లే, మీరూ పొరపాటు పడ్డారు.

16. "ఏమిటి సార్ ఇది?"

ఇది ఆధునిక యూరపియన్ భాషల సంప్రదాయవ్యాకరణాల సంగతి లెండి. మనం వాటికి దూరంగా వున్నాం. భయంలేదు.

17. "ఇవన్నీ ఉచ్చారణకు, లిపికీ సంబంధం చాల తక్కువగా ఉన్న పాశ్చాత్యాద్ భాషలను పట్టిన దుర్గతులు. ప్రపంచభాషలు కన్ను తెరవకముందే వర్ణమాలను నిర్దుష్టంగాచేసుకొన్న సంస్కృతంలో ఇలాటి బాధలేదు."

§ 6.51 లో ఇంగ్లీషు స్పెలింగుల సంగతి ప్రస్తావించగా దానికిది వ్యాఖ్యగా రాసినట్లుంది. భాష కాక ప్రత్యేకక్లేశముందని కొన్ని భాషల విషయం చెప్పేను. ధ్వనిలిపులకు పూర్తి సంబంధమున్న భాషలే లేవు—బహుకాలం సారస్వతభాషలుగా ఉన్న వాటిలో. కాకపోతే ఇంగ్లీషులో ఈ బాధ అధికం. సంస్కృతంలోని అనుస్వారం ఎన్నిరకాల ఉచ్చారణలకు ఏకైక సంకేతమో గమనిస్తే ఇది తెలుస్తుంది తెలుగులో పై ఆక్షేపకులే 'వ్రాసిన' మొదలునా రాస్తున్నారు గదా (20 చూడండి); అలాగే ఉచ్చరిస్తున్నారా? అయితే సంస్కృతంలోని క్లేశం మరో రకం: దశలకారాలతో, ఆత్మనేపదపరస్మైపదాలతో, ఏకద్విబహువచనాలతో సంస్కృతక్రియారూపజ్ఞానం చాలా క్లిష్టమయిందే.

18. "మనవాదం అహంకారంతో ఉండరాదు. పాణిని నిమిషాన (?) సూత్రీకరణ పద్ధతి ప్రతిభ ఇప్పటి వారి కుందా?"

ఈ వాక్యాలు § 6.51 మీద విమర్శ. § 6.62 చూస్తే దానికి సమాధానం లభిస్తుంది. అక్కడ పతంజలిని పూజిస్తూ ఆయన సిద్ధాంతాలను పాటించటం లేదన్నాను. అలాగే పాణినిమార్గంలో రాసిందే వ్యాకరణమై తక్కినవి కావనటం తప్పని ముందు ప్రకరణంలో రాశాను. దానిమీద ఈ అధిక్షేపణ. పాణినిమీద ఏ భాషాశాస్త్రజ్ఞుడికీ అగౌరవం లేదు. ఆయన వ్యాకరణం "monum:nt of human inte'ligence" అన్నాడు బ్లూంఫీల్డ్. అంత మాత్రాన ఆయన సంస్కృతభాషకు రాసిన వ్యాకరణం పద్ధతిలో ఇతర భాషలకు వ్యాకరణాలు రాయాలనడం తప్పదా? నెపోలియన్ మహావీరుడంటే ఇతరులు కారనిగాని, ఆయన ఏ పొరపాటూ చేయలేదనిగాని, ఆయన అపజయం ఎరగడనిగాని చెప్పాలా? పాణిని ప్రతిభావ్యుత్పత్తులను నేను ప్రశ్నించలేదు. ఆ పాటి శక్తిలేనివాళ్ళు ఆయన్ను అనుసరించి తాము హాస్యపాత్రులై తమ ఆరాధ్యపురుషుణ్ని కూడా అపహాస్యంపాలు చేస్తున్నారంటాను — నెపోలియన్‌లాగా ఉండాలని రాస్కోల్నికోవ్ చెడిపోయినట్లు.

18. "ఎంత అహంకారం సార్, మీరు ఎవరో చెప్పిన ఆధునిక భాషాశాస్త్రంలో వేలు పెట్టినంత మాత్రాన,మౌలిక విషయాలు తీసిన ఒక మహావిద్వాంసుణ్ణి-అతడు పొరపాటు చేసినా ఇలా అనడం. సర్వజ్ఞమ్మన్యత్వం తగునా? ఇది అకస్మాత్తుగా,మౌలికంగా జరిగిందా? ఎన్ని శతాబ్దాల పరిణామంవల్ల కలిగిన జ్ఞానం! స్వకుచన (?) మర్దనం విశేషం. శాసన పదాలకు అర్థం తెలియదు కదా? శాసన భాషకు వ్యాకరణం ఏమిటో?"

ఈ వాక్యాలు § 6.53 కు ఎదురుగా రాసినవి. వీటిలో మొదటిది చిలుకూరి వారి 'ఆంధ్ర భాషా చరిత్ర'లో సైద్ధాంతిక దోషాలున్నా వన్నందుకు ఆక్షేపకుల ప్రతి దూషణ. నిజమే § 6.1 లో స్వతంత్ర శబ్దాలుగా ఉన్న సంస్కృత ధాతువులనుంచి తెలుగు మాటలు ఏర్పడ్డాయన్న చిలుకూరి వారి వాదం అటు 'ప్రకృతి ప్రత్యయ విభాగో కేవలం కాల్పనికో' అన్న మంజూషా వాక్యానికి, ఇటు బ్లూంఫీల్డ్‌వంటి భాషాశాస్త్రజ్ఞుల దృక్పథానికి విరుద్ధమన్నాను. అనకూడదా? ఈ ప్రస్తావన వచ్చినచోట సంస్కృత పరిభాషను మన పండితుల లాగా నేను పాశ్చాత్య పరిభాషను 'ఇరికించే' ప్రయత్నం చేస్తున్నానని అధిక్షేపణ చేశారేగాని (8 కింద చూడండి). నా వాదనను విమర్శించలేదు. మంజూష ఇచ్చింది పాశ్చాత్య పరిభాష కాదు గదా:

రెండో వాక్యం 'Telugu Verbal Bases' ప్రామాణిక గ్రంథమన్నప్పుడు ఆ గ్రంథకర్తకు 'శతాబ్దాల పరిణామంవల్ల' (—నుంచి కాదు) 'జ్ఞానం' కలిగిందన్నారు।

మూడోది మరి ఇద్దరిలాగా నేను కూడా శాసనాంధ్రభాషకు చారిత్రక వ్యాకరణం రాశానని చెప్పుకున్నందుకు వారన్నమాట. రాసిన మాట వాస్తవం. అది ఆంధ్ర విశ్వకళాపరిషద్గ్రంథాలయంలో దొరుకుతుంది. దాని సంక్షిప్త రూపం శాసన పాఠాలతో పదవ్యుత్పత్తులతోసహా లోకానికి దొరుకుతుంది— "ప్రాచీనాంధ్ర శాసనాలు" అనే పేరుతో అచ్చయింది. శాసనభాషకు వ్యాకరణం ఏమిటన్నవారు అసలు భాషకు వ్యాకరణ మేమిటో సెలవిస్తే బాగుండేది. నా గ్రంథం మహత్తరమని నే నెక్కడా చెప్పుకో లేదు. కాని రాశానని కూడా, చెప్పుకోకూడదా?

20. "మీ వ్యాకరణాలు చదవను సార్. మీకు శాసన పదాల అర్థాలు తెలీదు. వ్యాకరణం వ్రాస్తారు. భారతంలో పద్యానికి అర్థం చెప్పలేరు. భాషాశాస్త్రం వ్రాస్తారు. ఒక పదం అర్థం చెప్పరు. సమాన భాషల పదాలు చెబుతారు. పాణిని, చిన్నయ సూరిని ఆక్షేపించే మీ పాండిత్యం ఇది."

ఈ అనర్థరత్నాలు § 6.54 కు ఎదురుగా వాక్య రూపంలో ఉన్నాయి. చదవక పోతేనే మంచిది. ఘాటుగా విమర్శించవచ్చు. నా పాండిత్య విషయం ఇక్కడ చర్చనీయాంశం కాదనుకుంటాను.... 'సమానభాష' అంటే ఏమిటో విమర్శక హృదయం తెలుసుకోవాలి. అన్ని భాషలూ, అన్ని భాషాభేదాలూ సమానమైనవే. బహుశా 'సోదరభాష'లని 'సజాతీయ పదా'లని వారి భావమై వుంటుంది. ఈ ప్రస్తావనే ఇక్కడ అప్రస్తుతం. పాణినిని అధిక్షేపించిన విషయాలు ఈ వ్యాసంలో లేవు. చిన్నయను ఈ ప్రకరణంలోనే ఆక్షేపించాను, సోదాహరణంగా. వీరు అక్కడ ప్రతి విమర్శనలేమీ రాయలేదెందుకో।

21. "ఆరుద్ర కవి కుమారుడు। ఈయన పండిత, పరిశోధక వృద్ధుడు।"

ఈ ఆశ్చర్యం § 6.74లో 'భాషాస్వరూప స్వభావాలను నిర్ణయించేది ఆ భాషను మాట్లాడే ప్రజాసామాన్యమే గాని కవికా'దంటూ 'చెరిషించు. పెరిషించు.' వంటి రూపాలను ఒక కవికుమారుడు వాడినా లోకం ఆదరించి వాడటం లేదన్నప్పుడు పుట్టింది. ఆ మాటలు వాడే నాటికి ఆరుద్ర కవి కుమారుడే. ఆయన 'పండితపరిశోధకవృద్ధు'డయిన తర్వాత ఆలాంటి విశృంఖలత వర్జించాడు. కాక అప్పీ తెలిసి [illegible] మాటలు లోకపరావరణ పాలైనవంటే గౌరవాధిక్యం [illegible]



# సాహితీ సమాలోచనలు

ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం

—గిడుగు రామమూర్తి 6-00

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - విమర్శనము

—గిడుగు రామమూర్తి 6-00

కందుకూరి వీరేశలింగం డైరీలు - లేఖలు

—డా॥ అక్కిరాజు రమాపతిరావు 5.00

నుడి - నానుడి

—తిరుమల రామచంద్ర 3-00

Lectures on Linguistics

—E. M. Berezin 6-00

Dravidian Languages

—Dr. M. Andronov 9-00

సారస్వత వివేచన

—రాచమల్లు రామచంద్రారెడ్డి 6-00

సాహితీ సుగతుని స్వగతం

—తిరుమల రామచంద్ర 9-00

సాహిత్యావలోకనం

—సొదుం రామ్మోహన్ 8-00

సాహిత్య ప్రయోజనం

—కొడవటిగంటి కుటుంబరావు 9-00